# అతడు

( నవల )

రవీంద్రనాథ ఠాగూరు



జయంతి పబ్లికేషన్సు
గోపాలరెడ్డి రోడ్డు :: విజయవాడ-2.

# అతడు

## 1

సృష్టికర్త లక్షలు కోట్ల మనుష్యుల్ని సృష్టిస్తున్నాడు; కానీ మానవుని ఆశ మాత్రం అంతటితో తీరలేదు; అందువల్ల అతడుకూడా "మేమూ మానవుల్ని సృష్టిస్తాం" అని అంటున్నాడు. దాని పర్యవసానమే మానవుడు సృష్టికర్త సృష్టించిన సజీవమైన బొమ్మల ఆట ప్రక్కన తానూ బొమ్మలతో ఆట ప్రారంభించాడు. అయితే అవి అతడు స్వయంగా తయారుచేసిన బొమ్మలు. ఇక అప్పటినుంచి పిల్లలు "కథ చెప్పు" అని అడగసాగారు. అంటే "భాషతో కల్పిత మానవుల్ని సృష్టించు" అనే దాని అర్థం. వేరే చెప్పాలా ఇక, అది మొదలు రాకుమారులు, మంత్రి కుమారులు, మహారాణులు, రాకుమార్తెలు, మత్స్యకన్యలు, ముద్దుల రాణులు, రాకాసి రాణులు, అరేబియన్ నైట్సు, రాబిన్‌సన్ క్రూసోల సృష్టి ప్రారంభ మయింది. రాను రాను ఈ కల్పిత మానవుల సంఖ్య ప్రపంచ జనాభాతో పోటీ పడునంతగా హెచ్చిపోయింది. తల నెరసిన పెద్దలు సైతం తీరిక రోజు చిక్కగానే "మనష్యుల్ని తయారు చేయండి"అని అడగసాగారు. అన్నదే తడవు పదునెనిమిది పర్వాల మహాభారతం తయారయింది. దేశ దేశాలలో కథలు తయారుచేసే శ్రామిక జనం వెలిశారు.

మా మనుమరాలి ఆదేశానుసారం నేనుకూడా కొద్ది రోజుల్నుంచి కల్పిత మానవుల్ని తయారుచేసే కార్యక్రమంలో మునిగిపోయాను. నేను సృష్టించే వాళ్ళందరూ నూటికి నూరుపాళ్ళు ఆట మనుష్యులే, వాళ్ళల్లో సత్యా సత్యాల సంజాయిషీ లేమీలేవు కథ వింటున్న బాలిక వయస్సు తొమ్మిదేళ్లు, కథ చెబుతున్న నా వయస్సు డెబ్బయికి మించింది మొట్టమొదట కార్యారంభం చేసినది నే నొక్కడినే కానీ, దాని డాబూ దర్పమూ చాలా పేలవంగా ఉన్నందువల్ల పాపకూడా దానిలో చేరింది. మరొక వ్యక్తిని కూడా చేర్చుకున్నాము, అతని విషయాన్ని గురించి తరువాత తెలుసుకుందాం—

"అనగనగా ఒక రాజు" అని చాలా కథలు. ఆరంభమయ్యాయి. నేనుమాత్రం నా కథను మరొక విధంగా ప్రారంభించాను.

"అనగనగా ఒక మనిషి."

నేను కథను ఈ విధంగా ప్రారంభించాను. జనులు కథ అని చెప్పుకునే దానిలో ఉండే సామాగ్రి ఇందులో ఏమీలేదు. ఈ మనిషి ఆకాశ మార్గాన ఎగిరివెళ్లే గుర్రాన్నెక్కి అరణ్యాలనూ, మైదానాలనూ దాటి ఎక్కడికీ వెళ్ళలేదు. ఒకనాటి రాత్రి పది గంటల సమయంలో ఆ మనిషి అకస్మాత్తుగా సరాసరి నా గదిలోకి వచ్చాడు. అప్పుడు నేనేదో పుస్తకం చదువుతున్నాను.

అతడు వచ్చి రావటమే "వృద్ధ సోదరా, ఆకలిగా ఉంది" అని అన్నాడు. రాకుమారుల కథలు మనం ఎన్నో

విన్నాము, కానీ వాళ్ళెవరికీ ఆకలి ఉన్నట్లు మనం వినలేదు. అలాంటిది, ఇతనికి ఆరంభంలోనే ఆకలి వేసింది. నాకుచాలా సంతోషం కలిగింది. ఆకలిగొన్న మనిషితో సునాయాసంగా స్నేహం కలుపుకోవచ్చును. అతనిని సంతృప్తి పరచాలంటే చౌరస్తా వరకు వెళితే చాలు, అంతకు మించి ఎక్కువదూరం వెళ్ళవలసిన అవసరంలేదు.

ఆహార పానీయాలలో అతనికి చాలా ఆసక్తి ఉన్నట్లు గమనించాను. రుచిగల కూరలు, పచ్చళ్ళు, మీగడ, రసగుల్లాలు శాకాహార మాంసాహారములన్నీ ఒక్కొక్కటే వరుసగా ఆర్డరిచ్చి తినటానికి అలవాటుపడిన వ్యక్తి, తీపి వస్తువులైనా, కారపు వస్తువులైనా అతనికి ఇష్టమే. పెద్ద బజారులో అతనికి కోవా మీగడలు దొరికిన రోజున చూడాలి, దొన్నెల్నికూడా శుభ్రంగా నాకిపారేసేవాడు. ఒక్కొక్కప్పుడు అతనికి ఐస్‌క్రీం తినాలని బుద్ధిపుట్టేది, అప్పుడు అతను దానిని తినే పద్ధతి మనం తప్పక చూచి తీరాలి. మజుందార్ల అల్లుళ్ళు తిన్నట్లే ఉండేది అతని పద్ధతికూడా.

ఒకనాడు జోరున వర్షం కురుస్తూ ఉంది, నేను నా గదిలో కూర్చుని ఒక చిత్రం రాస్తున్నాను; నా గదికి ఎదురుగా ఉన్న మైదానానికి సంబంధించిన చిత్రం అది. ఆ మైదానంలో ఉత్తరదిశగా ఒక ఎర్రమట్టి రోడ్డుంది; దానికి దక్షిణపు వైపున మిట్టపల్లములుగల బీడు; అక్కడక్కడా ఈత చెట్లున్నాయి; కొద్దిదూరాన నాలుగయిదు తాటిచెట్లు దరిద్రునివలె నోళ్ళు తెరుచుకొని ఆకాశంలోకి చూస్తున్నాయి. ఒక్కదుముకులో ఆకాశము మధ్యఉన్న సూర్యునిమీదికి

లంఘించి పంజాసాచి గట్టిగా దెబ్బతీయటం కోసము పొంచి కూర్చున్న విశాలకాయంగల పెద్దపులివలె ఆతాటిచెట్లవెనుక మబ్బులు దట్టంగా గుమికూడుతున్నాయి. గిన్నెల్లో రంగులు కలుపుకొని నేను ఆ సమయంలో అదేచిత్రం రాస్తున్నాను.

ఇంతలో బయటనుంచి ఎవరో తలుపు తట్టారు. వెంటనే వెళ్ళి తలుపు తెరిచి చూశాను; ఆ వచ్చిన మనిషి రాక్షసుడో, దొంగో కాదు, పోలీసు ఆఫీసరుగారి అబ్బాయి కూడా కాదు- అతడే, ఆ మనిషి. ముద్దగా తడిసిన శరీరం నుంచి నీరు కారుతూ ఉంది; వంటిమీదున్న మురికిచొక్కా శరీరానికి అతుక్కుపోయింది, ధోవతి దిగువ భాగమంతా బురదచింది ఉంది, ఇక పాదరక్షల సంగతి చెప్పనవసరమే లేదు, వాటి నిండా బురద.

అతని పరిస్థితి చూచి "ఏమిటిదంతా?" అని అడిగాను.

"నేను బయలుదేరినప్పుడు ఎండ చాల తీవ్రంగానే ఉంది కొంతదూరం వచ్చేసరికి వర్షం ప్రారంభమయింది. ఆ మంచంమీది దుప్పటి ఇలా ఇవ్వండి. తడిదుస్తులు దానిని చుట్టుకొని కాస్సేపు విశ్రాంతిగా కూర్చుంటాను" అని అన్నాడతడు.

నా అనుమతి లభించేవరకు కూడా అతడు ఓర్పు వహించలేకపోయాడు. మంచముమీద పరచివున్న లక్నో పూలదుప్పటిని గబగబ లాక్కొని తల తుడుచుకున్నాడు. తరువాత తడిసిన దుస్తుల్ని వదలి ఆ దుప్పటిని చుట్టుకొని కూర్చున్నాడు. ఆ సమయంలో కాశ్మీరుశాలువా అక్కడ లేకపోవటం నా అదృష్టమే.

"వృద్ధసోదరా, ఇవాళ నీ కోసం పాట విన్పించనా?" అని అడిగాడు.

నే నిక చేయగలిగిందేముంది? చిత్రాన్ని రాయటం అంతటితో ఆపేశాను. అతడు తన పాట ప్రారంభించాడు—

"చేయరా, జపం చేయరా మనసా!
శ్రీకాంత నరకాంతకారినీ జపం చేయరా!—
జనన మరణ దుఃఖమహామ్మారి
అతిశయమగు కాలయముని చందాన
కీడు భయాంతమగునే మనసా!"

అప్పటి నా ముఖభావాన్ని చూచి అతనికేదో సందేహం కలిగినట్లుంది. "ఏం సోదరా! ఎలా వుంది నా పాట?" అని ప్రశ్నించాడు

"మానవమాత్రు లెవరూ నివసించని ఏ దూర ప్రదేశానికైనా వెళ్ళి జీవితపర్యంతం నువ్వు సాధనచేస్తే అప్పటికైనా ఆ చిత్రగుప్తుల వారేమైనా భరించగలగాలి" అని అన్నాను నేను.

"పాప అక్క (పాపను అతడు అక్క అంటాడు) గురువుగారివద్ద సంగీతం నేర్చుకొంటుందిగదా! నన్నుకూడా రోజూ కాసేపు అక్కడ కూర్చోబెట్టండి, ఏమంటారు?" అని అనిగాడు.

"పాపక్క అంగీకరిస్తే మధ్యనాదేముంది!" అన్నాను నేను.

అందుకు అతడు "పాపక్కను చూస్తేనే నాకుభయం" అని అన్నాడు.

ఆ మాట వినగానే నా శ్రోత పాపక్క కిలకిలనవ్వింది. తమనుచూసి ప్రపంచమంతా భయపడుతూఉంటే సంతోషం మహావీరులవలె పాపక్కకూడా ఈ మాటవిని చాల సంతోష పడింది

"భయం ఎందుకు? అతనిని నేనేమీ అననులే" అని ఆ దయామయురాలు హామీనిచ్చింది.

"నువ్వంటే భయపడని దెవరు! మాటలా, రెండు పూటలు రెండుగిన్నెల పాలుత్రాగేస్తావు - అబ్బో, నీలో ఎంతబలము ఉందనుకుంటున్నావ్? ఆ రోజున నీ చేతిలో బెత్తం చూచి పెద్దపులి తోకముడుచుకొని అత్తగారి మంచం క్రిందదూరి మళ్ళీ బయటికే రాలేదు" అన్నాను నేను.

మా వీరాంగనకు అమితసంతోషం కలిగింది. ఆసంతోషంలో అంతకుపూర్వం ఒకనాడు జరిగిన ఎలుగు విషయము ముచ్చటించకుండా ఉండలేకపోయింది - ఆ రోజున ఆఎలుగు బెదిరిపోయి ఎదురుగా ఏమున్నది కూడా చూడకుండా పరుగెత్తి చివరికి స్నానాలగదిలోని నీళ్ళతొట్టిలో పడిపోయింది.

ప్రారంభంలో ఆ మనిషి చరిత్ర నా ఒక్కనితోనే తయారవుతూ వచ్చింది, రానురాను పాపకూడా మధ్యమధ్య తన మాటలు కొన్ని చేర్చసాగింది. అతడు ఒకనాడు పగలు మూడుగంటలకు గడ్డం చేసుకునేందుకు కత్తికావాలంటూ నా వద్దకు వచ్చాడు అని నేను చెపితే చాలు వెంటనే పాప అందుకొని అతడు అల్లికసూది కోసం తన వద్దకు కూడా వచ్చాడని ఒకవార్త చెప్పేది.

కథలన్నింటికీ ఆద్యంతాలు ఉంటాయి, కానీ "అనగనగా ఒక మనిషి" అనే ఈ కథకు అంతమంటూ లేదు. అతనికి ఒక అక్కగారు ఉంటుంది ఆమెకు జ్వరం వచ్చినపుడు అతడు డాక్టరు కోసం వెళతాడు. టామీ అనే కుక్క కూడా ఒకటి ఉంటుంది. పిల్లి అతని ముక్కుమీద గోళ్ళతో గీరుతుంది, అదొక గాయమవుతుంది. మరొక రోజున ఏమి జరిగిందంటే, రోడ్డుమీద ఎవరిదో ఎద్దులబండి వెళుతూ వుంటే అతడు దాని వెనుక ఎక్కికూర్చొని షికారుకు బయలుదేరాడు అందుకు గురించి ఆ బండివానితో పెద్ద యుద్ధం జరిగింది దొడ్లో పంపువద్ద మరీ జారుడుగా ఉందేమో - జర్రున కాలు జారివెళ్ళి పనిమనిషిమీద పడ్డాడు. ఆమె చేతిలోని కుండ కాస్తా క్రిందపడి బద్దలైపోయింది. ఇంకోరోజు మోహన్ బాగ్ జరుగుతున్న 'ఫుట్ బాల్' ఆట చూద్దామని వెళ్ళాడు. జేబులో మూడణాలన్నర చిల్లరవుంటే దానిని కాస్తా ఎవరో దొంగిలించారు. అందువల్ల, పాపం! తిరిగి వచ్చేటప్పుడు భీమపండా దుకాణంలో మిఠాయి కొనుక్కోలేకపోయాడు. అతనికి కినూచౌధరని ఒక మిత్రుడు ఉంటాడు. అతనిదుకాణానికివెళ్ళి వేడివేడి పూరీకూరకు,పకోడీలకుఆర్డరిస్తూ ఉంటాడు ఇలాఒకటితరువాతఒకటి జరుగుతూనేఉంటుంది.అదీగాక ఇలా దీనిని పెంచటానికి పాప సహకారం కూడా ఉంది. ఒకరోజున అతడు పాప వద్దకువచ్చి "అమ్మగారి బీరువాలో ఉన్న పాకశాస్త్రగ్రంథం ఒకసారవ్వండి" అని అడిగాడట. దానిని చదివి సుధాకాంతుడనే తన మిత్రుడు అరటిపువ్వుతో పంచమిశ్రితమైన కూర వండిపెడతానని చెప్పాడట. మరొక

నాడు అతడు పాపక్కనడిగి సువాసన తలనూనె తీసుకు వెళ్ళాడట- నెత్తిమీది జుట్టు రాలిపోతుందనే అనుమానం కలిగిందట, చూస్తూ వూరుకుంటే బట్టతల అవుతుందేమోనని అతని భయం. ఆ తరువాత ఎప్పుడో ఒకరోజున పాట విందామని దీనూ తాతగారింటికి వెళ్ళాడట. అతను వెళ్ళేసరికి దీనూతాత దిండుకు ఆనుకొని గుర్రుపెట్టి నిద్రపోతున్నాడట.

"అనగనగా ఒక మనిషి" అనే అతనికి ఒక పేరు తప్పకుండా ఉంది; అయితే అది నాకు, పాపక్కకు ఇద్దరకు మాత్రమే తెలుసు. ఇంకెవ్వరికీ ఆ పేరు చెప్పకూడదు. అసలు ఈ కథలో వున్నమజాయే అది. "అనగనగా ఒక రాజు" అనే అతనికి కూడా పేరేమీ ఉండదు; రాకుమారుడు అంటే అతనికీ పేరులేదు పోతే, అనగనగా ఒక రాకుమార్తె ఆమె భూలోక సౌందర్యవతి, ఆమె అందాల కేశరాశి నేలను తాకుతూ ఉంటుంది, ఆమె నవ్వితే నవరత్నాలు కురుస్తాయి, ఆమె నేత్రాలు ముత్యాలు కురిపిస్తాయి, అటువంటి ఆ రాకుమార్తె పేరుకూడా ఎవరికీ తెలియదు. వీళ్ళందరికీ పేర్లు లేవు, అయినప్పటికీ ఇంటింటా వీరి పేర్లే వినబడుతూ ఉంటాయి.

"అనగనగా ఒక మనిషి" అనే మా మనిషిని మేము "అతను" అనే అంటున్నాము. ఇతరులెవరైనా "అతని పేరేమిటి?" అని అడిగినప్పుడు నేనూ పాప ఒకర్నొకరం చూచుకొని నవ్వుకుంటాం.

"అతని పేరులో మొదటిఅక్షరం "ష" అయితే అతని పేరు ఏమవుతుందో వూహించండి" అని అంటూ వుండేది పాప.

ఒకరు "పంచానన్" అని చెపితే ఇంకొకరు "పరమేశ్వర్" అనీ, మరొకరు "పరాంకుశం" అనీ, వేరొకరు "పాంచ కౌడీ" అనో లేక "ప్యారేఖాన్" అనో, "పీటర్స్" అని మరొకరు రకరకాల పేర్లు చెపుతూ వుండేవారు.

ఇంతవరకు వచ్చి కలాన్ని ఆపేసరికి "ఈ కథ ఇలాగే సాగుతుందంటావా?" అని ప్రశించారొకరు.

సాగకపోవటానికి ఇది ఎవరి కథ? ఇతడు రాకుమారుడు కాదుగదా, ఇతడు మనిషి, ఇతనికి ఆకలిదప్పులు ఉన్నాయి, తింటాడు, తిరుగుతాడు, నిద్రపోతాడు, ఉద్యోగం చేస్తూ ఉంటాడు, సినిమాలు చూడాలనే అభిలాషగలవాడు. ప్రపంచంలో జనులందరూ ఏమి చేస్తూవుంటారో అదే ఇతని కథ. ఈ మనిషిని మీ రొకసారి మీ మనసులో వూహించికొని చూడండి- అతడు ఎక్కడో ఒక దుకాణం అరుగుమీద కూర్చొని రసగుల్లాలు తింటూఉంటాడు, దొన్నెలోనుంచి పంచదారపాకం జారి అతని ధోవతిమీద పడుతూ ఉంటుంది. అతడు ఇదేమీ చూడకుండా అలాగే మైమరచి తింటూ ఉంటాడు- అతనిని గురించి మీరు చూడగలిగే వూహాచిత్రం ఇదే.

"మరి తరువాతనో?" అని అడుగవచ్చుమీరు.

"తరువాత అతడు ఆదరాబాదరా వెళ్ళి ట్రాములో కూర్చుంటాడు. జేబులో డబ్బులు లేవని అకస్మాత్తుగా గుర్తొచ్చి గబగబ లేచి క్రిందికి గెంతుతాడు" అని చెపుతాను నేను.

"ఆ తరువాతనో?" అంటారు మీరు.

తరువాత ఇలాంటివే ఎన్నో జరుగుతాయి. వాటికి అంతు ఏముంది? పెద్దబజారు నుంచి బహూబజారుకు, అటు నుంచి మళ్ళీ పెద్దబజారుకు, అక్కడినుంచి నీమ్‌తల్లాకు, ఇలా కథ సాగిపోతూనే ఉంటుంది.

ఇంతలో ఒకరు కథకు అడ్డొస్తూ "లోకానికి విలక్షణంగానూ, కొద్దోగొప్పో విచిత్రంగానూ ఉండాలిగాని పెద్దబజారు బహూబజారు, నీమ్‌తల్లా ఇవన్నీ ఏమిటి? అక్కడ తిరగని వాడెవడినో తీసుకొని కథ సాగించకూడదా యేం?" అని అడిగాడు.

"సాగితే లేనిదేముంది, లేనప్పుడే ఏమీ లేదుగానీ" అన్నాను నేను.

"అయితే అలాగే కానివ్వండి. ఎలాంటిదైనా సరే, అది వ్యర్థమైనదే కావచ్చు లేదా తీరూ తెన్నూ ఏమీ లేనిదీ కావచ్చు, వికృతమూ కావచ్చు - కానీ తలాతోకా, అర్థంపర్థంలేని ఇదీ కథేనా?"

"అవును, పోటీ అంటే ఇదే బ్రహ్మదేవుని సృష్టి యావత్తు నియమనిబంధనల ఉచ్చుల్లో బిగిసి జరగవలసినది జరగకమానదు అనే పద్ధతిలో ఉంటుంది. అది మరీ దుర్భరం. దండిస్తాడనే భయం లేదుగనుక ఇలాంటి విషయాల్లో నైనా ఏకరస విధానంగల సృష్టికర్త తాతయ్యతో పరిహాసాలాడాలి. అతని సృష్టిని పరిహసించే ప్రతిసృష్టిచేసి ఆనందిద్దాం ఇది ఆ సృష్టికర్త తాతయ్య అధీనంలోగల ప్రాంతంకాదుగనుక మనకు భయం దేనికి?"

మా "అతడు" ఒకమూల కూర్చొని ఉన్నాడు. నా మాటలు విని లేని దగ్గరగావచ్చి చెవిలో "వృద్ధసోదరా, నీ ఇష్టంవచ్చినట్లు సాగించు. నా పేరుమీద నీ మనసుకు తోచి నట్లు నిరభ్యంతరంగా, నిర్భయంగా సాగించు- నేనేమీ నీతో దెబ్బలాడను" అని అన్నాడు.

ఇక ఇప్పుడు ఈ మనిషిని గురించి కొద్దిగా పరిచయం చేస్తాను.

పాపక్క సహాయంతో నేను చెపుతూఉన్న ఈ కథకు ఒక సర్వనామధారి "అతడు" మూలాధారము అందువల్ల ఏది ఎలా చెప్పినా ఏమీ ఇబ్బంది లేదు, అందులో ఎక్కడా ఏది ఎలా చెప్పినా ఏమీ యిబ్బందిలేదు. అందులో ఎక్కడా ప్రశ్నల ఎదురుదెబ్బలు తగులుతాయనే భయమే ఉండదు. కానీ ఈ అద్భుతసృష్టిని కళ్ళతో చూచినట్లు నిరూపించటానికి ఒక సశరీరుడ్ని చేర్చక తప్పలేదు. సాహిత్య విషయంగా పరిస్థితి విషమించి నా వల్ల ఏమీకానప్పుడు ఈ మనిషి సాక్ష్యం చెప్పటానికి సిద్ధమవుతూ ఉంటాడు. అతనికిఎక్కడా ఎలాంటి ఆటంకాలు లేవు. నా వంటి వకీలు కొంచెం సైగచేస్తేచాలు అతడు ఎంతో సునాయాసంగా చెప్పుకు పోతాడు- అతడు కచరాపాడా కుంభమేళాకు వెళ్ళి గంగా నదిలో స్నానంచేస్తూ ఉండగా అతని పిలకను మొసలి గట్టిగా పట్టేసిందట. చివరకి మనిషిమాత్రం పైకితేలి పిలక కుదురు వరకువూడి మొసలి కోరల్లో చిక్కుకొని పోయిందట. ఇంకా కొంచెం సైగచేస్తే అతడు మరింత సిగ్గులేకుండా చెపుతాడు- "మనమోదక్" అనే ఓడలోఉండే గజీతగాడగు ఒక ఆంగ్లే

యుడు ఏడు మాసాలు వరకు గంగలో మునిగి వెతగ్గా వెతగ్గా ఎలాగైతేనేం చివరికి నాలుగైదు వెంట్రుకలు తప్ప మిగిలిన పిలకనంతటినీ తేగలిగాడు; ఆ సందర్భంలో అతనికి మూడు రూపాయల నాలుగణాలు రొఖ్ఖం బహుమతిగా కూడా ఇవ్వబడింది. "తరువాత ఏం జరిగింది?" అని గనుక పాఠక ప్రశ్నిస్తే వెంటనే అతడు ఈ విధంగా చెప్పనారంభిస్తాడు- "తరువాత డాక్టరు నీలరతన్‌గారి కాళ్ళమీదపడి "అయ్యా! ఏ విధంగానైనా సరే మీరు నా పిలకను పునరుద్ధరించి పూజాపుష్పాలను ధరించే అదృష్టం కలిగించండి. జీవితాంతం మీకు ఋణపడివుంటాను" అని వేడుకున్నాను. అప్పుడా డాక్టరుగారు ఒకానొక యోగిపుంగవుడు ప్రసాదించిన లేప నంతో నా పిలకను తిరిగి యథాస్థానంలో అతక గలిగారు అలనాడు శ్రీకృష్ణుని దయవల్ల ద్రౌపతి వంటిమీద చీరలు పెరిగినట్లుగా తరువాత నా పిలక అదేపనిగా పెరిగిపోసాగింది. బిగించి తలపాగా చుట్టినప్పటికీ అది బెలూన్‌వలె ఉబ్బు కొచ్చేది; ఆ విధంగా అది విస్తరిల్లి చివరకు దైత్యపురంలోని కుక్కగొడుగువలె శిరోభాగాన గొడుగు ఆకారం దాల్చింది. దాని బాధను భరించలేక తరువాత నెలజీతానికి ఒక మంగ లిని నియమించుకొని జాముకోసారి అతనితో మాడు చీల్పిం చుకోవలసిన గతిపట్టింది."

అప్పటికీ పాఠక కుతూహలంతో వింటూవుంటే అతడు దీనంగా ముఖంపెట్టి ఇంకా చెప్పుతూనే వుండేవాడు- "మెడికల్ కాలేజీలోని ఒక సర్జను చొక్కా చేతులు పైకి మడిచి నా మాడుమీద బరమతో రంధ్రంచేసి అక్కడ ఒక

రబ్బరు బిరడా బిగించి, ఇక జన్మజన్మాలకూ అక్కడ పిలక మొలవకుండా సీలువేయాలని పట్టుదలగా కూర్చున్నాడు. కానీ, పాపం! ఈ జన్మనుంచి ఎగిరి చికిత్స మరోజన్మలో విశ్రాంతి తీసుకుంటుందనే భయంవల్ల నేను అందుకు అంగీకరించలేదు "

మా "అతను" అను ఈ పదార్థం క్షణంలో జన్మించినది. ఇలాంటి మనిషి కోటికి ఒకడు ఉంటాడేమో; అబద్ధాలు అల్లటంలో అతనికెవ్వరూ సాటిరారు. ముల్లోకాలలో ఎక్కడాలేని అత్యద్భుతమైన ఈ కథకు ఇంత గొప్ప సమాధాన కర్త లభించటం నా అదృష్టమని మాత్రం అంగీకరించి తీరాలి. అబద్ధపు ప్రశ్నలకు జవాబుల గొలుసులాంటి ఈమనిషిని నేను మధ్య మధ్య పాపక్క ఎదుటకు తెచ్చి నిలబెడుతూ ఉంటాను. ఇతనిని చూడగానే ఆమె విశాల నేత్రాలు మరింత విప్పారేవి. సంతోషంతో ఆమె వెంటనే బజారునుంచి వేడి వేడి జిలేబి తెప్పించి అతనికి పెడుతూ వుండేది. వేడి వేడి జిలేబి అంటే అతనికి చెడ్డయిష్టం, సికదారాపాడాలోని చమ్ చమ్‌లన్నా అతనికి చాలా ఇష్టమే.

అలాంటి సమయాల్లో పాపక్క "మీ ఇల్లెక్కడ?" అని అతనిని అడుగుతూ ఉండేది.

"ఏది అనే నగరంలో ప్రశ్నార్థచిహ్నపు సందులో" అని అతడు జవాబు చెప్పేవాడు

పేరు చెప్పడేం? పేరు చెప్పినందువల్ల ఆ పేరుగల మనిషి కేవలం తనలోపలే చిక్కుబడి ఉండిపోతాడని భయం. ప్రపంచంలో నేను ఒక్కడిని, కేవలం ఒక మనిషిని, నువ్వా

అదే; ఈ నువ్వూ నేనూ తప్ప మిగిలినది అంతా "అతడు"లే గదా! మా ఈ "అతడు" మా కథలోని "అతడులు" అందరి తరఫున ఏకైక ప్రతినిధి.

మరోసంగతి. ముందుగా చెప్పటమే మంచిది. మా ఈ అతడిని ఆధారంగా అల్లిన కథను గురించి ఎవరైనా మంచి చెడులను నిర్ణయించేట్లతే అది వారి పొరపాటే. అతడిని ప్రత్యక్షముగా చూచిన వారికి అతడు చాలా సత్పురుషుడనీ, అతని ముఖం ఎంతో గంభీరంగా ఉంటుందనీ తెలుసు రాత్రులందు నక్షత్రాలు కాంతిని వెదజల్లినట్లే అతడిగాంభీర్యంకూడా చిరునవ్వు చిందిస్తూ ఉంటుంది. "అతడు" మొదటి తరగతికి చెందిన మనిషి, అందుకనే నవ్వులు వేళాకోళాలు అతనినేమీ బాధించలేవు అతడు నా కంటె తెలివైనవాడు కావటంవల్ల అతనిని తెలివితక్కువ దద్దమ్మగా చేయుటమూ, రకరకాలుగా అలంకరించటమూ నాకు చాలా ఇష్టం. తెలివితక్కువ దద్దమ్మవేషం వేసినప్పటికీ అతని గౌరవానికి ఎలాంటి లోపమూ రాదు సరిగదా అది చక్కగా అతికి పోతుంది పాపక్క స్వభావానికి ఆ వేషం చాలా దగ్గరగా ఉంటుంది.

## 2

కొద్దిరోజుల క్రితం పాపక్క విహారార్థము డార్జిలింగుకు వెళ్ళింది. బుర్రలో అతడు ఒంటరిగా నా అధీనంలోనే ఉండి పోయాడు. అతనికీ ఏమీ తోచటంలేదు. నాకూ విసుగ్గానే ఉంది.

"నన్నుకూడా డార్జిలింగుకు పంపేయరాదా?" అని అన్నాడు అతడు.

"ఎందుకు?" అని అడిగాను.

"పురుషుడనై పనీ పాటా లేకుండా కూర్చున్నానని అందరూ నిందిస్తున్నారు" అని అతడు అన్నాడు.

"అక్కడమాత్రం నువ్వుచేసే పనేముంది?"

"పాపక్క బొమ్మల ఆటలో కాగితపుముక్కలు చించి గుజ్జనగూళ్ళు వండుతాను."

"నువ్వు అంతశ్రమపడలేవు. కాస్సేపు నువ్వేమీ మాట్లాడకు. నే నిప్పుడు హూంహోహూం ద్వీపచరిత్ర రాస్తున్నాను."

"వృద్ధసోదరా! హూంహోహూం అనే పేరు వినటానికి చాలా చక్కగా ఉంది. నిజం చెప్పాలంటే ఇలాంటిపేరు నువ్వు రాసినదానికంటె నా నోటినుంచివస్తే చాలా బాగుండేది. ఇంతకూ దానిని గురించి వివరాలేమైనా చెప్పగలవా?"

"ఇదేమీ ఎగతాళికాదు. చాలా గంభీరమైన విషయం. దీనిని విశ్వవిద్యాలయం వాళ్ళు పాఠ్యగ్రంథంగా నిర్ణయించవచ్చుననికూడా ఆశిస్తున్నాను. ఇప్పటికప్పుడే శాస్త్రవేత్తల బృందం ఒకటి ఆ శూన్యద్వీపానికి వెళ్ళి తీవ్రంగా పరిశోధనలు సాగిస్తున్నారు."

"అసలు విషయం ఏమిటో కొంచెం నాకు అర్థమయ్యేట్లు చెప్పు అక్కడవారు చేస్తున్న పరిశోధనలు ఏమిటి? ఆధునిక పద్ధతుల్లో వ్యవసాయం చేస్తున్నారా?"

"లేదు, లేదు. అలాంటిదేమీ లేదు. అక్కడ జరిగేది అందుకు పూర్తిగా విరుద్ధమైనది. వ్యవసాయంతో వారికి నిమిత్తమే లేదు."

"అలాంటప్పుడు ఆహార సమస్య ఎలా?"

"పూర్తిగా విసర్జించారు "

"ప్రాణాలు నిలిచేదెలా?"

"ప్రాణాలను గురించి ఆలోచించటమే అన్నిటికంటె తుచ్ఛమైనది. పాక యంత్రానికి వ్యతిరేకంగా వాళ్ళు సత్యాగ్రహం చేస్తున్నారు. జఠరయంత్రంలాంటి క్లిష్టవస్తువు ప్రపంచంలో మరొకటి ఉండదని వారి ఉద్దేశ్యం. ప్రపంచం లోని సమస్త రోగాలు-రొష్టులు, యుద్ధాలు-విఘ్నాలు, దోపిడీలు, దొంగతనాలు - వీటన్నిటకీ మూలకారణం ఈ జఠర యంత్రమేననికూడా వారి అభిప్రాయం."

"వృద్ధసోదరా, అదంతా నిజమే కాని దానిని జీర్ణించుకోవటం కష్టం."

"నీకు కష్టంగానే ఉంటుంది. కానీ వాళ్ళందరూ గొప్ప శాస్త్రవేత్తలుగదా! పాకయంత్రాన్ని పీకి అవతలపారేశారు. పొట్ట లోతుకుపీక్కుపోయింది. అందరూ ఆహార పానీయాలను విసర్జించారు. నశ్యక్రియను ఆచరిస్తున్నారు. ప్రతి క్షణమూ గాలితోపాటు బలాన్నిచ్చు ఔషధమును ముక్కు ద్వారా గ్రహిస్తున్నారు. కొంత లోనికి పోతుంది, కొంత తుమ్ములద్వారా బయటకు వస్తూవుంటుంది. రెండుపనులూ ఒకేసారి జరుగుతాయి. దేహం శుభ్రపడుతూనూ ఉంటుంది, బలమూ చేకూరుతుంది."

"వారిపని చాలా విచిత్రంగానే ఉంది సుమా! కరెంటు, తిరగలిలాంటి దేదైనా పెట్టారా? కోళ్ళను, బాతుల్ని, గొర్రెల్ని, మేకల్ని, బంగాళా దుంపలు వగైరాలన్నీ కలిపి ఎండబెట్టి పిండివిసిరి డబ్బాలలో పోసి ఉంచుకున్నట్లున్నారు, అంతేనా?"

"అలాంటిదేమీ లేదు. పాకయంత్రము, కసాయిదుకాణాలు ఈ ప్రపంచంనుంచి పూర్తిగా పోవాలని వారిసిద్ధాంతం. ఆకలిబాధనూ, బిల్లు చెల్లించవలసిన ఇబ్బందినీ ఒకేసారి తొలగించవలెనని వారి అభిలాష. జగత్తులో శాశ్వతంగా శాంతిని స్థాపించాలని రాత్రింబవళ్ళు కృషిచేస్తున్నారు."

అయితే, వారు సస్యాన్ని కూడా తిను పదార్థాలతో తయారుచేయరన్నమాట! అలా చేయటం వల్లకూడా మళ్ళీ క్రయవిక్రయ బాధలు ఉంటాయిగదూ!"

"నేను చెప్పేదవిను. జీవలోకంలో భూమిని భేదించుకొని ఘట్టు చెట్లు మొదలగు పచ్చని అంశమే ప్రాణుల ఆది పదార్థము; ఈ విషయం తెలుసుగదా?"

"ఈ పాపపు నోటితో తెలుసునని ఎలా చెప్పేది. కాని తెలివిగలవారు అంతగట్టిగా చెపుతూఉంటే అంగీకరించక తప్పదు."

"ద్వైపాయన పండితబృందం గడ్డినుంచి పచ్చనిసారం తీసి దానిని సూర్యుని వంగపూత వన్నెగల ఎండలో బాగుగా ఎండబెట్టి గుప్పెళ్ళతో ముక్కులలో కుక్కుకొంటున్నారు. ప్రాతఃకాలమందు కుడిముక్కులోనూ, మధ్యాహ్నమందు ఎడమ ముక్కులోనూ, సాయంత్రము రెండు ముక్కుల్లోనూ

కూరుకుంటారు. సాయంత్రము కూరుకోవటమే వారికిసింరైన భోజనము. ఆ బృందపు తుమ్మలకు అక్కడి పశుపక్ష్యాదులన్నీ బెదిరి సముద్రాన్ని దాటి అవతల ఒడ్డుకు పారిపోతున్నాయి"

"వినటానికి భలే బాగుంది. చాలాకాలంగా ఏమీ పని లేకుండా కూర్చున్నందువల్ల నా పాకయంత్రం నన్ను చంపుకు తినేస్తుంది వృద్ధసోదరా- నువ్వు చెప్పిన ఆ నశ్యానికి ముందుగా మార్కెట్టులో నాకేగనుక ఏజన్సీ లభిస్తే-"

"చాలా చిక్కేవచ్చింది. అదేమిటో తరువాత చెపుతాను. వారిది మరొక సిద్ధాంతం కూడా ఉంది- 'మనిషి తన రెండు కాళ్ళమీద నిలబడి నడవటంవల్ల అతనిహృదయ యంత్రమూ, పాకయంత్రమూ వ్రేలాడుతూ వుండి క్షీణించి పోతున్నాయి; లక్షల కోట్లసంవత్సరాలనుంచి ప్రకృతి విరుద్ధమైన ఈదురంతంజరుగుతూవస్తుంది. ఆయుర్దాయాన్ని క్షీణింపజేసుకుంటూ అందుకు జరిమానా చెల్లించవలసి వస్తూఉంది. స్త్రీ పురుషులందరూ వ్రేలాడుతున్న హృదయంతోనే చనిపోతున్నారు; చతుష్పాదులకు ఇలాంటి బెడద లేదు' అని వారు అంటున్నారు."

"అర్థమయింది, కానీ ఇందుకు ఉపాయమేమిటి?"

"ప్రకృతియొక్క మూలార్థాన్ని శిశువులను చూచి నేర్చుకోవాలని వారు చెపుతారు. ఆ ద్వీపంలో ఒకానొక ఉన్నత పర్వత శిఖరంమీద ఒక గురువుగారు 'అందరూ మోకాళ్ళమీద పాకుతూ నడవండి, భూమిమీద ఎక్కువ

కాలం జీవించి ఉండాలంటే తిరిగి చతుష్పాద నడకను నేర్వండి' అని శిలాశాసనం చెక్కించారు ''

"బాగు, బాగు! మరేమీ మిగల్లేదు గదా!"

"మాట్లాడటమనేది మనిషి తాను సృష్టించుకున్నదే కాని ప్రకృతిసిద్ధమైనది కాదని కూడా వారి ఉద్దేశ్యం. దాని వల్ల అనుక్షణం శ్వాస క్షీణిస్తూ ఉంటుందట శ్వాసక్షీణించటంవల్ల ఆయుర్దాయం తగ్గిపోతుందట. తమ సహజ ప్రతిభతో వానరములు ఏనాడో ఈ విషయాన్ని గ్రహించాయి. త్రేతాయుగంలోని హనుమంతుడు నేటికీ జీవించి వున్నాడు. అందుకని వారు ఆ నిర్జనద్వీపానికి వెళ్ళి విశుద్ధ ఆదిమబుద్ధిని అనుసరిస్తున్నారు అందరూ తలకిందికిపెట్టి పూర్తిగా మౌనం వహించారు. ద్వీపమంతటా ఎక్కడ చూచినా ముక్కులతో తుమ్మటమేకాని నోటితో మాట్లాడటం వినిపించదు."

"ఒకరితో ఒకరు మాట్లాడుకోవాలన్నా. ఒకరి అభిప్రాయాలను మరొకరు తెలుసుకోవాలన్నా ఏంచేస్తారు?"

"అక్కడ వారు అతివిచిత్రమగు సైగల భాషను సృష్టించుకున్నారు. ఒకప్పుడు ఏతము తోడినట్లో, వడ్లు దంచినట్లో లేక మరొకప్పుడు విసనకర్రతో విసురుకున్నట్లుగానో, ఒక్కొక్కప్పుడు పెద్దగాలీ వానకు ఊగిపోయే పోకచెట్టు మాదిరిగా అటు ఇటు తలగట్టిగా ఆడిస్తూ మాట్లాడుకుంటారు. అలాంటి భాషతోపాటు కనుబొమలు ముడివేసి, కళ్ళు ఆడిస్తూ కవిత్వాన్ని కూడా చెపుతారు. వారిని చూచిన ప్రేక్షకులు కన్నీరుకార్చటం కూడా అతిశయోక్తి కాదు. నశ్యక్రియను ఆచరించే ప్రదేశం స్తంభించి పోయింది."

"వృద్ధసోదరా, నాకు కొంతపైకం అప్పుగాఇవ్వు. నీ మేలు మర్చిపోను. హూc హా హూc ద్వీపానికి నేను వెళ్ళి తీరాలి. ఇంత గొప్ప నూతాన్నానందాన్ని -"

"ఆ నూత్నము ఇంకా పాతబడనైనా లేదా? తుమ్ముతూ తుమ్ముతూ ఆ జననివాసము నిర్జనమైపోయింది. ఎక్కడచూచినా పచ్చని సశ్యపు కుండలు :ండుగా పడి వున్నాయి. ఆ సశ్యమును పీల్చుటకు ఒక ముక్కు కూడా మిగలలేదు."

"నాకు ఇప్పుడు అర్థమయింది. ఈ హూcహాహూc ద్వీప చరిత్రను చెప్పి పాఠక్కుకు ఆశ్చర్యం కలిగించాలను కొంటున్నావు నిర్భాగ్యుడగు "అతడు" అనేపేరుగల నన్ను శాస్త్రవేత్త వేషంవేసి ఆ ద్వీపమంతటా తుమ్ములతో త్రిప్పి చంపాలని నిర్ణయించుకొని ఉంటావు. "అతడు" సైగల భాషతో తలఆడిస్తూ "ఘటోత్కచవధ" దృశ్యాన్ని మరి పించినట్లు వర్ణిస్తావు చతుష్పాద నడకను సాధించి అందంగా మెడత్రిప్పే ఏస్త్రీనో వెతికితెచ్చి నాకు భార్యగా చేయటానికి కూడా ప్రయత్నం చేయవచ్చును. మెడత్రిప్పుడుమంత్రంతో వధువు ఎడమనుంచి కుడికి తల ఆడిస్తుంది. వరుడు కుడినుంచి ఎడమకు ఆడిస్తాడు. చతుష్పాద నడకనే సప్తపదిగా నిరూ పిస్తావు. ఆ ద్వీపవాసుల సెనేట్‌హాలులో తలఆడించేభాషలో పరీక్షకు అందరూ వరుసగా కూర్చున్నప్పుడు నన్నుకూడా ఒకమూల ఎక్కడో కూర్చోబెడతావు. నామీద నీకేమీ దయాదాక్షిణ్యం లేదుగనుక నన్ను ఆ పరీక్షలో తప్పిస్తావు. కాని వారి స్పోర్టింగ్‌క్లబ్బులో జరిగే చతుష్పాదనడకలో

మాత్రం మొదటి బహుమతి నాకే ఇప్పిస్తావు. ఇదంతా ఎందుకు ముందుగానే హెచ్చరిస్తున్నాను, గుర్తుంచుకోండి- పాపక్కను ఈ విధంగా నవ్వించటం మీ వల్ల జరగదని మాత్రం మర్చిపోవద్దు"

"అధికంగా వాగకు. చాణుక్య పండితుడు జనుల ఆయుర్దాయవృద్ధిని గురించి 'తాపచ్ఛ జీయతే మూర్ఖ యావత్ న బకబకాయతే' అని చెప్పాడు. నీకు సంస్కృతం కొద్దిగానైనా తెలుసునా?"

"నేర్చుకున్న దానికంటే మర్చిపోయిందే ఎక్కువ. వృద్ధసోదరా నవీన చాణుక్యులు ప్రపంచహితాన్నికోరి చెప్పిన ఉపదేశాలను కూడా నువ్వు తెలుసుకోవాలి. 'పండితలోకం మానంవహిస్తే అదే పదివేలు, బతికుంటే బలుసాకు తినొచ్చు' అని చెప్పిన ఈ కవిత్వం శాగాలేదా! చివరికి నేను నీకు చెప్పే సలహా ఏమంటే నీ ఇష్టం వచ్చినట్లు చిన్న తనపు చిలిపి చేష్టలు చేసినా ఇబ్బందిలేదుగానీ శాస్త్రవేత్తల రసికతారసాయనం మాత్రం విసర్జించు."

ఈ కథ పాపక్కకు ఏమీరుచించలేదు. ఆమె ముఖం చిట్లించి "ఇలాంటివి జరుగుతాయంటే నాకు నమ్మకం లేదు. నశ్యంతో ఆకలితీరటం అసంభవం" అని అన్నది.

"ముందుగా పొట్టను మాయం చేశారు, ఆకలి ఎలా తెలుస్తుంది?" అని అన్నాను నేను.

"అదా సంగతి" అని పాపక్క స్థిమితపడింది.

చివరకు మాట్లాడటము మానేసే విషయం వద్దకు వచ్చేసరికి బండి ఆగింది. ఆ సంగతి విని ఆమె "మాట్లాడకుండా బ్రతకటం ఎలా సాధ్యం?" అని అడిగింది.

"మాట్లాడినందువల్లనే మనిషిమరణిస్తున్నాడని వాళ్ళ గురువు భోజపత్రములమీద వ్రాసి ద్వీపమంతటా ప్రచారం చేశాడు. మాట్లాడిన మనుష్యులందరూ మరణించినట్లు ఆ గురువుగారు లెక్కలతోసహా నిరూపించాడు" అని నేను జవాబు చెప్పాను

అయితే మరిమూగవాళ్ళు చనిపోవటం లేదా?" అని పాపక్కకు అకస్మాత్తుగా సందేహం కలిగింది

"అలాంటివాళ్ళు మాట్లాడకపోయినప్పటికీ కడుపు నొప్పివల్లలో, జ్వరాదులవల్లనో, జలుబువల్లనో చని పోయారు" అని నా జవాబు.

నా జవాబు పాపక్కకు సబబుగానే కన్పించింది. అప్పుడు ఆమె తాతగారి వైపుతిరిగి "తాతా, ఈవిషయంలో మీ ఉద్దేశం ఏమిటి?" అని ప్రశ్నించింది.

"కొందరు మాట్లాడటంవల్ల మరణిస్తే మరికొందరు మాట్లాడకుండానే మరణిస్తున్నారు" అని అన్నాను నేను.

"ఇంతకూ నీ కోర్కె ఏమిటి?"

"హూం హాం హూం ద్వీపానికి వెళ్ళి అక్కడే ఉండి పోవాలని ఆలోచిస్తున్నాను. జంబూద్వీపం నన్ను వాగించి వాగించి చంపేస్తూ ఉంది. వాగటం ఇక నా వల్లకాదు."

# 3

మా "అతడు" శృగాల పరిశోధన సమితి రిపోర్టును పంపాడు. పాపక్క దర్బారులో అది చదవబడుతుంది.

సాయంత్రం చల్లగాలికి అటు ఊరిబయట మైదానం లోకి వెళ్ళాను. అదేసమయాన ఒక నక్క నా వద్దకు వచ్చి "దాదా, మీరు మీ పిల్లల్ని మానవులుగా తయారు చేస్తున్నారు. మమ్మల్ని గురించి మీరేమీ ఆలోచించటమే లేదు. ఇంతకూ నేను చేసిన అపరాధం ఏమిటో చెప్పండి" అని అడిగింది.

"ఇంతకూ ఇప్పుడు నన్నేమి చేయమంటావ్?" అని అడిగాను నేను.

"నేను పశువునే కావచ్చుగాక, అంతమాత్రాన నా కిక ముక్తి లేదా? నీ చేతుల్లోనే నేను మనిషిని కావాలని గట్టిగా నిశ్చయించుకున్నాను" అని అంది ఆ శృగాలము.

దాని మాటలు విని నాలోనేనే "ఇదికూడా మంచిదే, పుణ్యకార్యము" అని అనుకున్నాను.

"అసలు నీ కీ కోర్కె ఎలా కలిగింది?" అని అడిగాను నేను.

"నేను గనుక మనిషిని కాగలిగినట్లయితే మా శృగాల జాతిలో నా కొక గౌరవస్థానం లభిస్తుంది. అందరూ నన్ను పూజిస్తారు" అని అశృగాలము జవాబు చెప్పింది.

"అలాగైతే మంచిదే" అన్నాను నేను.

ఈ వార్త మిత్రులందరతోనూ చెప్పాను. అందరూ చాలా సంతోషించారు. "పనిలాంటి పని ఒకటి దొరికింది. దీనివల్ల ప్రపంచానికి మేలుకలుగుతుంది" అన్నారు అందరూ. మేము అందరమూ కలసి ఒక సభ జరిపాము. దానికి 'శృగాల పరిశోధన సమితి' అని పేరు పెట్టాము.

మా పేటలో పూర్తిగా శిథిలమైపోయినపూర్వకాలపు ఒక చండీమండపం ఉంది. అక్కడ ప్రతిరోజు రాత్రి తొమ్మిది గంటల తరువాత శృగాల మానవీకరణ పుణ్యకార్యం జరుగుతూఉంది.

నేను ఆ శృగాలము నుద్దేశించి "పత్నా, మీ శృగాలజాతి నిన్ను ఏ పేరుతో పిలుస్తారు? అని అడిగాను.

అందుకా శృగాలము "నా పేరు హువ్వాహువ్వా" అని చెప్పింది.

"ఛీఛీ, ఈ పేరు ఎంతమాత్రం పనికిరాదు. మనిషివి కావాలని ఉంటే ముందు పేరు మార్చుకోవాలి. ఆ తరువాత రూపము మారుతుంది. ఇవాల్టినుంచి నీ పేరు శివరామ్ అనుకో" అన్నాను నేను.

"సరే" అని అది అంగీకరించింది. హువ్వాహువ్వా పేరు నచ్చినంతగా ఆ శృగాలానికి ఈపేరు నచ్చలేదని దాని ముఖభావాన్నిబట్టి నేను గ్రహించగలిగాను. కానీ అది మనిషి కాదలిచినప్పుడు వేరే గత్యంతరమేమీ లేదు.

దానిని రెండుకాళ్ళమీద నిటారుగా నిలబెట్టటం మా మొదటిపని. అందుకు చాలా రోజులవరకు ప్రయత్నం చేయవలసి వచ్చింది. అతికష్టంమీద అది అడుగులు తడబడుతూ

మధ్యమధ్య పడుతూలేస్తూ నడవసాగింది. ఆరుమాసాలకు ఆ శృగాలము ఒక విధంగా తిన్నగా నిలబడగలిగింది. పంజాలను కప్పటకు మేజోళ్ళు, పాదరక్షలు తగిలించారు. చివరికి మా సమితి అధ్యక్షులు బైరాగి మహాశయులు శృగాలమును పిలిచి "శివరామ్, ఇప్పుడిక నువ్వు నీ ద్విపద చంధరూపాన్ని అద్దంలో చూచుకో. నీకు నచ్చినదో లేదో చూచి చెప్పు" అని అన్నారు.

శివరామ్ అద్దం ముందుకు వెళ్ళి చాలా సేపటి వరకు అటునిటు తిరిగి, తలవంచి చూస్తూ ఉండిపోయాడు. చివరికి "బైరాగి మహాశయా, ఇక్కడ మీ ముఖ పోలికలు రాలేదు గదా!" అని అన్నాడు శివరామ్.

"శివరామ్! నిటారుగా నిలబడటం నేర్చుకున్నంత మాత్రాన అంతా అయిపోయిందా? మనిషికావటం అంత తేలికైన పనికాదు. మరి ఈ తోకను ఏంచేస్తావు? దాని మీదున్న మమకారం వదులుకో గలుగుతావా?" అని అడిగారు బైరాగి మహాశయుడు.

శివరామ్ ముఖంలో నల్లని విచారమేఘాలు క్రమ్ముకొన్నాయి. చుట్టుపట్ల పదిపదిహేను శృగాల పల్లెలలో శివరామ్ తోక చాలా ప్రసిద్ధి

మామూలు శృగాలములు దానికి 'ప్రసిద్ధతోకగాడు' అని పేరు పెట్టాయి. శృగాలముల సంస్కృతి బాగా తెలిసిన వారు వాటి భాషలో శివరామ్‌ను 'సులోమలాంగులి' అని పిలిచేవారు. తోకను ఉంచుకోవటమా తీసివేయటమా అనే విషయాన్ని గురించి శివరామ్ రెండుమూడురోజులు నిద్రా

హారాలు మాని ఆలోచించాడు. చివరికి గురువారంరోజున "తోకను తీసివేయటం నాకు ఇష్టమే" అని ప్రకటించాడు.

వస్తుగా కుంచెవలె పెరిగిన గులాబిరంగు రోమములు గల శివరామ్ తోకను మొదలంటా నరికి వేశారు.

సమితి సభ్యులందరూ హర్షధ్వానాలు చేస్తూ "ఆహా! పశు జన్మనుంచి విముక్తి లభించింది! అని అన్నారు ఇంత కాలానికి యీ శృగాలమునకు తోక అనే మాయనుంచి ముక్తి లభించింది. నీ జన్మతరించింది."

ఆ రోజంతా శివరామ్‌కు ఏమీ తినబుద్ధి కాలేదు, ఆ రాత్రంతా అతనికి తనతోక కలలో కన్పిస్తూనే ఉంది.

రెండవ రోజున శివరామ్ సమావేశానికి హాజరయ్యాడు. బైరాగి మహాశయుడు అతనిని చూచి "ఏం శివరామ్‌గారూ, శరీరం కొంచెం తేలికగా ఉందిగదూ!" అని అడిగారు.

"చిత్తం, చాలా తేలికగా ఉంది. తోకపోయింది కానీ, శరీరవర్ణం మనిషికివలె లేదనే సందేహం మనసును పట్టి పీడిస్తూ ఉంది."

"పూర్తిగా మానవ శరీర వర్ణం కావాలనే అభిలాష గనుక ఉండేట్లయితే నీ శరీరం మీది రోమాలనుకూడా తొలగించి వేయాలి" అని బైరాగి మహాశయుడు సలహాచెప్పారు.

చివరికి తినూ మంగలిని పిలిపించారు.

శరీరంమీది రోమాలన్నీ శుభ్రం చేయటానికి ఐదు రోజులు పట్టింది. శివరామ్ శరీరం మెరిసిపోసాగింది. సభ్యులకు అది చూచి నోటివెంట మాటరాలేదు.

శివరామ్ వారి మౌనమునుచూచి ఆందోళన చెందుతూ "మహాశయులారా, మీ రందరూ మౌనం వహించా రెందు వల్ల?" అని అడిగాడు.

"మేము చేసిన ఈ పనికి మాకే ఆశ్చర్యం కలిగింది" అని సభ్యులు తెలియజేశారు.

శివరామ్ మనస్సు స్థిమిత పడింది. తెగినతోకను గురించి, పోయిన శరీరం మీది రోమాలను గురించి విచారం తొలగిపోయింది.

'శృగాల పరిశోధన మండలి' సభ్యులందరూ కళ్ళు మూసుకొని "శివరామ్, ఇంతటితో సమావేశం ముగిద్దాం. ఇప్పుడిక-" అని అన్నారు.

"మా శృగాల జాతినంతా ఆశ్చర్యపర్చటమే నే నిప్పుడు చేయవలసిన పని" అన్నాడు శివరామ్

ఇక్కడ కథ ఇలా ఉండగా శివరామ్ మేనత్త ఖేంఖణి అక్కడ ఇంటివద్ద ప్రాణం పోయేట్లు ఏడుస్తుంది. తమ శృగాలవాడ నాయకుడగు హుక్కాయీ వద్దకువెళ్ళి "చౌదరి గారూ, ఇప్పటికి సంవత్సరం నుంచి మా హువ్వాహువ్వా కన్పిం చటం లేదు. ఏమైపోయాడో ఏమో? పెద్దపులికో, ఎలుగు బంటికో చిక్కి ఉండడుగదా!" అని అడిగింది.

"పెద్దపులులు, ఎలుగుబంటుల్ని గురించి అంతగా భయమే లేదు. నరపశువును గురించే మనం భయపడాలి. నరపశువుల వలలో చిక్కి-ఉంటాడు" అని నాయకుడు ఖేంఖ ణితో చెప్పాడు

ఆ నాటి నుంచి హవ్వూహవ్వూ కోసం అన్వేషణ ప్రారంభమయింది శృగాల స్వయం సేవక దళం ; తిరిగి తిరిగి చివరకు చండీమండపం చెంత ఉన్న వెదురు పొదల్లోకి చేరు కుంది. "హుక్కాహువా! హుక్కాహువా" అని పిలవ సాగారు

శివరామ్ గుండెల్లో దడపుట్టింది ఒకసారి గొంతువిప్పి తమ జాతీయగానాన్ని ఆలాపించాలనే కోర్కె కలిగింది; కానీ అతికష్టంమీద ఆ కోర్కెను అణచుకో గలిగాడు

రెండో జామున మళ్ళీ వెదురుపొదలోనుంచి "హుక్కా హువా! హుక్కాహువా!" అని విన్పించింది ఈసారి శివ రామ్ కంఠంలోనుంచి ఏడుపులాంటి మూలుగు విన్పించిందే కాని పైకి ఏమీ అనలేదు.

మూడో జామున మళ్ళీ స్వజనుల పిలుపు వినేసరికి శివ రామ్ ఓర్పు వహించ లేకపోయాడు. "హుక్కాహువా! హుక్కాహువా! హుక్కాహువా!" అని అకస్మాత్తుగా అతడు కూడా గానం చేశాడు.

అది విని శృగాల నాయకుడు హుక్కుయా "అదుగో, విన్నారా! అది మన హవ్వూహవ్వూ కంఠస్వరమే. ఒకసారి అతనిని ఇలా పిలవండి చూద్దాం" అని అన్నాడు.

"హవ్వూహవ్వూ" అని పిలిచారు.

మా సమితి అధ్యక్షుడు కూర్చున్నచోటునుంచి లేచి "శివరామ్" అని పిలిచారు.

బయటినుంచి మళ్ళీ "హవ్వూహవ్వూ" అని పిలుపు విన్పించింది.

"శివరామ్" అని సభాపతి మరొకసారి అతనిని హెచ్చరించారు.

మూడోసారి పిలుపు వినగానే శివరాం పరుగు పరుగున బయటకు వెళ్ళిపోయాడు. అతనిని చూడగానే శృగాల బృందము తోకముడుచుకొని వచ్చినదారినే పారిపోయింది. హుక్కుయీ, హోహో, హూహూ మొదలగు శృగాల వీరులందరూ తమతమ గుంటల్లోకిదూరి కూర్చున్నారు.

*  *  *

తరువాత ఆరుమాసాలు గడిచాయి.

ప్రస్తుతం శివరాం రాత్రులందు "నాతోక ఎక్కడ? నా తోక ఎక్కడ ఉంది?" అని కేకలు పెడుతూ తిరుగుతున్నట్లు వార్తలు అందాయి.

తరచు బైరాగి మహాశయుని ఇంటి అరుగుమీద కూర్చొని ఆకాశంలోకిచూస్తూ జాముజాముకూ "నాతోకను నాకివ్వండి" అని జాలి కలుగునట్లు అరుస్తుందట.

బైరాగి మహాశయుడు తలుపు తెరుచుకొని బయటకు రావటానికి చాలా భయపడుతున్నాడు. ఈ పిచ్చి నక్క తనను ఎక్కడ పట్టి పీకుతుందోనని హడలిపోతున్నాడు.

ఆ అడవిలో శివరాం నివసించే శృగాలగ్రామంలోకి వెళ్ళే అవకాశం లేకుండా పోయింది. శివరాంను చూడగానే శృగాలములన్నీ ఒకొక్కప్పుడు పారిపోయేవి లేదా అతని మీదపడి కరవటానికి సిద్ధపడేవి. అందుకని శివరాం ప్రస్తుతం

చండీమండపంలో నేఉంటున్నాడు. అక్కడ రెండుగుడ్లగూబలు తప్పస్నేహానికి మరెవరూ లేరు. ఎక్కడిబడికితే అక్కడికి వెళ్ళి నానా అల్లరిచేసే ఖండూ, గోబరా, ఢేంతా మొదలగు కొంటె పిల్లలుకూడా దయ్యానికి భయపడి వాక్కాయల కోసం అటువెళ్ళడం మానేశారు. శృగాలి భాషలో ఒక శృగాలము శివరాం గురించి ఒక గేయం రాసింది. దానిలో మొదటి చరణం ఇలా వుంది:

" 'హవ్వూహవ్వూ' స్థితి దానికేతప్ప
అన్యులెవరికీ తెలియదు,
మొదలంటా తోక తెగి
దిగులుతో అనుక్షణము
విలపించుచున్నది.
అక్కడ అత్తఖేంఖణి
నాయకునితో చెప్పి
రోదించు చుండగా
ఇక్కడ అల్లుడయ్యా
'హుక్కాహువా' అనే
జాము జామున
జాతీయగాన మాలాపించు!''

"అన్యాయం! అన్యాయం! తాతగారూ, అత్తకూడా శివరాంను ఇంటికి రానివ్వటం లేదా?'' అని అడిగింది పాప మధ్యలో అడ్డొస్తూ.

"దానిని గురించి నువ్వేమీ విచారించవద్దు పాపక్కా! శరీరంమీది వెంట్రుకలన్నీ వచ్చాయంటే అత్త శివరాంను గుర్తుపడుతుంది" అని జవాబు చెప్పాను నేను.

"మరి దానితోక సంగతి ఎలా?" అంది పాప.

"అడిగిచూస్తాను, ఏ వైద్యునివద్దనైనా లాంగులాద్య ఘృతం లభిస్తే, ఆ విషయంలో మరేమీ భయపడ నవసరం లేదు."

మా 'అతడు' ఈ మాట అని నన్ను దూరంగా లాక్కువెళ్ళి "వృద్ధసోదరా, కోపగించుకోవద్దు. న్యాయం మాట్లాడుకుందాం- మిమ్మల్నికూడా సంస్కరించటం చాలా అవసరం" అని అన్నాడు.

"ఛీ బుద్ధిహీనుడా! నన్ను సంస్కరించే దేమిటి?"

"మీ ముసలి తనాన్ని సంస్కరించాలి వయస్సు అంతగా తగ్గలేదు. అయినా మీలో శైశవం ఉండవలసి నంతగా లేదు."

"అందుకు నీకేదైనా నిదర్శనం కన్పించిందా?"

"ఇంతకుముందు మీరు చదివి విన్పించిన రిపోర్టు ఆసాంతం వ్యంగ్యమేకదా! పాపక్క ముఖం ఎంత గంభీరంగా మారిపోయిందో చూడలేదా? తోక తెగిన నక్క ఫిర్యాదు చేయటానికి తన వద్దకు వస్తుందని భయపడుతున్నట్లుంది. మీ తెలివిని కొంచెంతగ్గించుకో లేనట్లయితే ఆ కథ చెప్పటమైనా మానేయండి."

"అలా తగ్గించుకోవటం నా వల్ల కాదు. తెలివితో పని లేని నీకు ఇలాంటివి ఎలా అర్థమౌతాయి? అది నిన్ను సృష్టించిన ఆ బ్రహ్మకే తెలియాలి."

"వృద్ధసోదరా, ఈ మాత్రానికే మీరు కోపగించుకొంటున్నారు కానీ నేను చెప్పదలచింది చెప్పకుండా వదలను బుద్ధిలోపంవల్ల మీలో సారం కూడా తగ్గిపోతుంది. మీరు చెప్పేది మీ మనస్సుకు ఆనందంగా ఉంటుందేమో కానీ మీ వ్యంగ్యం వళ్ళు కంపరమెత్తిస్తుంది. మృదువుగా వుండాలిగాని అంత మోటగా ఉండకూడదని ఇంతకుముందు కూడా నేను అనేకసార్లు హెచ్చరించినా మీరు విన్పించుకోవటం లేదు. మీ వ్యంగ్యంతో ఇతరులను ఏడ్పించి ఇహపరలోకాలకు దూరంకావద్దు. తోక తెగిన నక్క కథ వింటూ పాపక్క హృదయం ఎంత విలపించిందో మీరు గమనించినట్లు లేదు. మీరు అనుమతిస్తే పాపక్కను కిలకిలా నవ్విస్తాను, బుర్ర పాడుచేసుకోకుండా మనఃపూర్వకంగా నవ్వాలి."

"అంతా వ్రాసి సిద్ధంగా ఉన్నదా?"

"సిద్ధంగా ఉంది. నాటకంలోవలె సంభాషణల రూపంలో ఉంటుంది. మనపేటలో నివసించే ఊధో, గోబరా, పంచూ అను ముగ్గురూ దానిలో పాత్రలు. అందరూ పాపక్కకు తెలిసినవారే."

"సరే, చదువు, చూద్దాం!"

ఊధో: ఏంరా, ఏమైనా ఆచూకీ తెలిసిందా?

గోబరా:— ఏమి తెలియటమో! నీ మాటలు విని నెలరోజులున్నుంచి అడవిలోని చెట్టుచెట్టూ వెతికాను. ఎక్కడా ఆ మహాత్ముని పిలికకూడా కన్పించలేదు.

పంచూ:— ఎవర్ని గురించి వెతుకుతున్నారోయ్?

గోబరా:— వృక్షయోగిని

పంచూ:— వృక్షయోగి? అంటే? ఆయనెవరోయ్!

ఊధో:— తెలియదూ? ప్రపంచంలో ఆ విషయం తెలియని వారెవరూ లేరు. నీకు తెలియక పోవటం ఆశ్చర్యంగా ఉంది.

పంచూ:— ఇంతకూ వారిలో ఉన్న విశేషమేమిటో ఇప్పుడు చెప్పండి వింటాను

ఊధో:— ఆ మహాత్ముడు ఏ చెట్టుమీద ఎక్కితే ఆ చెట్టు కల్పతరువు అవుతుంది ఆ చెట్టుక్రిందనిలబడితే మనం కోరుకున్నది లభిస్తుంది

పంచూ:— ఈ విషయం నీ కెలా తెలిసింది?

ఊధో:— ఈ విషయాన్ని నాతో ధోకడా గ్రామంలో ఉండే భీఖూ సర్దారు చెప్పాడు. ఒకనాడు ఆ వృక్షయోగి మేడి చెట్టుమీద కూర్చొని కాళ్ళు వూపుతున్నారట. అదేమీ చూడకుండా భీఖూసర్దారు కుండ నెత్తిన పెట్టుకొని చెట్టు క్రిందిగా వెళ్ళాడు. ఆ మహాత్ముని కాలు తగిలి కుండలోని పాకమంతా అతని ముఖంమీద ఒలికింది. అది చూచి ఆ మహాత్మునికి దయ కలిగింది "భీఖూ నీ మనసులోని కోర్కె ఏమిటో చెప్పు" అని అడిగారు వారు. భీఖూ వట్టి తెలివి తక్కువ దద్దమ్మ "బాబా, నా కొక గుడ్డముక్క ఇప్పిస్తే ముఖం

తుడుచుకుంటాను" అని అన్నాడు అతడు ఆ మాట అడగ్గానే చెట్టుమీదనుంచి ఒకతువాలు క్రింద పడింది. అతడు దానితో ముఖం తుడుచుకొని తల పైకెత్తి చూశాడు. చెట్టుమీద అతనికి ఎవరూ కన్పించలేదు. అడగదలచినదేదో ఒకేసారి అడగాలి, కానీ ఆ తరువాత ఎంత నెత్తీ నోరూ బాదుకున్నా ప్రయోజనం ఉండదు.

పంచూ:— అయ్యయ్యో! ఎంత తెలివితక్కువవాడు. మంచి శాలువాగానీ ఖరీదైన దుప్పటిగానీ అడిగితే ఎంత బాగుండును! వెధవ తువాలు అడిగాడు. అయినా భీఖూకు అంతకంటె తెలివితేటలు ఎక్కడేడ్చాయి!

ఊధో:— ఆ తువాలు కూడా తీసివేయదగిందేమీ కాదు. దానితో అతనికి హాయిగాగడిచిపోతుంది. రథంప్రక్క అతడు ఎంత పెద్ద ఇల్లు కట్టాడో నువ్వు చూడలేదా? చూడ టానికి అది తువాలే కావచ్చుకానీ ఒక మహాత్ముడు ప్రసా దించినదిగదా!

పంచూ:— ఇల్లు ఎలా కట్టాడు? ఆ తువాలులో ఏదైనా మాయ ఉందంటావా?

ఊధో:— వినుమరి చెప్తాను. ఆ మధ్య జరిగిన హోందలపూరు తిరణాలలో భీఖూ తువాలు పరుచుకొని కూర్చున్నాడు. జనం ఇసకవేస్తే రాలకుండా వస్తారుగదా! మహాత్ముడు ఇచ్చిన తువాలు అనేసరికి రూపాయలు, అర్ధలు పావలాలు, బేడలు కుప్పలుగా పడ్డాయి తువాలుమీద. ఇంతలో ఒక స్త్రీ అతని ఎదుటకు వచ్చి "భీఖూదాదా, మా

అబ్బాయికి మూడునెలల నుంచి జ్వరం వదలటం లేదు. ఆ తువాలును వీడికి కాస్త తాకించు" అని అడిగింది.

"నా భర్త దూరదేశానికి వెళ్ళాడు. వారి వద్దనుంచి ఏమీ వార్తలు తెలియటం లేదు. ఆ విషయం కాస్త చెప్పండి బాబూ!" అని మరొక స్త్రీ అడిగింది. ఇలా అడిగి నందుకు భీఖూ ఒక నియమం ఏర్పరిచాడు. ఏదైనా అడగ దలచినవారు అయిదు అణాల డబ్బులు, అయిదు వక్కలు, అయిదు శేర్ల బియ్యము, అయిదు చటాకులనెయ్యి నైవేద్యం తేవాలి.

పంచూ:— నైవేద్యమేనా లేక పండ్లు ఫలాలు కూడా వస్తాయా?

ఊధో:— ఒకటేమిటి, అన్నీ వస్తాయి. గాజనపాలుడు తువాలు నిండా అయిదు రోజులు వరుసగా ధాన్యాన్ని సమ ర్పించుకున్నాడు. ఆ తువాలును ఒక నూాల మేక మెడకు కట్టి బలికూడా ఇచ్చాడు- ఆ రోజున అది చూడడానికి ఎంతో మంది జనం వచ్చారు. పదకొండు మాసాలలో గాజన్‌కు ఉద్యోగం దొరికింది. మహారాజుగారి ద్వారంలో ఉండే ద్వార పాలకునికి భంగు నూరటమూ, దువ్వెనతో అతని గెడ్డాన్ని దువ్వటమూ అతని పనులు.

పంచూ:— నువ్వు చెప్పేది నిజమేనా?

ఊధో:— నిజంగాక అబద్ధం చెపుతున్నాననుకొంటు న్నావా! గాజన్ మా పినతండ్రి కొడుకు షడ్డకుడే!

పంచూ:— అవన్నీసరే, ఇంతకూ ఆ తువాలు నువ్వు చూశావా?

ఊధో:— నేను చూడకపోవటం ఏమిటి! హటూగంజ్ మగ్గాలమీద నేనే గజమున్నర తువాలు చూశావుగదా, అంతా అలాగే ఉంటుంది. ఎర్రంచు పసుపురంగు తువాలు.

పంచూ:— అలాంటి తువాలు చెట్టుమీదనుంచి ఎలా పడింది.

ఊధో:— అదే గదా విచిత్రం! అదంతా ఆ మహాత్ముని దయ.

పంచూ:— అయితే, మనం కూడా ఏ విధంగానైనా సరే ఆ యోగిని వెతికి దర్శనం చేసుకుందాం. వారు ఎట్లా ఉంటారో ఏమిటో తెలుసుకునేదెలా?

ఊధో:— అదే కొంచెం కష్టమైన సంగతి ఇంతవరకు వారిని ఎవరూ చూడలేదు. పాకం ముఖం నిండా పడినందువల్ల భీఖూ కూడా అప్పుడు వారిని చూడలేకపోయాడు. అదీ మన దురదృష్టమే.

పంచూ:— ఇప్పుడిక మార్గమేమిటి?

ఊధో:— సూటు, బూటు, టోపి ధరించిన వారెవరు కన్పించినా నేను వారికి నమస్కరించి 'బాబా, వృక్షయోగి మీరేనా, దయచేసి చెప్పండి' అని అడుగుతున్నాను. నా మాట వినగానే కోపంతో అందరూ మీదపడి కొట్టవచ్చేవారు. వారిలో ఒకరు కోపం పట్టలేక హుక్కాలోని నీళ్ళు నా నెత్తిమీద పోశారు.

గోబరా:— ఎన్ని కష్టాలు ఎదురయినా సరే మనం ఆ మహాత్ముని జాడ తెలుసుకు తీరాల్సిందే మని అదృష్టం ఎలా ఉందో ఏమో, బాబా దర్శనం చేసుకోనక తప్పదు.

పంచూ:— చెట్టుమీద ఉన్నప్పుడే ఆ మహాత్ముని నిజరూపం కన్పిస్తుందని భీఖూ అంటున్నాడు. చెట్టుమీది నుంచి దిగివస్తే మనం ఆ మహాత్ముని గుర్తించ లేమట.

ఊఖో:— కన్పించిన వాళ్ళందరినీ మనం చెట్టుమీది కెక్కించి చూడటం సాధ్యంకాదుగదా! అందుకని నే నొక మంచి ఉపాయం ఆలోచించాను ఈ సంవత్సరం మా మామిడి చెట్టు బాగా విరగకాసింది. నేను కన్పించిన వాళ్ళం దరితోను 'అయ్యా, చెట్టుమీాది కెక్కి మీకు కావలసిన మామిడికాయలు కోసుకు వెళ్ళండి' అనిచెప్పాను. చెట్టుమీద కాయలేకుండా కోసుకు పోయారు. కొమ్మలుగూడా విరిగి పోయాయి. ఆ మహాత్ముని జాడమాత్రం తెలియలేదు.

పంచూ:— ఆలస్యం దేనికి, బయలుదేరండి. అదృష్టం కలసివస్తే తప్పకుండా వారి దర్శనం చేసుకుంటాం. ముగ్గు రమూ ఒకసారి గొంతెత్తి బిగ్గరగా "ఓ వృక్షయోగీ, ఓ మహాత్మా, ఓ దయగలబాబా, మీరీ అడవిలో,ఎక్కడదాగి వున్నాసరే, ఒకే ఒకసారి ప్రత్యక్షమై మీ దర్శనభాగ్యం కలిగించండి' అని పిలుద్దాం.

గోబరా:— బాబాకు మనమీద దయకలిగినట్లుంది.

పంచూ:— ఎక్కడ, ఎక్కడరా?

గోబరా:— అదిగో, అటుచూడు! ఆ మామిడిచెట్టు మీాద.

పంచూ: ఏమిటిరా, మామిడిచెట్టుమీాద ఏముంది? నాకేమీా కన్పించటం లేదే?

గోబరా:— అదుగో, వ్రేలాడుతోంది, చూడండి.

ఊధో:— నీ తెలివి తెల్లారినట్లేఉందిగోబరా! అది బాబా తోక కాదు, హనుమాన్లవారితోక. పళ్ళికిలిస్తోందిచూశావా!

గోబరా:— అంతా కలికాలమైపోయింది ఘోరకలి కాలం! మనల్ని మరపించటానికి బాబా కపిరూపాన్ని ధరించారు.

పంచూ:— బాబా, మేము అంత తేలిగ్గా మోసపోయే వాళ్ళము కాదు. మీ ముఖం ఎంత నల్లగా ఉన్నప్పటికీ మేము మిమ్మల్ని గుర్తించగలము. మీరు నోరు తెరిచి ఎంత బెదిరించినా మేమిక్కడనుంచి అడుగు కూడా కదిలేది లేదు. మేము మీ వాలముగారినే శరణువేడు కుంటాం.

గోబరా:— అమ్మబాబోయ్, బాబా ఎగిరెగిరి దూకుతూ పారిపోతున్నారు. ఇప్పుడేమి చేద్దాం?

పంచూ: ఎంత దూరం పారిపోగలరు? మన భక్తి పరుగును తప్పించుకొని వెళ్ళగలరా?

గోబరా:— చూడు, చూడు! ఆ వెలగకొమ్మ మీద కూర్చున్నారు.

ఊధో:— పంచూ, త్వరగా చెట్టెక్కు. త్వరగా!

పంచూ:— నువ్వే ఎక్కరాదా!

ఊధో:— నువ్వే ఎక్కరా బాబూ, త్వరగా ఎక్కు.

పంచూ:— అంతఎత్తు నేను ఎక్కలేను. బాబా, మా యందు దయతో ఒకసారి క్రిందికి దిగిరండి.

ఊధో:— బాబా, మీ తోకగారిని మెడకు చుట్టుకొని శాశ్వత నిద్రపొందేట్లు ఆశీర్వదించండి!

(అందరూ వెళ్ళిపోతారు)

"ఏం సోదరా, ఎలాఉంది కథ? నవ్వించ గలిగానా!"

ఏమీ లేదు. ప్రతివిషయాన్ని ఆలోచించకుండా అంగీకరించని వాళ్ళను నవ్వించటం అంత తేలికైన పనికాదు. ఆ వృక్షయోగిని వెతకటానికి పాపక్క నన్నుపంపుతుందేమో నని భయంగా ఉంది."

"ఆమె ముఖ లక్షణాలు చూస్తే నాకుకూడా అలాగే కన్పిస్తుంది. వృక్షయోగిని గురించి తెలుసుకోవాలని పాప క్కకు చాలా ఆసక్తిగా ఉన్నట్లుంది సరే, నమ్మకం లేక పోయినప్పటికీ ఆనందం కలిగించవచ్చునో లేదో రేపు పరీ క్షించి చెపుతాను "

కాస్సేపాగి పాపక్క "తాతగారూ, వృక్షయోగిని మీరు చూచి ఉంటే ఏమి కోరుకునేవారు?" అని అడిగింది.

"మా పాపక్క లెక్కలన్నీ తేలికగా చేయగలిగే కలము ఇవ్వండి అని అడిగేవాడిని."

నా జవాబు వినగానే పాపక్క సంతోషంగా చప్పట్లు కొడుతూ "భలే, అలా జరిగితే చాలా బాగుంటుంది" అని అన్నది.

మొన్న జరిగిన లెక్కల పరీక్షలో పాపక్కకు నూటికి పదమూడున్నర మార్కులు మాత్రమే వచ్చాయి.

## 4

నేను కలగంటున్నానో లేక మేల్కొని ఉన్నానో స్పష్టంగా చెప్పలేను. రాత్రి ఎంత ప్రొద్దుపోయిందో

కూడా తెలియదు. గదిలో చీకటిగా ఉంది. వరండాలో ద్వారం ముందు దీపం వెలుగుతూ ఉంది. గయలో పిండం వేయని ప్రేతాత్మవలె పురుగుకోసం ఒక గబ్బిలం అదేపనిగా తిరుగుతూ ఉంది.

ఇంతలో మా "అతడు" ఎక్కడినుంచో వూడిపడ్డాడు. "వృద్ధసోదరా, నిద్రపోతున్నావా?" అని అతడు కేక వేశాడు. కేకతో పాటే గదిలోకి వచ్చాడు. పైనుంచి క్రింది వరకు నిలువెల్లా నల్లని కంబళి కప్పుకొన్నాడు.

"ఇవాళ, ఇదేమి వేషం?" అని అడిగాను నేను.

"ఇది పెళ్ళికుమారుని వేషం" అని అతడు జవాబు చెప్పాడు.

"పెళ్ళికుమారుని వేషమా? కొంచెం అర్థమయ్యేట్లు చెప్పు."

"పెళ్ళి కుమార్తెను చూడడానికి వెళుతున్నాను."

ఎందుకనో ఏమోగాని అర్థనిద్రావస్థలో నున్న నా బుద్ధికి ఆ వేషం సముచితంగా ఉన్నట్లే కనిపించింది. నేను అతనిని ప్రోత్సహిస్తూ "వేషం చాలా అద్భుతంగా ఉంది. నీ మౌలిక వేషధారణ చూచి నాకు చాలా సంతోషం కలిగింది. నిజంగా క్లాసిక్ వేషం సుమా!"

"అదెలా?"

"భూతనాథుడు తపస్సులో ఉన్న కాబోయే అర్థాంగికి వరంఇవ్వటానికి వచ్చినప్పుడు ఏనుగు చర్మాన్ని ధరించాడు. నువ్వు ధరించినది ఎలుగుబంటి చర్మం. నారద మహర్షి ఇప్పుడు నిన్నుగనుక చూస్తే చాలా సంతోషిస్తాడు."

"వృద్ధసోదరా, నువ్వు నిస్సందేహంగా చాలా తెలివైనవాడివి. అందుకేగదా, అర్ధరాత్రివేళ నీ వద్దకు పరుగెత్తుకు వచ్చాను."

"ఇప్పుడు ఎంత ప్రొద్దుపోయింది?"

"ఒంటిగంటన్నర అయింది."

"పెళ్ళి కుమార్తెను చూడటానికి ఇప్పుడే వెళుతున్నావా?"

"అవును. ఇప్పుడే వెళతాను."

ఆ జవాబు వినగానే నేను "చాలా బాగున్నది! ఇది కూడా నీలోని మౌలిక చమత్కారమే" అని అన్నాను.

"ఎందుకని?"

"ఇంతకాలం నుంచి ఇలాంటి ఐడియా నాకెందుకు రాలేదా అనే ఆలోచిస్తున్నాను. ఆఫీసులో ఆఫీసరుగారి దర్శనానికి చిటచిటలాడే మిట్టమధ్యాహ్నపు ఎండలో వెళ్ళాలి. అర్ధరాత్రి కటిక చీకటిలో పెళ్ళికుమార్తెను చూడటానికి వెళ్ళాలి."

"వృద్ధసోదరా, నీమాటలు అమృతమువలె ఉంటాయి. పురాణాలలో ఇలాంటి నిదర్శనాలేవైనా ఉన్నాయేమో ఒకటి చెప్పండి."

"అలనాడు అమావాస్యనాటి కటిక చీకటిలో శివుడు ఆశ్చర్యపడుతూ మహాకాళిని చూచిన దృశ్యాన్ని గుర్తు తెచ్చుకోవచ్చు."

"ఆహా, వృద్ధసోదరా, నిజముగా నీ మాటలువిని నా ఒడలు పులకిస్తుంది అంతకంటే గంభీరమైన నిదర్శనం ఏముంటుంది!"

"పెళ్ళికుమార్తె ఎవరో, ఆమె ఎక్కడ వున్నదో చెప్పనే లేదు."

"మా వదినగారి చెల్లెలే ఆమె వద్దనే ఉంటున్నది."

"మీ వదినగారి పోలికలు ఉంటాయా?"

"ఉండే వుంటాయి, స్వంత చెల్లెలేగదా!"

"అందుకనే చీకటి రాత్రి అవసరం"

"వదినకూడా అలాగే చెప్పింది. టార్చి వగైరాలేమీ వెంటతీసుకు రావద్దని కూడా హెచ్చరించింది."

"మీ వదినగారు వుండే దెక్కడ?"

"ఇక్కడికి ఇరవై యేడు మైళ్ళుంటుంది. బోంచకలా గ్రామంలో ఉనకండూ పేటలో ఉంటున్నారు."

"భోజనాల ఏర్పాటుకూడా ఉన్నదా?"

"లేకుండా ఎలా జరుగుతుంది?"

"ఆ మాట వినగానే ఎందుకనో ఏదో ఆశతో నా మనస్సు పులకించింది పన్నెండు సంవత్సరాలనుంచి పైత్యా రోగంతో బాధపడుతున్నాను. ఆహారం పేరు చెపితేనే సహించదు. అలాంటిది ఇప్పుడు భోజనాల మాట వినగానే సంతోషం కలిగింది. "విందు ఎలా ఉంటుంది? ఏయేపదార్థాలు తయారుచేస్తారో వివరంగా చెప్పు" అని అడిగాను.

అతడు చాలా ఉద్రేకపడుతూ ఇలా వివరించాడు:—

"విందు చాలా చాలా బాగుంటుంది! అద్భుతంగా ఉంటుంది. మామిడితాండ్ర వేసి వదిన కాకరకాయ కూర వండుతుంది. దాని రుచి తింటేగాని తెలియదు. అడవిరేగు గింజల్ని మెత్తగా నూరి పుగాకు రసంతో వదిన చాలా రుచిగా చట్నీ చేస్తుంది-"

ఈ మాట అంటూ అతడు పాశ్చాత్య పద్ధతిలో నాట్యం చేయసాగాడు. టిటిటంటం. టిటిటంటం, టిటి మంటం.

జీవితంలో ఇంతవరకు నే నెప్పుడూ నాట్యం చేయక పోయినా అకస్మాత్తుగా ఇవాళ నేనూ అతనితో చేతులు కలిపి టిటిటం, టిటి టంటం అంటూ నాట్యం చేయసాగాను. నాలో ఏదో కొత్తశక్తి వచ్చినట్లనిపించింది. జమునదీదీ గనుక మా నాట్యం చూచివుంటే "ఆహా, నాట్యం అంటే ఇదే!"అని మెచ్చుకొనేది.

చివరికి నేను రొప్పుతూ దబీమని చతికిల బడ్డాను. "నువ్వు చెప్పిన ఆహారపదార్థాలన్నీ నూటికి నూరుపాళ్ళు విటమిన్లతో కూడినవే సుమీ! పైత్యరోగులకు అమృతంతో సమానమైనవి పెళ్ళికుమార్తెను చూడటమే గాక పరీక్ష చేయాలిగదా?"

"ఆ పరీక్ష ఇంతకుముందే జరిగింది."

"ఎలా జరిగింది?"

"చూడటానికి ముందు మైత్రీపరీక్ష జరగాలని ఆలోచించాను. మంచిదంటారా కాదంటారా?"

"మంచిదే. పరీక్ష ఎలాజరగాలని ఆలోచించావ్?"

"శ్లోకంలో ఒక చరణాన్ని పూర్తిచేయడమంటే చేయగలవా అని అడగాలనుకున్నాను. 'రంగుకాగడా' సహాయ సంపాదకుడిని నా తరఫున ఆమె వద్దకు పంపాను."

"ఓ నల్లని నేరేడురంగు సుందరీ!" అనే చరణాన్నిచ్చి దీనికి సరియైన ఛందస్సులో జవాబుచెప్పగలవా అని సహాయ సంపాదకుడు ఆమెను ప్రశ్నించాడు.

పెళ్ళికుమార్తె తడుముకోకుండా "అంధుడా, మందగించింది నీ చూపు!" అని జవాబు చెప్పింది.

"పగటి వెలుతురు
పడమటి దిశలో
దాగినప్పుడు-
రాత్రంతా, అంధకారంలో
బ్రహ్మదేవుడు
చేతులుచాచి చాచి
నిన్ను తయారు చేశాడు."

అని ఆమె మాటకు కోపగించుకున్న సహాయ సంపాదకుడు జవాబు చెప్పాడు.

"చేతులు చాచిచాచి అంటే ఇక్కడ అర్థం ఏమిటి?"

"పెళ్ళికుమార్తె పొడవుగా వుంటుందని విన్నాను. నా కంటె రెండుమూడు అంగుళాలు ఎక్కువ ఎత్తుగా ఉంటుందట. అందుకు నాకు చాలా సంతోషంగా కూడా ఉంది."

"నువ్వనేదేమిటి?"

"ఒక అమ్మాయిని వివాహమాడుటలో మరొక సగం ఆత్మలో కలిసిపోతుంది."

"అంటే ఏమిటో నాకేమీ అర్థం కాలేదు"

"ఏదైతేనేం, వృద్ధసోదరా, ఆ సహాయ సంపాదకుని ఎదుట తన ఓటమినంగీకరించి ఆమె ఒక ముచ్చిలిక నిచ్చి వేసింది"

"అదెలా?"

"చేపలమీది పొలుసుతో హారాన్ని గుచ్చి సహాయ సంపాదకుని మెడలో వేసింది."

"కీర్తి సౌరభము మీతోపాటు తిరుగుతూ ఉంటుంది" అని చెప్పింది అతనితో.

నేను ఎగిరి గంతేసి "ధన్యుడవయ్యావు. ఒక అసాధారణ వ్యక్తికి మరొక అసాధారణ వ్యక్తి లభించింది. ప్రపంచంలో ఇలాంటివి జరగటం అరుదు. ఇప్పుడిక పగటి ముహూర్తం చూడటం వ్యర్థమేగదా!" అని అన్నాను.

"ఆ అమ్మాయి తనను ఓడించిన వారినేవివాహమాడతానని ప్రతిజ్ఞ చేసిందట."

"అందచందాలలోనా?"

"కాదు, శబ్దముల పొందికలో. సరిగ్గా జవాబు కుదిరితే అతనికి అర్పితమై పోతుందట."

"ఆ పరీక్షలో నువ్వు నెగ్గగలవు గదా!"

"సునాయాసంగా."

"నువ్వువేసిన ప్లాను ఏమిటో చెప్పు విందాం."

"నాలుగు పంక్తుల్లో నా శీలాన్ని వర్ణించు స్తుతించి నన్ను మెప్పించు. ఛందస్సు ఫస్టుక్లాసుగా కలవాలి అని చెపుతాను."

"పెళ్ళి కుమార్తెలను చూచే పేటెంటు" పొందటానికి అన్నివిధాల నువ్వు సమర్థుడవు. వరునిస్తుతితో ప్రారంభం. చాలాబాగుంది. ఉమ జయించింది దీనిలోనే గదా!"

"మొదటి చరణం ఆమెకు అందించాలి, లేకపోతే నన్ను గురించి ఆమెకు అంతగా తెలియక పోవచ్చు. నన్ను గురించి ఈ విధంగా ప్రారంభ మవుతుంది-

విశ్వంలో అందరికంటె
అద్భుతమైనవాడవు!

దీని తరువాత చరణాలు పూర్తిచేయటం ఆమెకు సాధ్యం కాదు. వృద్ధసోదరా, ఆ తరువాత ఎలా వుండాలో నువ్వు చెప్పు-"

"పెనుభూత మొకటి ఆవరించెను
పెళ్ళికుమారుని— " అని నేను తరువాత చరణం పూర్తిచేశాను.

"ఎక్సలెంట్! ఇంకా రెండు చరణాలు పూర్తి చేయాలి కదా! పెళ్ళికుమార్తె ఒకస్త్రీగదా, ఆమె తండ్రి కాదు తాత దిగివచ్చినా మిగిలిన చరణాలు పూర్తి చేయలేరు. వృద్ధసోదరా, భాషలోగానీ అభాషలోగానీ నీకేమైనా తోస్తుందా?"

"నేను చెప్పలేను."

"అయితే, నేనే చెపుతాను విను —

మిద్దెమీంచి నుంచి దూకు
బురదనంతా దాటివెళ్ళు,
ఎల్లప్పుడు నీ చిత్తము వచ్చినట్లు
యద్భుతాలు తద్భుతాలు చేస్తూఉండు."

"ఇదేమిటి? ఇది ఏ భాష? ఏ దేశంలో మాట్లాడుతారు?"

"దేవభాష సంస్కృతం- 'కింభూత్' శబ్దానికిపర్యాయ పదాలు."

"యద్భుతము, తద్భుతము అంటే అర్థం ఏమిటి?"

"ఇష్టం వచ్చినట్లు అని దానికి అర్థం మాతృభాషలో అదినాదని అనుకో. ఆధునిక పండితులు దానినే అవధానమని అంటారు."

అతనియందు నాకు ఎక్కడలేని గౌరవభావం ఏర్పడింది. అతనిలో అసాధారణమైన ప్రతిభ ఉన్నట్లు అర్థం చేసుకోగలిగాను. నేను అతని వీపు తట్టి "ఇవాళ నిజంగా నన్ను ఆశ్చర్యంలో ముంచెత్తావు" అని అన్నాను.

"ఆశ్చర్యంలో మునిగిపోతే ఎలా? బయల్దేరి వెళ్ళాలి. ముహూర్తం మించిపోతుంది. ఎప్పుడేమి జరుగుతుందో చెప్పలేము. క్షణంలో 'వలీకరణం' దాటిపోయి 'తైతిల్ కరణం' వచ్చేస్తుంది తరువాత వైష్కుంభయోగం, హర్షణయోగం, విష్టికరణం వచ్చి మిగిలిన రాత్రంతా అసృకయోగము, ధనిష్టా నక్షత్ర ప్రవేశం — మహర్షి సిద్ధాంతాన్ననుసరించి వ్యతీపాతయోగం, వాలవకరణం, పరిఘుయోగములలో గర్ కరణం వచ్చినప్పుడు కష్టాలు వస్తాయి. సంసారులకు గర్

కరణంలాంటి విఘ్నకారి మరేదీ లేదు. ఈ వారంలో సిద్ధి యోగము, బ్రహ్మయోగము, ఇంద్రయోగము, శివ యోగము వచ్చేసూచన ఎక్కడా కన్పించటం లేదు. వర యానయోగము వచ్చే అవకాశమున్నది. పునర్వసు నక్షత్ర దృష్టి కలుస్తుంది."

"ఆలస్యం మాత్రం ఏముంది. ఫుత్తూలాల్‌ను పిలిస్తే కారు తెస్తాడు. ఇప్పటికి వాడు రాట్నం వడుకుతూఉంటాడు. రాట్నం వడుకుతూ ఉంటేనే అతనికి నిద్రవస్తుందట, లేక పోతే లేదట కారునడుపుతూ ఉండటంవల్ల అతని కీస్థితి సంభ వించింది."

నేను, మా 'అతడు' వెళ్ళి కారులో కూర్చున్నాం.

* * *

మా కారు అడవిలో నుంచి పోతుంది కటిక చీకటిగా ఉంది. చెరువు ఒడ్డున ఉన్న అడవిమొక్కల పొదలోనుంచి అకస్మాత్తుగా ఒక నక్క అరిచింది. రాత్రిమూడున్నరగంట లయింది. నక్క అరుపు వినగానే ఫుత్తూలాల్ బెదిరిపోయి కారుతో సహా కంఠంలోతు నీళ్ళల్లో పడ్డాడు. ఇంతలో, ఫుత్తూలాల్ చొక్కాలోపల వీపుమీద ఒక కప్ప జొరబడింది. ఫుత్తూలాల్ భయపడి కేకలు పెట్టసాగాడు. నేను అతనికి ధైర్యం చెపుతూ "ఫుత్తూలాల్, నీ వీపుకు వాతరోగం ఉంది. కప్పను బాగా గంతులు వేయనివ్వు. డబ్బు ఖర్చులేకుండా నీకు ఇంత చక్కగా మాలిష్ చేసేదెవరు?" అని అన్నాను.

నేను కారుపైకి ఎక్కి "వనమాలీ! ఓ వనమాలీ!" అని కేకలు వేయసాగాను.

ఆ మూర్ఖుడు ఎక్కడున్నాడో ఏమో! ఈ సమయంలో అతడు జోలాపురం స్టేషను ప్లాట్‌ఫారంమీద పడుకొని గుర్రుపెట్టి నిద్రపోతూ ఉంటాడని అర్థమయింది. చాలా కోపం వచ్చింది. అక్కడికివెళ్ళి నా కలాన్ని ముక్కులోపెట్టి తిప్పి రావాలని కోర్కె కలిగింది. తుమ్ములతో చస్తాడు. ఇక్కడ బురదనీటితో నా జుట్టు తడిసిపోయింది. తల దువ్వకోకుండా వదినగారింటికి ఎలా వెళ్ళేది? మా గోలవిని చెరువు గట్టుమీద పడుకొని ఉన్న బాతులు లేచి గోలగా అరవసాగాయి. ఒక్కగంతులో వాటి మధ్యకు వెళ్ళిపడ్డాను. ఒక బాతును పట్టుకొని దాని రెక్కలతో తల దువ్వుకున్నాను. ఇంతలో ఫుత్తూలాల్ నా వైపుతిరిగి "దాదాబాబూ, మీరు చెప్పిందినిజమే. వీపుమీద కప్ప గంతులు వేయటంవల్ల చాలా హాయిగా ఉందిప్పుడు. నిద్రవస్తుంది" అని అన్నాడు.

చివరికి ఎలాగైతేనేం అతని వదినగారింటికి చేరుకున్నాం. ఆకలి బాధవల్ల పెళ్ళికుమార్తెను చూడాలనే విషయమే మర్చిపోయాను.

"నాతో వచ్చిన 'అతడు' ఇక్కడ కన్పించటంలేదే?" అని వదినగారిని అడిగాను.

మూడుమూరల దుప్పటి ముసుగులో నుంచి వదిన సన్నని గొంతుతో "అతడు అమ్మాయిని వెతకటానికి వెళ్ళాడు" అని చెప్పింది.

"ఎటువైపు వెళ్ళాడు?"

"వింత చెరువుగట్టునవున్న వెదురుపొదలో వెతటానికి వెళ్ళాడు."

"ఇక్కడికి ఎంతదూరం ఉంటుంది?"

"గట్టిగా నడిస్తే మూడుజాముల ప్రయాణం."

"ఎక్కువ దూరమేమీ కాదు. కానీ, నాకు చాలా ఆకలిగా ఉంది. మీరు చేసిన ఆ చట్నీ కొంచెం పెట్టండి, తినిచూస్తాను."

వదిన ముక్కుతో మాట్లాడినట్లు "అయ్యోనాయనా. నా దురదృష్టం, అడిగినందుకైనా నీకు పెట్టలేకపోయాను. మొన్న మంగళవారంగాక అంతకుముందు మంగళవారం నాడు పగిలిపోయిన ఫుట్‌బాల్‌లో చట్నీనంతా పెట్టి బుజూ దీదీకి పంపాను. ఆమెకు నేను చేసిన చట్నీ అంటే చాలా ఇష్టం. ఆమె శనగపిండిని, ఆవాలనూ నెను చట్నీతో కలిపి తింటుంది."

నాకు చాలా నిరాశ కలిగింది. "అయితే, మేము తినే దేముంది?" అని అడిగాను

"చిన్న చిన్న ఎండుచేపల వూరగాయవుంది. మొన్ననే తాజా పాకం పోశాను. త్వరగాతిను. లేనిచో పిత్తము ప్రకోపిస్తుంది."

కొద్దిగా తిన్నాను. చాలా మిగిలిపోయింది. పుత్తూలాల్‌ను పిలిచి "తింటావా?" అని అడిగాను.

"ఆ కుండ నిలా ఇవ్వండి. ఇంటికివెళ్లి సంధ్యవార్చుకున్న తరువాత తింటాను" అని అన్నాడతడు.

ఇంటికి తిరిగి వచ్చాను. చెప్పులు తడిసి వీపునిండా బురద చిందింది. వనమాలిని పిలిచి "గాడిదా, ఇప్పటి వరకు ఏం చేస్తున్నావు!" అని అడిగాను.

నా ప్రశ్నవిని అతడు ఏడుస్తూ "తేలుకుట్టింది, అందు కని నిద్రపోతున్నాను" అని చెప్పాడు.

ఇంతలో ఒక రౌడీలాంటి మనిషి ఒకడు నా గదిలోకి వచ్చాడు. బాగాఎత్తు, ఎత్తుకుతగ్గలావు, కండలు తిరిగిన శరీరం, మెడలావుగా పీపావలె ఉంది వనమాలి మాదిరే నల్లగా ఉన్నాడు. పొడవుగా ఉన్న జీబురు జుట్టు, నిటారుగా నిలబడిన మీసాలు, కళ్ళుఎర్రగా ఉన్నాయి. గళ్ళబనీతొడిగి, ఎర్రంచు లుంగీకట్టాడు. పసుపురంగు తువాలు నడుముకు చుట్టాడు, ఇత్తడి పన్ను వేసిన పొడవైన వెదురుకర్ర పట్టు కున్నాడు. కంఠస్వరం గణాయిబాబుగారి కారు హారనువలె ఉంది. అకస్మాత్తుగా ఇలాంటి రౌడీ గదిలోకి ప్రవేశించి మూడున్నర మణుగుల బరువైన గొంతుతో "బాబుసాబ్!" అన్నాడు.

నేను అదిరిపడ్డాను. ఆ అదిరిపాటుకు కలం మొన కాగి తంలో దిగిపోయింది. నేను నెమ్మదిగా తలపైకెత్తి "ఏంజరి గింది, ఎవరు నువ్వు?" అని అడిగాను.

"నా పేరు పల్లారామ్. పాపక్కగారింటినుంచి వస్తు న్నాను. మీ 'అతడు' ఎక్కడికి వెళ్ళాడో తెలుసుకునేందుకే వచ్చాను."

"నాకు తెలియదు."

పల్లారామ్‌కు కోపం వచ్చింది. మిరిమిరిచూడసాగాడు. మొదటికంటె గంభీరమైన కంఠస్వరంతో "అలాగా, తెలియదూ! అతుకులు పెట్టిన ఆ పచ్చరంగు మేజోడు బురదతో నిండి అక్కడ వ్రేలాడుతుందిగదా, ఎండి ఉడతతోకవలె కన్పిస్తున్న ఆ మేజోడును వదలి 'అతడు' ఎక్కడికీ వెళ్ళడు!" అని అన్నాడు.

"అతడు తనవస్తువుల్ని వదలి అంత తేలిగ్గా ఎక్కడికీ వెళ్ళడు. ఎక్కడ వున్నాసరే తప్పక తిరిగి వస్తాడు. ఇంతకూ ఏంజరిగింది?"

"మొన్నసాయంత్రం పాపక్క మిలటరీ గవర్నరుగారింటికి వెళ్ళింది. గవర్నరుగారి భార్యతో పాపాక్క స్నేహం చేసింది. అక్కడినుంచి ఇంటికి తిరిగి వచ్చేసరికి అతడు ఒక చెంబు, గొడుగు, రెండు పేకముక్కలు, ఒక లాంతరు, ఒక బొగ్గులబస్తా ఎత్తుకొని పోతూ ఉండటం చూచింది. దీదీ తోటలోనుంచి వెదురు మొలకలు, సారచెట్టుకాడలు, వెదురుకూర బుట్టనిండా వేసి తెచ్చింది ఆ బుట్టకూడా ఇప్పుడు కన్పించటం లేదు. అక్కకు చాలా కోపం వస్తుంది."

"అయితే, నేనేం చేయను?" అన్నాను నేను.

"నీ గదిలోనే అతడు ఎక్కడో దాగికూర్చున్నాడు. అతడిని తీసుకువచ్చి నాకు అప్పగించు" అన్నాడు పల్లారామ్.

"అతడు ఇక్కడలేడు, నువ్వు పోలీసు స్టేషనుకువెళ్ళి రిపోర్టివ్వు" అనిచెప్పాను నేను.

"అతడు ఇక్కడే ఉన్నాడు, ఎక్కడికీ వెళ్ళలేదు" అన్నాడు పల్లారామ్.

"నీతో చెడ్డచిక్కే వచ్చిందే. అతను ఇక్కడ లేడని చెపుతుంటే నమ్మవేం?" అన్నాను.

"ఇక్కడే వున్నాడు, ముమ్మాటికీ ఇక్కడే ఉన్నాడు" అంటూ పల్లారామ్ తన బాణాకఱ్ఱతో నా బల్లమీద కొట్ట సాగాడు ప్రక్క ఇంటిలో ఉన్న పిచ్చివాడు నక్కవలె 'హుక్కాహువా!' అని అరిచాడు. దానితో పేటలోని కుక్క లన్నీ మొరగసాగాయి. బల్ల అదురును వనమాలి నా కోసం తెచ్చిపెట్టిన షర్బత్తుగ్లాసు దొర్లింది. అది తగిలి పైలట్ సిరా బాటిల్ దొర్లి సిరా, షర్బత్తు ఏకధారగా నాపట్టుపంచెమీది నుంచి చెప్పుల్లోకి వెళ్ళి ఆగింది.

నేను బిగ్గరగా "వనమాలీ, వనమాలీ!" అంటూ కేకలు వేయసాగాను

వనమాలి గదిలోకి అడుగుపెట్టి పల్లారామ్ ముఖం చూచి "అమ్మబాబోయ్!" అంటూ బయటకుపారిపోయాడు.

అకస్మాత్తుగా అప్పుడు నాకు 'అతడి' విషయం గుర్తొచ్చింది- "'అతడు' తనకు కాబోయే భార్యను చూడ టానికి వెళ్ళాడు" అని జవాబు చెప్పాను.

"ఏ వూరు?"

"వింత చెరువుగట్టున వెదురుపొదలో."

"అది నా ఇల్లే" అన్నాడు పల్లారామ్.

"అయితే మంచిదేగదా! నీకు కుమార్తె వుందా?"

"ఉన్నది."

"అంటే మీ అమ్మాయికి పెళ్ళికొడుకు దొరికినట్లే అనుకో."

"దొరికినట్లే అని ఇప్పుడే అనుకోవటానికి వీల్లేదు. ఈ శాణా కర్రతో అతని మెడ సరిచేసి అమ్మాయి కాళ్ళకు పారాణి పెట్టినప్పుడు కన్యాదానం నుంచి విముక్తి లభించిం దని అప్పుడు అనుకుంటాను."

"అయితే, ఇంకా ఆలస్యం ఎందుకు? అమ్మాయిని చూసిన తరువాత మళ్ళీ అతనిని వెతికి పట్టుకోవటం కష్టం కావచ్చు."

"నువ్వు చెప్పినదీ నిజమే" అన్నాడు పల్లారామ్. పగిలి పోయిన బొక్కెన ఒకటి గది బయట పడివుంది. అతడు దానిని అందుకున్నాడు.

"అది నీ కెందుకు" అని అడిగాను నేను.

ఎండ చాల తీవ్రంగా ఉంది. దీనిని టోపీ మాదిరిగా పెట్టుకుంటాను" అని జవాబు చెప్పాడు పల్లారాం

పల్లారాం వెళ్ళిపోయాడు. అప్పుడు కాకులుకావ్ కావ్ మంటున్నాయి. రోడ్డుమీద ట్రాముబళ్ళునడిచేశబ్దం విన్పించ సాగింది. పక్క మీదనుంచి తడబడుతూ లేచికూర్చొని వన మాలిని పిలిచి "ఇప్పుడు నా గదిలోకి వచ్చి వెళ్ళిన మనిషి ఎవరు?" అని అడిగాను.

"రాణీదీదీగారి నౌకరు" అని వనమాలి కళ్ళునులుము కుంటూ జవాబు చెప్పాడు.

ఇంతవరను కథ విన్న పాపక్క చాలా నిరాశ చెంది నట్లుంది. "తాతగారూ! మీరు పెళ్ళి భోజనానికి వెళ్ళారు. తరువాత మీ గదిలోకి పల్లారాం వచ్చాడు- ఇవి ఒకదాని కొకటి సంబంధం లేవుగదా!" అని ప్రశ్నించింది.

నేను వెంటనే స్థిమితపడ్డాను. ఇదంతా కల అని పొరపాటున నోరుజారి, అనలేదుగానీ అంటే కథలోని ఆనందమంతా బూడిదలోపోసిన పన్నీరు చందమయ్యేది. ఏవిధంగానైనాసరే ఇకనుంచి నవ్వుం బిగించి మధ్యమధ్య పల్లారాంను ఎదిరించక తప్పదు. ఆ బ్రహ్మదేవుడే స్వయంగా స్వప్నాలను చెదరగొట్టినప్పుడు మనం ఇంకా మొరపెట్టుకొనే దెవరితో? మనం చెదరగొడితే మాత్రం ఆయనకు చాలా కోపం వస్తుంది.

"తాతగారూ, వాళ్ళిద్దరికీ వివాహమయిందా? ఆసంగతులేమీ చెప్పనే లేదు" అని అడిగింది పాపక్క.

వివాహం జరగటం చాలా అవసరమని అర్థం చేసుకున్నాను. "వివాహం జరక్కుండా ఎలా ఉంటుంది" అని జవాబు చెప్పాను.

"మీరు మళ్ళీ వాళ్ళిద్దరినీ కలుసుకున్నారా?"

"ఎందుకు కలుసుకోలేదు, కలుసుకున్నాను. అప్పుడు తెల్లవారుజామున నాలుగున్నర గంటలయి ఉంటుంది. రోడ్డు మీది దీపాలన్నీ ఇంకా ఆరిపోలేదు. నూతన్న వధువు తన వరుని చెయ్యి పట్టుకొని తీసుకొని వెళుతూ ఉండటం చూశాను."

"ఎక్కడికి తీసుకు వెళుతుంది?"

"కొత్తబజారుకు, దుంపకూరలు కొనటానికి వెళుతున్నారు."

"దుంపకూరలా!"

"అవును- పెళ్ళికుమారుడు అంగీకరించటం లేదు."

"ఎందుకని?"

"అంత అవసరమైతే పనసకాయ కొని తెస్తాను కానీ దుంపకూరలు మాత్రం తీసుకురాను" అన్నాడు.

"తరువాత ఏంజరిగింది?"

"దుంపకూరలు కొని భుజాన పెట్టుకొని తీసుకురాక తప్పలేదు."

పాపక్క సంతోషించింది. "మంచిపనిజరిగింది! రాగానే పెళ్ళికూతురు చక్కగా బుద్ధిచెప్పింది" అని అన్నది.

# 5

నేను ఉదయంపూట నా గదిలో కూర్చొని టీ త్రాగుతున్నాను. ఇంతలో మా అతడు అక్కడికి వచ్చాడు.

"ఏమైనా మాట్లాడాలా?" అని అడిగాను నేను.

"అవును" అన్నాడు అతడు.

"చెప్పదలిచిందేదో త్వరగా చెప్పు. నేను తొందరగా వేరేపనినిమిత్తం బయటకు వెళ్ళాలి."

"ఎక్కడకు వెళతారు?"

"గవర్నరు గారింటికి."

"గవర్నరుగారు మీకు కబురు చేస్తూవుంటారా?"

"కబురు చేయటమంటే సాధారణంగా కాదు, ఘనంగానే పిలపిస్తూ ఉంటారు."

"ఘనంగా అంటే అదెట్లా?"

"వారికి వార్తలందించేవాళ్లు అనేకమంది ఉంటారు గదా. నేను వాళ్ళందరికంటె మంచి వార్తలు కల్పించగలను. రాయబహద్దూర్ బిరుదులు సంపాదించిన వారుకూడా నాతో పోటీపడలేదు. ఆ విషయం నీకు కూడా తెలుసుగదా!"

"తెలుసు. కానీ నా విషయంలో నువ్వు ప్రస్తుతం మరీ అల్లాటప్పా కథలు అల్లుతున్నావు."

"అందులో నా తప్పేముంది? ప్రస్తుతం అల్లాటప్పా కథలే కావాలంటున్నారు."

"అయితే కావచ్చు. కానీ, దానికి కూడా ఒక శైలి వుండాలిగదా! తలాతోకా లేని అసంభవమైన, కథలు ప్రతి వారూ అల్లగలరు"

"నువ్వు నీ ఉద్దేశ్యంలో అసంభవమనేదానికి ఒక నిదర్శనం చూపించు"

"అయితే చూపిస్తాను. విను."

అతడు ఈ విధంగా చెప్పనారంభించాడు.

స్మృతిరత్న మహాశయుడు మోహన్‌బాగ్‌లో గోల్ కీపర్‌గా ఉండి కలకత్తా క్లబ్బునుంచి ఆరు 'గోల్'లు తిన్నాడు. అప్పటికీ వారి ఆకలి తీరలేదు సరిగదా మరింత ఆకలి పెరిగింది. ఎదురుగా ఆక్టర్‌లానీ మాన్యుమెంటు దొరికింది. క్రిందినుంచి ప్రారంభించి పైవరకు శుభ్రంగా నాకేశారు. బదల్ ఉద్దీన్ మియా సెనేట్ హాలులో కూర్చొని చెప్పులు కుట్టుతూ ఉన్నాడు అతడు ఇది చూచి నోరు తెరుచుకొని పరుగెత్తుకుంటూ వచ్చాడు. "శాస్త్రజ్ఞులు, పండితు

లైన మీరు ఇంత గొప్ప వస్తువును ఎంగిలి చేశారుకదా!" అని అన్నారు వారితో

"అయ్యయ్యో!" అంటూ మూడుసార్లు మాన్యుమెంటు మీద ఉమ్మేసి మిత్రాగారు వార్త చెప్పటానికి 'స్టేట్స్‌మన్' పత్రిక ఆఫీసుకు పరుగెత్తారు.

తన నోరు అపవిత్రమై పోయిందని స్మృతిరత్న మహాశయునికి అకస్మాత్తుగా తెలిసింది తిన్నగా మ్యూజియంలో ఉండే ద్వారపాలకుని వద్దకు వెళ్ళాడు. అక్కడికి వెళ్ళి అతనితో "పండాగారూ, మీరూ బ్రాహ్మణులు, నేనూ బ్రాహ్మణుడను, ఇవాళ మీరు నా మాట నిలబెట్టాలి" అని అన్నాడు.

పండాగారు తన గడ్డము మీసాలు సవరించుకొంటూ నమస్కారం చేసి "కోమా భూ పోరతే భూ సీ భూ ప్లే" అని అన్నాడు.

స్మృతిరత్న మహాశయుడు ఆలోచించిచూచి "మీరు అడిగింది చాలా కష్టమైన ప్రశ్న. సాంఖ్యశాస్త్ర ఆధారంతో బాగా ఆలోచించి రేపు జవాబు చెపుతాను. అదీగాక ఇవాళ నా నోరు మాన్యుమెంటును నాకటంవల్ల అపవిత్రమై పోయింది" అని చెప్పాడు.

పండాగారు అగ్గిపుల్లగీసి బర్మాచుట్ట వెలిగించారు. గట్టిగా రెండు దమ్ములు పీల్చి "అయితే తక్షణం 'వెబ్‌స్టర్ డిక్షనరీ' తెరిచి దానిలో ఏ విధానం వ్రాసి ఉందో చూడు" అని అన్నాడు.

"అదంతా ఇప్పుడు చూస్తే నేను కాశీకో గంగకో వెళ్ళాల్సి వస్తుంది అవన్నీ తరువాత చూద్దాం. ప్రస్తుతానికి ఇత్తడి పూతవేసిన మీ కర్రనొకసారి నా కివ్వండి" అని అన్నాడు స్మృతిరత్న మహాశయుడు.

"ఎందుకు, ఏంచేస్తారు? కంట్లో బొగ్గునలుసు పడిందా ఏం!" అని అడిగారు పండాగారు.

"మీ కెలా తెలిసింది? అది మొన్నటి సంగతి తారు మారుపురంలో ఉండే యకృతి వికృతిలో గొప్పడాక్టరు మైక ర్టనీ గారింటికి పరుగెత్తాల్సి వచ్చింది. వారు నారికేళప్రదేశం నుంచి లేడిని తెప్పించి కంటిని శుభ్రం చేశారు"

"అయితే, మీకీకర్ర ఎందుకు?"

"దంతధావనానికి."

"అదావిషయం, అలా చెప్పండి. ముక్కులో పెట్టు కుని తుమ్మాలనుకుంటున్నారేమో అనుకున్నాను- అలాంటిది గనుక జరిగితే గంగా జలంతో నేను దానిని శుద్ధిచేసుకోవలసి వచ్చేది"

* * *

ఇంతవరకు చెప్పి అతడు హుక్కా తనవైపుకు లాక్కొని గట్టిగా రెండుదమ్ములు పీల్చాడు. అప్పుడు అతడు మళ్ళీ ఈ విధంగా చెప్పనారంభించాడు-

"చూశావా, వృద్ధసోదరా, నువ్వు కల్పించి కథలు చెప్పే పద్ధతి ఇలాగే వుంది. ఇది చేతితో వ్రాయకుండా

వినాయకుని తొండముతో భారీగా వ్రాసినట్లవుతుంది. మనకు తెలిసిన ఒక వస్తువును గురించి అది ఉన్నరూపంలో గాక మరో విధంగా వర్ణించటం చాలా తేలికే. గవర్నరుగారు నూనెగానుగ ఆడించటంవూని బాఘ్ బజారులో ఎండుచేపల దుకాణం తెరిచారని చెప్పినా ఎవరూ అభ్యంతరం చెప్పరు. ఇలాంటి చౌకబారు హాస్యానికి నవ్వినా ఆ నవ్వుకు విలువేముంది?"

"నువ్వు నీ స్వభావం మార్చుకున్నట్లు కన్పిస్తావు"

"అందుకు కారణం ఉంది. మధ్య నన్నుంచి అరోజున పాపక్కకు నీ చిత్తంవచ్చినట్లు చెప్పావు. చిన్నపిల్ల కావటం వల్ల దీదీ నోరుతెరుచుకు చూస్తూకూర్చుంది. ఏదైనా అద్భుత విషయాన్ని చెప్పాలంటే దానిలో శిల్పంకూడా ఉండటం చాలా అవసరం."

"అంటే నా కథలో శిల్పం లేదంటావా?"

"లేదంటావా ఏమిటి! ఏమీలేదు. నన్ను దానిలోకి ఈడ్చుకపోతే నేను నోరు విప్పేవాడినే కాదు. మీ అతిథికి జిరాఫీ ఇగురు, ఆవాల చట్నీతోపాటు చిన్నచేపల చారు, పలావుతోపాటు బురదలోనుంచి పట్టితెచ్చిన పురుగుల్ని, తాటిచెట్టు చేవకూరను మీరు వడ్డించామని చెప్పినప్పుడు కూడా 'ఇది చాలా మోటుగా ఉంది. వ్రాయటం చాలా తేలికే' అనే నేనంటాను"

"నువ్వు చెప్పదలిస్తే ఎలా చెపుతావు?"

"నేను చెపితే మీకు కోపం రాదుగదా? సోదరా, మీకంటె నేను గొప్పవాడిననిగానీ నాలో గొప్ప రచనాశక్తి

వుండనిగానీ నేను చెప్పటం లేదు. అవి నాలో తక్కువ మోతాదులో ఉంటేనే నాకు వీలుగా వుంటుంది. నేనయితే ఎలా చెప్పుతానో వినండి—"

అని అతడీ విధంగా చెప్పనారంభించాడు —

తాష్మానియాకు నన్ను పేకాటకు ఆహ్వానించారు. అక్కడ ఇంటియజమాని పేరు కోజూమాచుక్. శ్రీమతి ఛీం కందానీ కోరుంకనా యజమానురాలి పేరు. వారి పెద్ద మ్మాయి పేరు పామ్కుణీదేవి. ఆమె కింటినాబూ మిరివునాథు అనే కూరను స్వయంగా తయారు చేసింది. దానివాసన గ్రామంలోని పసుపేటలు దాటి చాలా దూరంవరకు వ్యాపించింది. క్లుప్తంగా చెప్పాలంటే దాని వాసన తగలగానే చుట్టుపట్ల వున్న నక్కలన్నీ పట్టపగలే నిర్భయంగా అరవసాగాయి- అవి కూర మీద కోర్కెతో అరుస్తున్నాయో, లేక బాధ కలిగే అరుస్తున్నాయో చెప్పటం కష్టం. కాకులు మూడేసి గంటలవరకు ముక్కులు భూమిలోకి గుచ్చి సత్తువకొద్దీ తమ రెక్కలు టపటప కొట్టుకుంటాయి. ఇది కూరసంగతి, కుండ నిండుగా కాంగూచ్టో సాంగ్చానీ ఉంది. ఆ దేశంలో లభించే ఆంకూస్టట్ పండ్లపై బెరడుతో తయారుచేయబడింది. వాటితో పాటు ఒకపెద్ద గంపనిండా ఒకటే డిక్టీమాయి అనే మిఠాయి ఉంది. మొదట వారి పెంపుడు పసుగొకటి వాటన్నిటినీ కాళ్ళతో మట్టగించి వేసింది. ఆ తరువాత ఆ దేశంలో అన్నిటికంటె పెద్దజంతువు, మనిషి– ఎద్దు- సింహం మూడు అంశములు కలిసిన గాండి సాంగ్డుంగ్ అనునది తన ముళ్ళ నాలుకతో నాకి దానిని మెత్తగా తయారు చేసింది. తరు

వాత ఒక్క పెట్టున మూడు వందలమంది విస్తళ్ళ ఎదుట ధమ ధమ రోళ్ళ చప్పుడు విన్పించసాగింది. ఈ భయంకర శబ్దాన్ని విని నోరూరి దూరదూరాలనుంచి ఎంతోమంది భిక్షుకజనం గుంపులుగా రాసాగారని వారన్నారు ఆ పదార్థాన్ని తినే సమయంలో వూడిపోయిన దంతాలను అతిథులు ఇంటి యజమానికి కానుకగా సమర్పించుకొని వెళుతున్నారు వారు ఆ దంతాలన్నిటినీ జాగ్రత్తగా బాంకుకు పంపేవారు. వాటిని తమ సంతతికి చెందునట్లు వీలునామా వ్రాసేవారు. ఎవర ఖాతాలో ఎక్కువ దంతాలు నిలవవుంటే వారిని అంత ఎక్కువగా గౌరవించేవారు. కొందరు దొంగచాటుగా దంతాలను కొని తమ పేరజమకట్టించుకుంటారు. వీటిని గురించి చాలా పెద్ద పెద్దవ్యవహారాలుజరిగాయి వెయ్యిదంతాలసంపన్నులుయీ గ్రైదంతాల సంపన్నులతో వియ్యమందరు. ఒకసారి పదిహేను దంతాల ఆసామి ఒకడు వెయ్యిదంతాల సంపన్నుల ఇంటికి వచ్చి కేట్బాలడ్డులు తింటూ అకస్మాత్తుగా శ్వాస ఆడక చని పోయాడు. వెయ్యిదంతాల సంపన్నులు అతని శవాన్ని దహనం చేయటానికి అంగీకరించలేదు. చివరికి ఎవరూ చూడకుండా అతని శవాన్ని చౌచంగినదిలో పారవేశారు. దీని మీాదట నదికి ఇరువైపుల ఉండేవారు నష్టపరిహారానికి కోర్టు కెక్కారు. చివరికి ప్రీవీకౌన్సిలు వరకు వెళ్ళారు.

ఆ మాటలు వింటూ శ్వాస ఆడక నాకు రొప్పు పుట్టింది. "చాలు చాలు, ఇక చాలించు. నువ్వు ప్రారంభించిన ఈ కథలోని ప్రత్యేకత ఏమిటో?" అని అన్నాను నేను.

"అడవిరేగు గింజల చట్నీ కాకపోవటమే దీని ప్రత్యేకత. మనకు ఏమీ తెలియని విషయాన్ని గురించి ఎంత అతిశయోక్తులు కల్పించి చెప్పినా ఇబ్బంది వుండదు. ఎవరికీ సంజాయిషీ చెప్పుకోవలసిన అవసరం లేదు. కానీ, అంత మాత్రాన దీనిలో మంచి హాస్యం ఉందని నే నను. నమ్మ శక్యంగాని విషయాలలో నమ్మకం కలుగునట్లు చెప్పగలిగి నప్పుడే అద్భుతరసం గల కథ అతికి పోతుంది. మరీ బజారు రకంగా ఉండే కుర్రతనపు చౌకబారు అతిశయోక్తులతో కథ లల్లుతూ ఉంటే నీకు అపకీర్తి తప్ప దక్కేదేమీ ఉండదు. నేను చెప్పినది బాగా గుర్తుంచుకోండి."

"అయితేసరే, ఈ సారి పాపక్కకు పూర్తి నమ్మకం కలిగేట్లు కథ అల్లుతాను. తరువాత ఆమె నమ్మకం వదిలించాలంటే ఏ భూతవైద్యుడినో పిలిపించాల్సి వస్తుంది" అని అన్నాను నేను.

"మంచిదే. నువ్వింతకు ముందు గవర్నరుగారింటికి వెళ్ళాలని అన్నావెందుకు?"

"అదంతా ఏమీలేదు. నిన్ను త్వరగా వదిలించుకోవాలని అలా అన్నాను. నువ్వు కూర్చున్నావంటే అంతంత మాత్రాన వదలివెళ్ళవు. అందుకని 'వెళ్ళిపో' అనే దానిని మరోవిధంగా చెప్పాల్సి వచ్చింది."

"అర్థమయింది. అయితే నేను వెళతాను."

# 6

సర్కసుచూచివచ్చినతరువాత పాపక్క మనసులో పులి రూపం హత్తుకు పోయింది. ఆ పెద్దపులితోనూ, దాని పిన తల్లితోనూ పాపక్క అనుక్షణం ఏదో ఒక సంభాషణ సాగి స్తూనేఉంది. మాలో, ఎవ్వరమూ లేనప్పుడు ఏకాంతంలో వారి సమావేశం జరుగుతూ వుండేది.

ఆమె నన్ను మంగలినిగురించి అడిగింది. "మంగలితో ఏంపని?" అని అడిగాను.

పెద్దపులి తనను వదలకుండా వెంటబడి తిరుగుతుందనీ, దాని మూతిమీద సూదుల్లాంటి పెద్ద మీసాలున్నాయనీ వాటిని శుభ్రంగా తీసివేయించాలనుకుంటున్నట్లు పాపక్క జవాబు చెప్పింది.

"మీసాలు తీసివేయించుకోవాలనే ఆలోచన పులికి ఎలా కలిగింది?" అని నేను అడిగాను.

"టీ త్రాగిన తరువాత నాన్నగారి కప్పులో అడుగున మిగిలే మడ్డిని నేను పులికి త్రాగించే దానిని. ఒకనాడు పులి ఆ మడ్డిని నాకుటకు వచ్చినప్పుడు అది పంచూ బాబును కలుసుకొంది. మీసాలు తీసివేయిస్తే తన ముఖంకూడా పంచూబాబు ముఖంవలె ఉంటుందనే అభిప్రాయం దాని మనస్సులో నాటుకుపోయింది–" అనిపాపక్క జవాబు చెప్పింది.

"దాని ఆలోచన బాగానే ఉంది. కానీ అది జరగటం కొంచెం కష్టమే. మీసాలు తీయకముందే అది మంగలిని చంపివేస్తే ఆ పని పూర్తికాదు."

"ఆ మాట వినగానే పాపక్క బుర్రలో ఆలోచన తోచింది; "తాతగారూ, పులి మంగలిని తినదు" అని అన్నది.

"అదేమిటి పాపక్కా! పులి మంగలిని ఎందుకు తినదు?" అని అడిగాను నేను.

"మంగలిని తింటే పాపం"

"అయితే, భయపడాల్సిన అవసరం లేదు. ఒక పని చేద్దాం. చౌరస్తాలో ఉన్న ఏ మంగలిదొర పాపుకైనా తీసుకు వెళితే ఎలా వుంటుంది!"

పాపక్క చప్పట్లు చరుస్తూ "భలే, భలే! చాలా బాగుంటుంది. మంగలిదొరను చూస్తే పులికి ద్వేషం, అందుకని అతని మాంసం తినదు" అని అన్నది

"ఒకవేళ పులి అతనిని తింటే గంగాస్నానం చేయాలి. అంటరానితనము మొదలగు పులుల ఆచారము నీకెలా తెలుసు?"

పాపక్క అన్నీ తెలిసిన ముదినాపసానివలె ముఖంపెట్టి "నాకు అన్నీ తెలుసును" అని అంది.

"నాకే తెలియదంటావు, అంతేనా?"

"తెలిస్తే ఏమిటో చెప్పు."

"పెద్దపులులు రైతుల్ని, కళాసుల్ని తినవు. ముఖ్యంగా గంగానది పడమటి ఒడ్డున ఉండేవారి మాంసం ఎంతమాత్రం తినవు. పులుల శాస్త్రంలో అది నిషేధం."

"తూర్పుతీరాన ఉండేవారిని తినవచ్చునా?"

వారు కళాసుత్తైతే వారి మాంసం అతి పవిత్రమైనది. ఎడమ పంజాతో వారిని గీరుకొని తినాలని నియమం."

"ఎడమ పంజాతో ఎందుకనీ?"

"అదే వాటి విశుద్ధ నియమం. పెద్దపులుల పండితులు కుడిపంజాను అపవిత్రంగా నిర్ణయించారు. పాపక్కా, ఈ విషయం నీకు తెలుసా? మంగలి స్త్రీలంటే వాటికి చాలా ద్వేషం. మంగలి స్త్రీలు, స్త్రీల కాళ్ళకు పారాణి పెడతారు గనుక అది వాటికి నచ్చదు."

"పారాణి పెడితే వాటికేం నష్టం?"

"పారాణి రక్తానికి అనుకరణ అని బైరాగి పులుల సిద్ధాంతం గీరటం వల్లనో, కొరకటం వల్లనో వచ్చిన రక్తం కాదది. ఆ ఆచారం వట్టి భ్రమ. ఇలాంటి కృత్రిమ వ్యవహారాలంటే వాటికి తగని ద్వేషం. ఇలాంటి వాటిని అవి దూషిస్తాయి. ఒకానొకప్పుడు ఒక పులి ఒక రంగులద్దేవాని ఇంట్లో జొరబడింది. ఒక తొట్టిలో బచ్చలపండు రంగు కలిపి ఉంది. ఆ పులి చాలా సంతోషంగా ఆ తొట్టిలో తన తలను ముంచింది. అది చాలా మంచిరంగు. పులి ముఖమంతా ఎర్రగా మారిపోయింది. ప్రక్కనే కారడవిలో గేదెలవేట పురోహితపురం అని ఒక పులుల గ్రామం ఉంది. ఈ పులి అక్కడికి వెళ్ళగా అక్కడ ఉండే పులి ఆచార్యుల వారు ఇదేమిటెడద. నీ ముఖమంతా అలా ఎర్రబడిందేమిటి?" అని అడిగారు.

సిగ్గుపడి ఆ పులి "ఒక ఖడ్గమృగాన్ని చంపి దాని రక్తాన్ని త్రాగి వస్తున్నాను" అని పూర్తిగా అబద్ధంచెప్పింది.

"నీ పంజాకు ఎక్కడా రక్తపు గుర్తులు లేవేం?" అని ఆచార్యులవారు ప్రశ్నించారు. తరువాత ఆ పులి నోటిని వాసన చూచి "నోటినుంచి రక్తపు సువాసనే రావటం లేదు. ఎందుకని?" అని కూడా అడిగారు. అక్కడ చేరిన పులులన్నీ "ఛీ, ఛీ! ఇది రక్తమూ కాదు, మెదడూ కాదు, పిత్తమూ కాదు. ఇది మనుష్యుల ఇంటికి వెళ్ళి మాంసాహారం కాని అపవిత్రమైన వస్తువును తినివచ్చింది" అని ఏకకంఠంతో చెప్పాయి పంచాయితీ జరిగింది. విషయాన్నంతా విని పంజాదెబ్బ ప్రవీణ గారు "ప్రాయశ్చిత్తం జరగాలి" అని గర్జించారు. చివరికి ప్రాయశ్చిత్తం తప్పలేదు.

"ప్రాయశ్చిత్తానికి ఆ పులిఅంగీకరించకపోతే ఏంజరుగుతుంది?"

"అయ్యయ్యో! అదెట్లా కుదురుతుంది. ఒక్కరుగాదు ఇద్దరుగాదు అయిదుగురు ఆడపిల్లల తండ్రి పెద్దపెద్దగోళ్ళ పంజా కలిగిన పెద్దమ్మాయి గారికి పెళ్ళీడు వచ్చింది. సమాజానికి విరుద్ధంగా నడుచుకుంటె గడిచేదెలా? తోకముడిచి డజను ఆవుల్ని గేదెల్ని కట్నంగా ఇస్తానని ప్రాధేయపడినా వరుడు లభించటం కష్టమవుతుంది. అంతకంటెకూడా భయంకరమైన శిక్ష విధిస్తారు-"

"ఏమిటాశిక్ష?"

"చనిపోయినప్పుడు శ్రాద్ధకర్మలకు పురోహితుడు రాడు చివరికి గతిలేక వెదురువనంలో ఉండే కొయ్యపులుల పురోహితుడిని పిలుచుకోవాలి ఆ పని చాలా హీనమైనది. ఏడుతరాలవరకు తలెత్తుకు తిరగేపని వుండదు."

"శ్రాద్ధకర్మలు చేయకపోతే నష్టం ఏమిటి?"

"భలే. అదెట్లా కుదురుతుంది. పులిభూతం తిండిలేక చచ్చిపోతుంది?"

"ఎలాగో చచ్చిపోయిందేగదా, మళ్ళీ ఎట్లా చచ్చిపోతుంది!"

"వచ్చిన చిక్కే అది. శ్రాద్ధకర్మలు జరగనిచో చాలా కీడు జరుగుతుంది. తినకుండా చనిపోయినా మంచిదే కాని చనిపోయి తిండిలేకుండా వుండటం మహా దుర్భరంగా ఉంటుంది."

పాపక్క ఆలోచనలో మునిగిపోయింది. కాస్సేపటికి ముఖం చిట్లించి "ఇంగ్లీషువారి భూతాలకు ఆహారం ఎక్కడ దొరుకుతుంది?" అని అడిగింది.

"వాళ్ళు బ్రతికి ఉన్నప్పుడే ఏడుజన్మలకు సరిపడునంత తింటారు. మనం తిన్నటువంటిది వైతరిణి దాటేసరికే జీర్ణమై ఆకలి దహించి వేస్తుంది"

సందేహ నివృత్తికాగానే పాపక్క "ఆ పులికి ఏవిధమైన ప్రాయశ్చిత్తం నిర్ణయించారు?" అని అడిగింది.

"గర్జన విద్యావాచస్పతిగారు చండీపులి మతానికి వాయువ్యమూల కృష్ణపంచమి మొదలు అమావాస్య రాత్రి రెండు జాముల వరకు ఒక నక్క తలను తిని ఉండాలి. ఆ నక్కను ఆ పులి మేనత్త కూతురుగానీ, పినతండ్రి బావమరది కుమారుడుగానీ వేటాడి తేవాలి. ఆ నక్కతలను వెనుక కుడి పంజాతో విరుచుకు తినాలి అని నిర్ణయించారు. ఇంత పెద్ద

శిక్ష విధించేసరికి ఆ పులి గుండెల్లో దడపుట్టింది. అప్పుడది నాలుగుకాళ్ళు జోడించి ఏడుస్తూ బ్రతిమాలుకొంది."

"అది అంత ఘోరమైన శిక్షా?"

"అదేమిటి పాపక్కా! నక్కమాంసం తినాలి. పులి జాతి దృష్టిలో అంతకంటె అశుద్ధ వస్తువు ప్రపంచంలో మరొకటి లేదు. అందుకని ఆ పులి ప్రాధేయపడుతూ 'దీనికంటె ముంగిస తోక తినమని శిక్షవిధించండి' అని అడిగింది. నక్క తలను తినటం చాలా ఘోరమైనది. ఈదురవస్థనుంచి దానిని భగవంతుడే కాపాడాలి!"

"చివరికి శిక్షనేమైనా తగ్గించారా! అదే శిక్ష విధించారా!"

"అదేశిక్షవిధించారు. అంతకు మినహా మరోమార్గమే లేదు."

"తాతగారూ, అలా అయితే పులులు చాలా ధర్మనిష్టగలవిగా కన్పిస్తున్నాయే!"

"ధర్మనిష్ట లేకపోతే ఇన్ని నియమాల నెందుకు ఏర్పరచుకొంటాయి? అందుకనే నక్కజాతి వాటిని చాలా గౌరవభావంతో చూస్తుంది. పులి తినివదిలిన ఎంగిలి దొరికినా అదే మహాప్రసాదంగా తమ అదృష్టమని భావిస్తాయి. మాఘమాసంలో మంగళవారం రోజున త్రయోదశి గనుకవస్తే ఆ రోజురాత్రి అంత్యఘడియలలో అంటే జాముజామున్నరకు తెల్లవారుతుందనగా ముసలి పులుల [illegible] ు నాకి రావటం నక్కలు చాలా పుణ్యకార్యమని న[illegible] పుణ్యాన్ని

సంపాదించుకోటానికి ఎన్ని నక్కలు ప్రాణాలు అర్పించాయో లెక్కలేదు."

పాపక్కకు సందేహం కలిగింది. "పెద్దపులులు ఇంత ధర్మనిష్ఠగలవే అయితే అవి జీవహింసచేసి పచ్చి మాంసాన్ని ఎందుకు భక్షిస్తాయి?" అని అడిగింది.

"అది మామూలు మాంసం వంటిదనుకొంటున్నావా! కాదు, కాదు ముందు అవి మంత్రాలుపఠించి తాము చంపే జీవిని శుద్ధిచేస్తాయి."

"ఏమి మంత్రాలవి?"

"అవి తమ సనాతన గర్జన మంత్రాన్ని పఠిస్తాయి. ముందుగా ఆ మంత్రాన్ని ఉచ్చరించి అప్పుడు దేనినైనా చంపుతాయి గనుక అది హత్యకాదు."

"ఒకవేళ కొన్ని పులులు ఆ గర్జన మంత్రాన్ని చదవటం మర్చిపోతే అప్పుడెలా?"

"పులి పుంగవ పండితుల సిద్ధాంతంప్రకారం మంత్రం లేకుండా ఏ జంతువునైనా చంపితే వచ్చేజన్మలో అదేజంతువుగా జన్మిస్తాయి. కర్మచాలక మనిషి జన్మ ఎత్తవలసి వస్తుందేమోనని అవి చాలా భయపడుతూ ఉంటాయి."

"ఎందుకని?"

"మానవదేహం ఒకకుప్పలాంటిదనీ, అది చాలా వికృతంగా ఉంటుందని వాటి ఉద్దేశ్యం. పైగా ఒక మామూలు తోక – అది కూడా తమదికాదు. వీపుమీది ఈగలు తోలటానికి మనిషి [illegible]o చేసుకోవాలి. అదీగాక నిలబడి రెండుకాళ [illegible]లె వినోదంగా నడుస్తుంటే అది

చూచి చచ్చే నవ్వొస్తుంది. బ్రహ్మదేవుడు భూమిమీద ప్రాణికోటిని సృష్టించినప్పుడు సృష్టిముగింపుకువచ్చి సామాగ్రి అయిపోతూ ఉన్నప్పుడు అకస్మాత్తుగా మనిషిని సృష్టించాలనే కోర్కె కలిగి ఉంటుందని ఆధునిక పులిజాతిలో గొప్ప జ్ఞానియగు శార్దూల్యత త్వరత్నాకరుని అభిప్రాయము. అందువల్లనే మనిషి పాదాల అడుగున పంజాలు లేవు సరిగదా ఒకటిరెండుగిట్టలైనా పెట్టలేదు పాపం, అందుకని మనుష్యులు చెప్పులు ధరించి సిగ్గుదాచుకుంటారు. దుస్తులు ధరించి శరీరాన్ని దాచుకుంటారు. ఈ సర్వప్రపంచంలో సిగ్గుగలజీవి మనిషి ఒక్కడే. ప్రాణులలో మరిదేనికీ ఇంతసిగ్గు లేదు."

"పులులు ఇందుకు చాలా గర్వపడుతూ ఉంటాయి గదూ?"

"అవునవును. చాలా గర్వపడతాయి. అందుకనే అవి ప్రపంచంలోని ఇతరజాతులన్నింటికంటె ఇలాంటి నియమాలు ఏర్పాటుచేసుకొని నడుస్తున్నాయి. జాతిపేరిట ఒక మానవజాతి స్త్రీ ఒట్టు వేసినంత మాత్రాన ఒకానొక పులి ఆహారపానీయాలు పూర్తిగా మానివేసింది. దీనిని గురించి మన 'అతడు' ఒక గేయం కూడా వ్రాశాడు."

"మీవలె 'అతడు' కూడా కవిత్వం వ్రాస్తాడా?"

"తాను వ్రాయగలననే అతడి అభిప్రాయం. కానీ ఈ చర్చలోకి పోలీసుల్ని మాత్రం పిలవకూడదు."

"సరే, ఆ గేయం ఏమిటో విన్పించండితాతగారూ!"

"ఇదిగో విను."

అనగనగా ఒక చిరుతపులి
దానివంటిమీద నల్లని మచ్చలెన్నో
ఒకనాడది వచ్చిపడెను ఇంటిలోకి
నౌకరును నమిలి వేయాలని.
అద్దములో దాని ప్రతిబింబము చూచి
నౌకరు పారిపోయె తన యింటికి
అద్దములో తన ఆకారము
చూచుకున్న చిరుతపులికి
ఆగ్రహావేశంతో కలిగెను!
'ఛీ! ఇదేమిటి? తన వీపుమీద
నల్లని ఈ మచ్చలేమిటి?
ఈ పని చేసిందెవరు?
ఎవడా గాడిద? ఎదుటకు వస్తే
నమిలి మ్రింగుతాను' అని
గంతులు వేయసాగెనది.
ఆరుబయట రోటిలోన
పూంటూ ధాన్యము దంచుతుంది!
పులి పూంటూ వద్దకు వెళ్ళి
త్వరగా గ్లిసరిన్ సబ్బు
తీసుకురమ్మని కసిరింది.
'అయ్యో, తమరన్నది ఏమిటి?
తమకు కావలసిందేమిటో
ఏమీ అర్థంకాలేదు నాకు
తక్కువజాతి నాది,

చదువురాని మొద్దును
మీ మాటల అర్థం నాకు
ఏమీ తెలియనే లేదు.'
'అబద్ధమాడకు!
కళ్ళు కన్పించటం లేదా!
వళ్ళు తెలిసి కళ్ళు తెరిచి చూడు!
నా వీపుమీద నల్లని మచ్చలేమిటి?
ఈ మచ్చలు నీకు లేవేమి?
త్వరగా గ్లిసరిన్ సబ్బు
తీసుకు రమ్మని కసిరింది.
పులిమాటలు విని పూంటూ
వినయముగా నిట్లనెను-
'అయ్యో, ఏమా సబ్బు,
నా పై మీకంత కోపమెందుకు?
నేనేమీ దొరసానిని కాదు,
నా దేహము కారునలుపు!
మీ మాటలు విన్న నాకు
నవ్వొతోడ కడుపుబ్బెను.'
'నా మాటకు ఎదురాడగ
నీ కెంతధైర్యం?' అంటూ
చిరుతపులి పూంటూ మీదికురికె.
'అమ్మయ్యో' అంటూ పూంటూ
రెండడుగులు వెనక్కివేసి
పులితో ఇలా అంది-

'స్వామీ, త్వరపడి కోపంలో
పొరపాటు చేయకండి!
అంటరాని దానిని నేను,
గాంధీగారి శిష్యురాలను
పొరపాటున నన్ను చంపి
ధర్మచ్యుతి పొందవద్దు
మీ పాదాలకు మ్రొక్కుతాను!
జాతి భ్రష్టుడవు కావద్దు!'
పూంటూ మాటలు విని
పులి వెనక్కితగ్గి ఇలా అంది-
'ఛీ! ఛీ! పాదాలమీద పడకు,
దూరంగానే ఉండు-
నలుగురిలో నగుబాటుపని
ఇంటింటా ఇదే చర్చ సాగుతుంది.
నా నోములు ఫలించవు.
వివాహప్రాప్తి ఉండదు
ఖర్చులుమాత్రం తప్పవు.
శత్రువులకు చక్కని సాకు
దొరుకుతుంది.
బ్రహ్మచారి బ్రతుకు బ్రతకలేను.
ఓటమి నాది! విజయం నీది!'

"పాపక్కా, నీకీ విషయం తెలుసునా? ఆధునిక పులి సమాజంలో ఒక బ్రహ్మాండమగు కాండ జరుగుతూ ఉంది. ప్రస్తుతం దానినిమనం అభ్యుదయంఅనిఅంటున్నాము. అభ్యు

దయవాదులగు పులి ప్రచారకులు అస్పృశ్యత పేరుమీద తిన టమా తినకపోవటమూ అని ఆలోచించటం పవిత్ర జీవాత్మను ప్రత్యక్షముగా అవమానించటమేనని వాడవాడలా ప్రచారం చేస్తున్నారు. నేటినుంచి మనం వర్ణవివక్షత, మత, జాతి వివ క్షత లేవీ లేకుండా దొరికిన ప్రతి ప్రాణిని కుడిపంజాతో, ఎడమ పంజాతో, వెనుక పంజాలతో కూడా భక్షిద్దామని చెపుతున్నాయి. ఇలాంటి విశాల దృక్పథాన్ని ప్రస్తుత పులి జాతి అలవర్చుకొంది. అంతేకాదు, పులిజాతిలో నూటికి నూరూ యుక్తివాదులే. సమస్త ప్రాణికోటిని సమానంగా గౌరవించాలనే ఉన్నతాశయం కలిగి వున్నాయి. ఇప్పుడవి పడమటితీరాన నివసించే రైతులను, కళాసులను కూడా తినా లను కొంటున్నాయి. వారిని వెలివేసినట్లు వదలివేసి వారిని అగౌరవపరచటం వాటికి ఎంతమాత్రం ఇష్టంలేదు. దీనిని గురించి పులిజాతిలో ఘోరమగు ముదాతత్త్వాలు తలెత్తాయి. సనాతన సిద్ధాంతాల ప్రకారం నడుచుకొనే పులులు నవీన ఆదర్శవాదులగు పులుల్ని 'రైతు కళాసు భక్షకులు' అని నామకరణం చేశాయి. దీనిని గురించి వాటిలో హేళనలు ఎగతాళులు జోరుగా సాగుతున్నాయి."-

పాపక్క మధ్యలో అడ్డొస్తూ "తాతాగారూ, పులి మీద మీరుకూడా ఏదైనా గేయం వ్రాశారా?" అని ప్రశ్నించింది.

ఓటమిని అంగీకరించటం ఇష్టంలేక "వ్రాశాను, ముక్త ఛందస్సులో వ్రాశాను" అని జవాబు చెప్పాను.

"ఆ గేయం విన్పించండి!"

నేను గంభీర కంఠస్వరంతో ఈ విధంగా ప్రారంభించాను:-

ఓ సృష్టికర్తా! నీ సృష్టిలోని శక్తికి
నువ్వెన్నడూ అవమానం చేయలేదు.
భయంకరమగు వాడి గోళ్ళలోనూ,
భీకరమగు వజ్రకాయంలోను
లోకాలు కంపించే శివుని కోపములోను
అపూర్వ సౌందర్యాన్ని సృష్టించావు!
ఆహా! ఎంతో ప్రచండ సౌందర్యమది!
అమితాశ్చర్యమగు నీ సృష్టిలో
ప్రళయంకరి నిశ్శృంఖల ప్రచండవాయువు,
నీ దయను సవాలుచేస్తూ
కానన గర్భంలో గర్జించే మృగరాజు
నురగల నాలుకలు చాచి
సాగరగర్భంలో లేచే తరంగాలు,
శతసహస్ర డమరుకము
లొక్కుమ్మడి మ్రోగినట్లు
భూగర్భం విచ్చుకొని
వినాశకరమగు రాక్షస శక్తివలె
నల్దిశల విరజిమ్మే లావాలో
ఎంతటి ప్రచండ సౌందర్యం!
ఎంతటి అందమైన ప్రచండము!

పాపక్క మౌనంగా కూర్చుంది.

"ఏం, గేయం నీకు నచ్చలేదా పాపక్కా?" అని అడిగాను నేను.

కొంచెం సందేహిస్తూ "ఎందుకునచ్చలేదు, నచ్చింది. కానీ ఇందులో పులి ఏది?" అని అడిగింది.

"అది గుహలో ఉంటుందిగదా, గేయంలో కూడా అంతే. కన్పించదు. కానీ ఉన్నది అతి గోప్యంగా దాగి ఉంది" అని నేను జవాబు చెప్పాను.

"చాలా రోజుల క్రితం గ్లిసరిన్ సబ్బు అన్వేషిణి యగు పెద్దపులిని గురించి మీరు చెప్పారుగదూ! 'అతడ'కి ఆ కథ ఎట్లా తెలిసింది?" అని అడిగింది పాపక్క.

"నా మాటల్ని 'అతడు' దొంగిలిస్తూ ఉంటాడు. వాటినే కాగితంమీదపెట్టి తానే వ్రాసినట్లు చెప్పుకుంటాడు."

"కానీ-"

"కానీ గేయం చాలా బాగా వ్రాశాడు."

"కానీ-"

"కానీ ఏమిటి, నిజం కూడాను. 'అతడి' మాదిరిగా నేను వ్రాయలేకపోతున్నాను. ఇక ముందు వ్రాయలేను. నా కథా సామాగ్రిని 'అతడు' దొంగిలించి దానికి చక్కగా మెరుగులు దిద్దుతాడు. తర్వాతదానినిగుర్తించటానికే వీలుండదు. 'అతడు' ఈ విధంగా చాలాసార్లుచేశాడు. చివరికి నా ముక్త ఛందస్సు విధానాన్ని కూడా అతడు కాపీ చేశాడు."

"తాతగారూ, అదేమిటో విన్పించరూ?"

"వింటానంటే చెపుతాను విను."-

అందమైన అడవిలోన
నల్లని చారలుగల
పులియొక్కటి ఉంటున్నది.
భోజనమన్న ఆసక్తిమెండు,
దానికి 'భోజనభట్టు' బిరుదుగలదు
ఆకలిని భరించ లేదు,
వేళకు దండిగా తిండిఉండాలి
రక్తమాంసాలంటే పడిచస్తుంది.
ఒకనాడది తిండిలేక
ఆకలిభూతం ఆవహించి
'ఏదీ మేకపిల్ల ఎటుపోయెను
పట్టి నమిలి మింగివేతు'
నంటూ కోపంతో తిడుతూ
గొల్లవాని ఇంటికేగి
'ఏమిరా గొల్లా,
ఆకలి దహించి వేస్తుంది
ఏదీ, ఒకమేకను తీసుకురా!'
అని ఆజ్ఞాపించింది.
పులిమాటలు విని గొల్లడు
మిన్ను విరిగి మీదపడ్డట్లు అదరిపోయె!
గొల్లడు బహుగడసరి, యుక్తిపరుడు
కళ్ళు నులుముకొని పులివైపొకసారి చూచి
ధైర్యముగా నిట్టులనియె-
'అందమైన అడవిలోని

సభ్యత ఇదేనా!
మంచీ మర్యాద నేర్చుకోవాలి!
అర్ధరాత్రి గృహస్థుల ఇండ్లమీద
దండెత్తటం న్యాయం కాదు.
పశుపుంగవా!
నేను మీ సేవకుడను-
మీ మర్యాదకు నా ఇల్లు తగదు,
చాలా చిన్నది, మురికైనది,
రాత్రులందు నాకు కళ్ళు కన్పించవు.
తమకు నేనేమి సేవచేయగలను?
రాణీగారు ఇంటివద్ద మీ కోసం
ఆకలితో ఎదురుచూస్తూ ఉంటారు
ఎంత వెతికినా అర్ధరాత్రి
ఆహారం ఎక్కడ దొరుకుంది?
ఎండుకప్పలు, కుళ్ళినకుందేలు
ఇంట్లో ఉన్నదేదో తిని
సంతృప్తిగా నిద్రపొండి!
లేనిచో, పత్రికలవాళ్ళు
మంచివాళ్ళు కారు.
లేనిపోనివన్నీ కల్పించి
పేపర్లనిండా మిమ్మల్ని గురించి
విమర్శలు వ్రాస్తారు.
పశ్చాత్తాపపడినా
తరువాత ప్రయోజనం ఉండదు.'

గొల్లవాని మాటలు విని
కోపముతో పులి ఇట్టులనియె-
'నా ఆజ్ఞను ధిక్కరించి
ఏమేమో వాగెదవెందుకు?
నోరుమూసుకొని మేకను తెమ్ము
మరియొకమాట మాటాడితివా
నిన్నే చంపి భుజింతును తులువా;
గొర్రెలు, మేకలు, గేదెలన్నిటినీ
దాచిన దెక్కడో జాగుచేయక చెప్పు,
గొల్లడు భయకంపితుడై
వినయముగా శిరమువంచి
ఇట్టులనియె మృగరాజుతో-
'ఓ పశుశ్రేష్ఠా! కోపించవలదు.
అర్భకుడను నేను
కడుపెద్దవారు మీరు దొడ్డవారు
మీ చతుష్పాదాలకు
వందన సహస్రాలు నావి;
పరులసొత్తు నాసించుట
జీవహింస చేయుట
మహాపాపమని వినలేదా'
గొల్లనిమాటకు పులిరాజిట్టులనియె-
'నీతుల పేరిట ఏవేవో సాకులు చెప్పకు,
చేతగాని కబుర్లుమాని
చెప్పుము ఆహారము ఎక్కడో!

ఆకలితో నా ప్రాణం పోవుట
జీవహింస చేయుటగాదా,
దుర్భర మీ క్షుద్బాధ
తే తెమ్మంటు రెండు మేకలను,
జాగుచేయ నిన్ను చంపి
క్షుద్బాధ తీర్చుకొందు
రా రమ్మంటు నీవే ఇక!'
పులి గర్జన విని గొల్లడు
పిడుగు పడ్డట్టు అదరిపోయి
సవినయముగా నిట్టులనియె-
'నే నోడితి పులిరాజా!
విజయం పొందిరి మీరే.
లోనికి దయచేయండి!
ఆరగించండి మేకలను తృప్తిగా.
అమితానందముతో పులిరాజు
'ఆహా, నేడెంత సుదినము!
భలేమంచి విందు దొరికె'
అనుచు విసవిస లోనికేగ.
తెలివైన గొల్లడంతడ
తలుపువేసి గొళ్ళెము బిగించె!
పరిహాసానికి గొల్లడు
తలుపులు మూసాడని తలచి
ఇల్లంతా తిరిగిచూచి
ఏమీ ఆహారం కన్పించక పులి

కడు పశ్చాత్తాప పడుతూ
తన పొరపాటుకు తల బాదుకొని
అంతలోనే కడు ఉగ్రమూర్తియై
ఉరిమినట్లు గర్జిస్తూ తిట్టసాగె-
'భలేమోసకారివేరా!
ఏవిరా దుర్మార్గుడా మేకలు?
నమ్మించి నన్ను మోసము చేస్తావా?
తగునటరా నీ కిది తులువా?
ఒకసారిటు ఎదుటకు రారా,
నీ వేడిరక్తమును
కడుపారా గ్రోలెద భడవా!'
పులి మాటలు విని గొల్లడు
నవ్వుతూ నిట్లు పలికె-
'నిన్నటివరకు నందుడు నివసించిన
ఈ గృహము నేటినుంచి
పులిరాజుకు కారాగృహం
దయతలచి యమధర్మరాజు
ఆహ్వానం పంపేవరకు
తమరిక్కడే హాయిగా ఉండండి!
కలలో మేకల్ని చూచి తృప్తిపడండి
ఇలలో మేకలిక లభించవు మీకు'
అని చెప్పి నందుడు వెడలిపోయె!
కర్తవ్యము తోచని పులి
చింతతోన కూలబడెను!

"ఎట్లావుంది. బాగున్నదా!"

"మీరు ఏమనుకున్నాసరే తాతగారూ! గేయం మాత్రం చాలా బాగా వ్రాశాడు,"

"అయితే కావచ్చు. బాగానే వ్రాసి ఉండొచ్చు. అతడు బాగా వ్రాస్తాడా లేక నేను బాగా వ్రాస్తానా అనే విషయాన్ని గురించి అంతిమ నిర్ణయం చేయటానికి నువ్వింకా రెండు సంవత్సరాలైనా ఆగాలి."

"అందులో ఎలా జరిగినా నా సింహము మాత్రం నన్ను తినటానికిరాదు" అని అంది పాపక్క.

"ఆ విషయం నేను చూచి గ్రహించాను. నీ సింహము ఏమిచేస్తుంది?"

"రాత్రులు నేను నిద్రపోతున్నప్పుడు అది బయట నుంచి కిటికీ తలుపులు గీరుతుంది. నేను లేచి తలుపులు తెరిచే సరికి అది నవ్వుతుంది."

"అంతే కావచ్చు. అది బాగా నవ్వేజాతి. అందులో ఏమాత్రం సందేహంలేదు. దానినే 'హ్యూమరస్' అంటారు. మాటమాటకు పళ్ళికిలిస్తూ ఉంటారు.

# 7

ఒకనాడు పాపక్క నా వద్దకు వచ్చి "తాతగారూ, 'అతడు' శనివారంనాడు వస్తాడనీ, మీరు ఆహ్వానించామనీ చెప్పారుగదా. ఏంజరిగింది?" అని అడిగింది.

"అన్నీ బాగానే జరిగాయి. హాజీమియా సలహా మాంసం నిప్పులమీద కాల్చారు. తినటంలో కానుక లొచ్చాయి"

"తరువాత?"

"తరువాత మూడొంతులు నేనే తినేశాను. మిగిలిన దంతా ఆ పేటలోనే ఉండే కాలూ కుర్రాడికి ఇచ్చేశాను. తింటూతింటూ కాలూ 'ఇది మా ఇంట్లో తయారు చేసే పచ్చి అరటికాయల గారెలకంటె కూడా రుచిగా ఉంది" అని అన్నాడు.

"అయితే మన 'అతడు' ఏమీ తిననేలేదా?"

"ఎట్లా తింటాడు?"

"అంటే 'అతడు' రాలేదా?"

"రావటానికి అంత ధైర్యం ఎక్కడిది?"

"అయితే, అతడు ఇప్పుడెక్కడున్నాడు?"

"ఎక్కడా లేడు."

"ఇంటిదగ్గరో?"

"లేడు."

"దేశంలోనే ఉన్నాడా?"

"లేడు."

"విదేశాలకు వెళ్ళాడా?"

"లేదు"

"అతడు అండమాను వెళ్ళడం దాదాపు నిర్ణయమైనట్లేనని ఒకప్పుడు మీరు చెప్పారుగదా! అండమాను వెళ్ళాడా ఏం?"

"అవసరం లేకపోయింది."

"అయితే మరేం జరిగిందో నాతో చెప్పవెందుకని?"

"నువ్వు భయపడతావని చెప్పటం లేదు. లేదా మనస్సు కష్టపెట్టుకొంటావు."

"ఏమి జరిగినాసరే మీరు చెప్పక తప్పదు"

"అయితే, విను." —

ఆ రోజున నేను క్లాసులో పాఠం చెప్పటానికని ముందుగా 'విదగ్ధ ముఖమండనం' చదివి వెళ్ళటం అవసరం. ఆ పుస్తకం అక్కడే పడివుంది. కానీ అకస్మాత్తుగా 'పంచూపకడాసీ మేనత్త అత్త' అనే పుస్తకం చేతికి అందింది. చదువుతూ చదువుతూ నిద్రపోయాను అప్పుడు రాత్రి రెండున్నర గంటలయింది. నేను స్వప్నం చూడసాగాను మరుగుతున్న నూనెలోపడి మన కిన్నీ బ్రాహ్మణ స్త్రీ ముఖమంతా పూర్తిగా శుభ్రపడింది. ఏడుపగళ్ళు, ఏడురాత్రులు ఆమె తారకేశ్వరస్వామి ఆలయంలో పూజలు చేసిన తరువాత ప్రసాదరూపంలో ఆమెకు లాహిడి కంపెనీవారి రెండు మూన్ లైట్ స్నోసీసాలు లభించాయి. వాని నామె తన ముఖానికి గట్టిగా రుద్దుకొంటూ ఉంది అది చూచి నేను 'దీనివల్ల ప్రయోజనం ఉండదు. గేదె దూడ దవడ చర్మాన్ని కోసి ముఖానికి అతికించుకో అప్పుడుగాని రంగులో రంగు కలవదు' అని ఆమెకు సలహా చెప్పాను. నా మాట విని వెంటనే నా వద్దనే మూడురూపాయలపావలా అప్పుతీసుకొని గేదెదూడను కొనటానికి ధరమతల్లా వెళ్ళింది. ఇంతలో గదిలో ఒకలాంటి శబ్దమేదో విన్పించింది. ఎవరో గాలితో చేసిన చెప్పులు

ధరించి వాటిని ఊద్చుకొంటూ గబగబా ఇల్లంతా తిరుగుతున్నట్లుగా ఉంది. కంగారు పడుతూ లేచికూర్చున్నాను. లాంతరు వత్తి హెచ్చించాను. గదిలోకిఎవరో ప్రవేశించారు. అందులో ఏమీ సందేహం లేదు. కానీ ఎవరువారు? ఎలా ఉన్నాడు ఏమిటో ఏమీ అర్థం కాలేదు. గుండె దడదడలాడింది అయినా ధైర్యంచేసి నేను బిగ్గరగా "ఎవరువారు! పోలీసున్ని పిలవమంటారా ఏం?" అని అన్నాను.

పగిలిన ఢోలులాంటి అద్భుత కంఠస్వరంతో అతడు "ఏంవృద్ధసోదరా, గుర్తించలేదా నన్ను? నేను మీ పాపక్క-గారి 'అతడి' ని. ఇవాళ నన్నిక్కడికి విందుకు పిలిచారుగదూ! మర్చిపోయారా?" అని అన్నాడు.

"వ్యర్థప్రసంగం చేయకు. నీ ముఖం అలావుందేమిటి?" అని అడిగాను.

"నా ముఖం పోయింది" అన్నాడు అతడు.

"పోయిందా, అంటే?"

"అంటే ఏమిటో చెప్తాను విను. పాపక్క ఇంటివద్ద ఆ రోజు విందు. అందుకని నేను త్వరగా స్నానంచేసి సిద్ధంకావాలనే ఉద్దేశ్యంతో ఒకటిన్నరగంటలకే తెలికలవాడ చెరువుకు వెళ్ళాను. రేవులో కూర్చొని ఇటుకరాతితో ముఖమంతా గట్టిగా రుద్దుకొంటున్నాను. హాయిగాఉన్నందువల్ల మరింత గట్టిగా రుద్దుకోసాగాను. దానితో కను న్నమూతపడి నీళ్ళలోకి జారిపడిపోయాను. తరువాత ఏంజరిగిందో ఏమీ తెలియదు. పైకి వచ్చేశానో, నీటిలోనే పడివున్నానో,

ఎక్కడ వున్నానో ఏమో అర్థం కాలేదు - కానీ, నేనిక లేననిమాత్రం స్పష్టంగా తెలిసింది ”

“లేవా?”

“అవును, లేను. మీశరీరం సాక్షిగా చెపుతున్నాను-”

“అరరే. నన్ను తాకనవసరంలేదు లే. ఏంజరిగిందో చెప్పు ”

“శరీరమంతా దురదపట్టింది. గోకుకుందామని చూచేసరికి గోళ్ళు లేవు, దురదా లేదు. చాలా దుఃఖం కలిగింది. కంటికి మంటికి ఏకధారగా ఏడ్వసాగాను. కానీ చిన్నతనం నుంచీ నయాపైసా లేకుండా పిలిస్తే పలికే ఏడ్పుకూడా రాలేదు. బిగ్గరగా శోకాలుపెట్టి ఏడ్చాను. కానీ ఏడ్పు ధ్వనే విన్పించలేదు. మర్రిచెట్టుకు తలబాదుకు చద్దామనే ఆలోచన వచ్చింది. తల సంగతి దేవుడెరుగు ఎంత వెతికినా పిలకకూడా కన్పించలేదు అన్నిటికంటె దుఃఖవిషయమేమంటే అప్పుడు రాత్రి పన్నెండు గంటలయింది, 'ఆకలి ఎక్కడికిపోయింది- ఆకలి ఎక్కడికి పోయింది' అని కేకలు పెడుతూ నేను చెరువు చుట్టూ తిరుగుతూ ఉండిపోయాను. కానీ ఆకలి తొత్తు జాడ తెలియనే లేదు.”

“నువ్వెలా ఉన్నావో చూస్తాను. ఒక క్షణం ఆగు.”

“అయ్యో, ఓ అన్నగారూ. నా మీద ఒట్టువేసి చెపుతున్నాను. నన్ను ఆగమనిమాత్రం అనవద్దు ఆగటంలో ఉండే దుఃఖం ఆగని మీ వంటి మనిషి కెలా తెలుస్తుంది? నేను ఆగను. ఆగనంటే ఆగను, ఆగనే ఆగను. శ్వాస ఆడునందాక ఆగనంటే ఆగను.”

ఈ మాటలు అంటూ అతడు దబదబ ఎగిరి గంతులు వేయసాగాడు. చివరికి కార్పెట్ మీద నీటిలోని మొసలివలె నాట్యం చేయ నారంభించాడు.

"అదేంపని?" అని అడిగాను నేను.

"సోదరా, ఒకమారు చక్రవర్తి ఆగినట్లుఆగిపోయాను. ఇప్పుడిక ఆగేదిలేదు, కొట్టు చంపు. ఇప్పుడదీ బాగానే ఉంటుంది. గట్టిగుద్దులతో నన్ను తగినంత కొట్టటం లేదని తెలిసినప్పుడు సాత్ కౌడీ పండితుడు చెప్పినదానిని తలచుకొని నా గుండె పగిలిపోయింది. కానీ గుండె అనేదే లేనప్పుడు పగిలిపోవటం ఎట్లా జరుగుతుంది? కవయీ చేపగనుక ఇలాంటి పరిస్థితిలో పడితే పాకశాస్త్ర పండితుని కాళ్ళమీదపడి 'అయ్యా, నన్ను వేడివేడి నూనెలో వేసి అటునిటు త్రిప్పి వేయించండి' అని వేడుకొని ఉండేది. ఆహా, ఇవాళ మాయమైన ఆ వీపుమీద పంతులుగారూ ఇటుకలతో తయారైన గట్టి ఉక్కు లడ్డులవంటి ఎన్ని గుద్దులు వేశారోగదా! ఇవాళ నా కెలా ఉన్నదంటే, అయ్యో, - సోదరా, ఒకసారి నువ్వే దబదబ గట్టిగా నాలుగు గుద్దులు తగిలించు."

ఈమాట అంటూ అతడు నా వైపు వీపుపెట్టాడు.

నేను భయపడి పోయాను. "వద్దు, వద్దు. ముందు నా ఎదుట నుంచి తప్పుకో" అని అన్నాను.

మళ్ళీ అతడు చెప్పనారంభించాడు.

"విషయాలన్నీ సాంతం చెప్పనివ్వు. ఎక్కడైనా కాళీ దేహం దొరుకుతుందేమోనని గ్రామాలలో తిరగసాగాను. మూడుజాముల ప్రొద్దెక్కింది. ఎంత ఎండలో తిరుగుతున్నా

దేహం ఏమీ కాలనందుకు చాలా దుఃఖం కలిగింది. దుర్భర మనిపించింది ఇంతలో ఎదురుగా చెప్పుల చెరువు మర్రిచెట్టు క్రింద మా పుత్తన శాబాయి గంజాయి దమ్ములాగి శివ నేత్రుడై పడివుండటం చూచాను. అతని ప్రాణపురుషుడు బిందురూపం దాల్చి బ్రహ్మరంధ్రపు అంచున మిణుగురు వలె మిణుకు మిణుకు మంటున్నట్లు కన్పించింది. మంచి అవకాశమే చిక్కిందని గ్రహించాను. నాసికా రంధ్రంలో నుంచి నా ఆత్మారాముడిని అతని దేహములోనికి నెట్టాను. కొత్త చెప్పులలో కాలు పెట్టినంత సునాయాసంగా నేనాపని చేశాను.

పుత్తన శాబాయి గొణుక్కుంటూ ఎక్కడో నూతిలో మాట్లాడుతున్నట్లు "ఎవరునాయనా నువ్వు? లోపల చోటు లేదు" అని అన్నాడు.

అప్పుడు అతని కంఠం నా అధీనంలోకి వచ్చింది. "నీకే చోటు లేదు, నాకు చోటుంది. ముందు నువ్వు బయటకు వెళ్ళు" అని అన్నాను నేను.

అతడు మూల్గుతూ "చాలావరకు బయటకు వెళ్ళి పోయాను ఇంకా కొద్దిగా వెళ్ళాలి. గట్టిగా నెట్టు" అని అన్నాడు.

నేను గట్టిగా త్రోసేశాను. తుస్‌మంటూ అతడు బయటకు పారిపోయాడు.

ఇంతలో అక్కడికి పుత్తనశాబాయి భార్యవచ్చి తన భర్త నుద్దేశించి నోటికి వచ్చినట్లు తిట్టసాగింది.

ఆ తిట్లు విని నా కాళ్ళు చేతులు చల్లబడ్డాయి. "ఏదీ ఆ తిట్లు మరొకసారితిట్టు, ఎంతతియ్యగా వున్నాయి, నీ తిట్లు!

అలాంటి తిట్లు మళ్ళీ ఈ జన్మలో వింటానని అనుకోలేదు" అని అన్నాను ఆ సంతోషంలో.

నేను ఎగతాళి చేస్తున్నానని ఆలోచించి ముసలిది చీపురుకోసం ఇంటికి వెళ్ళింది దానిలో దొరికిన దేహం మళ్ళీ ఎక్కడ పోతుందోనని నాకు భయం వేసింది అక్కడి నుంచి పరాపరి ఇంటికివచ్చి అద్దంలో ముఖం చూచుకొని అదిరిపోయాను చిత్రిక పుల్లలతో ముఖమంతా చెక్కుకోవాలని బుద్ధిపుట్టింది. దేహం పోయినందుకు దేహం దొరికింది. కానీ పోయిన ముఖం మాత్రం ఏకునిలువులలోతున నీళ్ళలో మునిగిపోయింది. దానిని మళ్ళీ సంపాదించే మార్గంఏమిటి?

ఇంతలో దీర్ఘకాలంగా నన్ను వదలివేసిన ఆకలి అకస్మాత్తుగా నాలో తలెత్తింది. ఒక్కపెట్టున జఠరాగ్ని భగభగ ప్రజ్వరిల్లింది. ఆకలిమంటతో కళ్ళముందు చీకట్లు కమ్మాయి. 'ఏదిదొరికితే అదే తింటాను' అనే లెక్కలో పడిపోయాను. అబ్బా. ఎంత ఆనందం కలిగిందో ఏమని చెప్పను!

ఇవాళ పాపక్క నన్ను మీ ఇంటికి విందుకు ఆహ్వానించిన సంగతి అకస్మాత్తుగా గుర్తొచ్చింది చూస్తే రైలు చార్జీకి కూడా నా దగ్గర డబ్బులేదు. కాలినడక సాగించాను. నడక అనే అసాధారణ శ్రమవల్ల ఎలాంటి ఆనందం కలిగిందో ఏమని చెప్పను సోదరా! శరీరమంతా చెమటతోతడిసి మంచి ఉత్సాహం పుట్టుకొచ్చింది. ఒకొక్క అడుగే వేస్తుంటే 'ఆగవద్దు, ఆగవద్దు, సాగిపో, సాగిపో, అడుగుఅడుగు సాగిపో, సాగిపో' అన్నట్లనిపించింది. అంతనడక నా జీవితంలో ఎప్పుడూ నడవలేదు. సోదరా, నువ్వు నీ పాతదేహంతో

విశ్రాంతిగా మడతకుర్చీలో కూర్చున్నావు. కష్టంలో ఉండే ఆనందం ఏమిటో నీకు అర్థం కాదు. ఇలాంటి కష్టాలలో నిలబడగలిగి నప్పుడే 'అవును. మనమూ జీవించి ఉన్నాము. దృఢంగా ఉన్నాము. పదహారణాలా ముందడుగు వేశాం' అని అనుకోగలుగుతాము."

"అతని కథ విని "అంతా అర్థమయింది ఇప్పుడు నువ్వేం చేయాలను కొంటున్నావు?" అని అన్నాను.

"చేయవలసిన బాధ్యత నీ మీదనే ఉంది. విందుకు పిలిచావు. మర్చిపోయానం టేకుదరదు. విందు చేయాల్సిందే."

"ఇప్పుడు రాత్రి మూడుగంటలయింది. ఆ విషయం కూడా మర్చిపోవద్దు."

"అయితే, నేను పొరుగు ఇంటికి వెళతాను."

"జాగ్రత్త!"

"సోదరా, బెదిరించటం అనవసరం 'చావు' అనేకంటె మించిన తిట్టు ఏముంది? నేను వెళుతున్నాను."

"వెళ్ళటానికి వీల్లేదు."

"వెళ్ళి తీరతాను."

"ఎలా వెళతావో చూస్తాను."

"వెళతాను, వెళతాను, ముమ్మాటికీ వెళతాను."

తరువాత అతడు నా బల్లమీదికి ఎక్కి డాన్సు చేస్తూ "నేను వెళతాను, వెళతాను, వెళతాను. నేను వెళతాను' వెళతాను" అంటూ పాట ప్రారంభించాడు.

చివరికి పంచమ స్థాయిలో "వెళతాను, వెళతాను, వెళతాను, వెళతాను" అంటూ పాడసాగాడు.

నాలో ఓర్పు నశించింది కోపంతో లేచి గట్టిగా అతని పిలకను అదిమిపట్టుకున్నాను. ఆలాగులాటలో వదులుగాఉన్న మేజోడు మాదిరిగా అతని దేహంమీది చర్మపు తొడుగు నా చేతిలోకి వూడివచ్చింది సర్రున దేహం దూరంగా వెళ్ళి దభీ మని నేలమీద పడిపోయింది. చాలా అన్యాయం జరిగింది! ఇప్పుడిక కర్తవ్యం ఏమిటి? గంజాయి త్రాగిన ఆ మనిషి ఆత్మకు ఈ వార్త తెలిపేదెలా! నేను గొంతెత్తి బిగ్గరగా, "ఒహోయ్, విను, విను. త్వరగా ఈ దేహంలో ప్రవేశించు తొడుగుతోసహా ఈ దేహాన్ని తీసుకువెళ్ళు" అని కేకలు పెట్టాను. కళ్ళుమరింత పెద్దవిచేసి చుట్టూ చూశాను. ఎక్కడా ఎవ్వరూ కన్పించలేదు ఏ దినపత్రికలోనైనా ప్రకటనచేస్తే పనిజరుగుతుందేమోనని ఇప్పుడు ఆలోచిస్తున్నాను.

పాపక్క ఆశ్చర్యంగా గుచ్చి చూస్తూ "ఇదంతా నిజ మేనా తాతగారూ!" అని అడిగింది.

"నిజంకంటె చాలా గొప్పది. కథ" అని జవాబు చెప్పాను.

# 8

నేనప్పుడు యం. ఏ క్లాసుకు 'ఏరియోపెజిటికా' కు నోట్సు వ్రాస్తున్నాను. సరిచూచుకొనుటకు 'ఇంటర్ నేషనల్' మెరిష్రియస్ ఎబ్రాకెడెబ్రా' శ్రద్ధగా చదవవలసి వచ్చేది. పేజీలు తెరిచి 'త్రీ హండ్రెడ్ ఇయర్స్ ఆఫ్ ఇంహో-ఇండి టర్మినేషన్' అనుబంధాన్ని చూస్తున్నాను. 'ఆనోహుటో

పిరుూ ఆఫ్ టింటిన్నె బ్యులేషన్'అనే గ్రంథంకోరకు వనమాలిని లైబ్రరీకి పంపాను.

ఇంతలో 'అతడు' త్వరగా గదిలోకి వచ్చాడు

"మళ్ళీ ఏంజరిగింది? కోడలు ఉరివేసుకుందాయేం?" అని అడిగాను నేను.

ఆమె గనుక ఉంటే నిజంగానే ఉరివేసుకునేది కానీ, మీరు నాకెందుకు ఇన్నిచిక్కులు కల్పిస్తున్నారో చెప్ప గలరా?" అని అన్నాడు అతడు

"ఏం, ఇప్పుడేం జరిగింది?"

"నన్ను పట్టుకొని నువ్వు కొండంత శుద్ధ అబద్ధాల గుట్టను పేర్చావు. అందులో నా పేరెక్కడా ఉదహరించ నందుకు చాలా సంతోషించాను. లేనిచో పెద్దమనుష్యుల మధ్య తలెత్తుకు తిరిగే ఆస్కారమే ఉండేది కాదు పాపక్కకు ఆనందం కలుగుతుందనే ఉద్దేశ్యంతో నేనింతకాలం సహిస్తూ వచ్చాను. కానీ, ఇప్పుడు అంతా అందుకు వ్యతిరేకం జరు గుతూ ఉంది."

"ఏంజరిగిందో ఏమిటో చెప్పరాదూ?"

"చెప్పేదేముంది. నిన్న పాపక్క సినిమా చూడటా నికి బయులుదేరింది. ఆమె కారులోకి ఎక్కబోతూ ఉండగా వెనుకనుంచి నేను వెళ్ళాను. 'నన్నుకూడా నీ కారులో తీసుకు వెళ్ళు' అని అడిగాను నేను. అంతే, తరువాత ఏమయిందో తెలుసా? సోదరా, నా మాట వినగానే హిస్టీరియా వచ్చిం దనుకో."

"ఎట్లా?"

"పాపక్క రెండు చేతుల్లోనూ ముఖం దాచుకొని "వెళ్ళు, ఇక్కడినుంచి వెళ్ళిపో. గంజాయి తాగినవాడి దేహాన్ని దొంగిలించిన నువ్వు నా కారులో ఎక్కటానికి వీల్లేదు' అని బిగ్గరగా అరిచింది. చుట్టూ జనం మూగారు నన్ను పోలీసులకు అప్పగించినంత పని జరిగింది. జీవితంలో ఇంతకుముందు నన్ను గురించి అనేక దూషణలు విన్నాను. కానీ, ఇవాళలాంటి మౌలికమైన దూషణ నేనింతకు ముందెన్నడూ వినలేదు. గంజాయి తాగిన వాడి దేహాన్ని దొంగిలించటమా! మహా మహా ప్రాణమిత్రుడు కూడా నన్నీ విధంగా నిందించలేదు. ఇంటికి వచ్చిన తరువాతపరిస్థితినంతా తెలుసుకున్నాను ఇదంతా నీ పనే అని అప్పుడు అర్థమయింది."

"అవును. నా పనే. కానీ నన్ను మాత్రం ఏం చావమంటావో చెప్పు. నిన్ను గురించి ఎన్నికథలని అల్లగలను. వయస్సు మళ్ళింది. వాతరోగంవల్ల కలానికి నడిచే శక్తి లేకుండా పోయింది. పాపక్క ఆదేశాన్ననుసరించి అసంభవమగు కథలు కల్పించేపాటి నడకకూడా కలంలోతగ్గిపోయింది. అందుకని, ఈ చివరి కథలో నిన్ను నేను చంపివేయాల్సి వచ్చింది."

"వృద్ధసోదరా, నేనుచనిపోవటానికి అంగీకరించను నా మీద ఒట్టువేసి చెప్తున్నాను. పాపక్క భయాన్ని పూర్తిగా తొలగించు. అదంతా కల్పితకథతప్ప మరేమీకాదని ఆమెకు నచ్చచెప్పు."

"నేనలాగే చెప్పాను. కానీ తొలగించాలంటే తొలి గేది కాదనే భయంగా ఉంది. నరనరాన బాగా జీర్ణించుకు పోయింది. మరోఉపాయం ఏదీ కన్పించక చివరికి గంజాయి దమ్ము పుత్తన్‌ను పిలిచి పాపక్క ఎదుట నిలబెట్టాను. కానీ, అనుకొన్న దానికి విరుద్ధంగా జరిగింది. పుత్తన్ దేహాన్ని ధరించి వచ్చినది నువ్వేననీ, పుత్తన్ ఇక లేడనీ నిర్ధారణ జరిగింది."

"అలాఅయితే, సోదరా, కథను తలక్రిందులుచెయ్యి. ధనుష్టంకారముతో పుత్తన్‌ను నేలగూల్చు. గంజాయిదమ్ము దేహాన్ని నీమతల్లాలో తగలబెట్టి బూడిదచెయ్యి. నేను చాలా వైభవంగా అతని శ్రాద్ధకర్మలు జరిపిస్తాను. పాపక్కనుకూడా విందుకు ఆహ్వానిస్తాను ఎంత ఖర్చయినాసరే అంతా నేనే భరించుకుంటాను. నేను పాపక్క కథలలో బహురూపధారిని గదా! అకస్మాత్తుగా నన్ను ఆ ఉన్నత పదవినుంచి క్రిందికి త్రోసివేస్తే క్షణం బ్రతుకగలనా?"

"సరే, కథను వెనుకకు మళ్ళించే రథయాత్రకు నిన్ను మళ్ళీ పిలుస్తాను."

* * *

రెండోరోజు సాయంత్రమయేసరికి మా 'అతను' నా వద్దకు వచ్చాడు. నేను కథ ప్రారంభించాను: —

"గంజాయి దమ్ము పుత్తన్ భార్య నీ మీద భర్త హక్కుని పొందటానికి కోర్టులో దావా తెచ్చింది."

ఈ మాట వినగానే మా అతడు నాకు అడ్డొస్తూ "సోదరా, దీనివల్ల కూడా ఉపయోగమేమీ ఉండదు. గంజాయి దమ్ము పుత్తన్ భార్యను నువ్వెప్పుడూ చూడనైనా లేదు. దావాలో ఆ స్త్రీ గనుక గెలిస్తే ప్రతివాది నల్లమందు తిని ప్రాణాలర్పిస్తాడు" అని అన్నాడు.

"నీకు అలాంటి భయమేమీ వద్దు. విజయం లభించినా అపజయం లభించినా నేను నిన్ను సజీవంగా ఉంచుతాను."

"సరే చెప్పు చూద్దాం!"

అప్పుడు నువ్వు కోర్టులో లేచి నమస్కరించి "అయ్యా, ధర్మప్రభూ. నేను ఈ జన్మలోనే గాక గత ఏడు జన్మలలో ఎప్పుడూ ఈమె భర్తను కాదు" అని విన్నవించావు.

ఆమె పక్షపు వకీలు కళ్ళెర్రచేస్తూ "భర్తను కాదు అంటే?" అని ప్రశ్నించాడు.

అందుకు నీ జవాబు- "అంటే నేనెప్పుడూ ఈమెను వివాహమాడి ఉండలేదు. ఇంతకంటె మరొక అర్థమేదీ ప్రస్తుతం ఎంత ఆలోచించినా నాకేదీ కన్పించటంలేదు."

రామసదయముఖ్తారు గట్టిగా కసురుకుంటూ "ముమ్మాటికీ నువ్వే ఆమె భర్తవు. అబద్ధం చెప్పకు" అని అన్నాడు.

అప్పుడు నువ్వు జడ్జివైపు తిరిగి సవినయంగా విన్నవించుకున్న దేమంటే- "అయ్యా, జీవితంలో నేను అనేక అబద్ధాలు మాట్లాడివుండవచ్చును కానీ, ఆ ముసలిదానిని నేను ఇష్టపూర్వకంగా వివాహమాడాననే ఘోరమైన అబద్ధాన్ని కల్పించి

చెప్పగల శక్తి నాకులేదు ఆ విషయం వూహిస్తేనే గుండెల్లో దడ పుడుతుంది."

అప్పుడువాళ్ళు ముప్పదినలుబదిమంది గంజాయిదమ్ము మనుష్యుల్ని సాక్షులుగా తెచ్చి నిలబెట్టారు. వాళ్ళందరూ వరుసగా గంజాయి నలిపే తమ బ్రొటన వ్రేళ్ళను నీ ముఖం మీద ఆడిస్తూ "ముఖం మాత్రం పుత్తన్ ముఖంమాదిరి గానేఉంది ఎడమ కణతమీద అతనికి వున్నటువంటి మచ్చ లాంటిదికూడా వుంది నీకా-" అని అన్నారు.

అప్పుడు ఆమె వకీలు లేచి "కానీ ఏమిటి. సందేహ మెందుకు, చెప్పండి" అని అన్నాడు.

ఆ సాక్షులు చెప్పినదిది:"ఇతడుపుత్తన్‌వలెనేఉన్నాడు. అంతమాత్రాన ఇతడు ఆ పుత్తనేనని ప్రమాణం చేసి ఎలా చెప్పగలం! ఇక ఈమెను గురించి అందరికీ తెలుసు పుత్తన్ వీపుమీద ఇప్పటికి ఎన్ని చీపురుకట్టలు విరిగి ఉంటాయో వేరుగా చెప్పనవసరం లేదు. ఆ చీపురు కట్టలకు ఖర్చుచేసేది మిగిలితే పుత్తన్ గంజాయి తగ్గించుకోవలసిన అవసరం కలిగేదికాదు అగదుకని, మేము ప్రమాణంచేసి ఒక పెద్దమనిషి జీవితాన్ని నాశనం చేయమని ఎలా చెప్పగలం!"

వకీలు కోపంగా వాళ్ళవైపు చూస్తూ "ఇతడు పుత్తన్ కానట్లయితే ఇతడెవరో చెప్పండి మరొక పుత్తన్‌ను ఇలాగే సృష్టించగల శక్తి ఆ బ్రహ్మదేవునికి కూడా లేదు" అని అన్నాడు.

వారిలో ఒక గంజాయిదమ్ము పెద్ద ముందుకు వచ్చి ఇలా విన్నవించుకున్నాడు. "నాయనా, మీరు చెప్పినది

నిజమే. ఇలాంటిది ఎప్పుడైనా ఒకసారి జరుగుతుంది. ఇలాంటి పని చేయవద్దని భగవంతుడే స్వయంగా ప్రతిపాదించుకున్నాడు భగవంతుని సృష్టికి ప్రతిసృష్టిచేసి అతని నోరుమూయించా లని ఇది ఏ సైతానో చేసిన పని అని స్పష్టంగా కన్పిస్తూనే ఉంది. ఎవరైతేనేం గొప్పనిపుణుడు చేసిన పని. అతనినేర్పును మెచ్చుకోవాలి. దీనినే పకడ్బందీగా చేసిన కుట్ర అని కూడా చెప్పవచ్చును. పుత్తన్ దేహం కృశించి కృశించి ముక్కువరకు బాగా ఎండిపోయింది అర్ధచంద్రాకారంగల ఆ ముక్కును కూడా సరిగ్గా అదేవిధంగా అతికించారు సుమా! ఇతని చేతుల చర్మాన్ని పుత్తన్ మాదిరి తయారుచేయటానికి అనేక గబ్బిలపు రెక్కల్ని ఖర్చుపెట్టి ఉంటారు."

దావా నెగ్గదని గ్రహించుకో గలిగావు నువ్వు. జడ్జీగారికి నమస్కరించి "అయ్యా, వారంరోజులు గడువిప్పిస్తే పుత్తన్‌ను తీసుకువచ్చి తమ ఎదుట హాజరు పరుస్తాను" అని విన్నవించుకున్నావు

వెంటనే తెలికలవాడ చెరువువైపు పరుగెత్తావు. నీ అదృష్టం బాగుంది అక్కడికి వచ్చేసరికి నీ దేహం నీళ్ళలో పైన తేలుతూ కన్పించింది. పుత్తన్ దేహాన్ని గబగబ గట్టున వదలి వెంటనే వెళ్ళి నువ్వు నీ దేహంలో జొరబడ్డావు. ఒకసారి దీర్ఘంగా నిట్టూర్చి ఆకాశంవైపు చూస్తూ "అరే, ఓ పుత్తన్!" అని పిలిచావు. ఆ సమయానే పుత్తన్ శరీరంలేచి నిలబడింది. అతను నీ వైపు తిరిగి "మిత్రమా, నేను నీ వెంటే ఉన్నాను. మనస్సు మాత్రం గంజాయి మత్తుతో కొద్దిగా జోగుతూ ఉంది. అంతే. అప్పుడప్పుడూ ఆత్మహత్య చేసుకో

వాలనే కోర్కె కలుగుతూ ఉంటుంది. కానీ అందుకు కూడా శరీరం కావాలని తట్టింది. దానినికాస్తా నువ్వు ఆక్రమించు కొని కూర్చున్నావు. జీవించి ఉన్న రోజుల్లో నూటికి నూరు పాళ్ళు జీవించిఉండాలనేకోర్కె ఉండేది- కానీ చనిపోయానో లేదో ఇక మరేవిధంగానూ ఏకాలంలోనూ చనిపోలేననే దుఃఖం చాలా బాధపెట్టింది. ఒక చిన్నత్రాడుతో వురిపోసు కోగల యోగ్యతకూడా నాలో లేకుండా పోయింది" అని చెప్పాడు.

"సరే, ఏదో జరిగిపోయిందిగదా! కోర్టుకు వెళదాం పద. జడ్జీగారితో చెప్పి నీ గంజాయికి పింఛను ఇప్పించే ఏర్పాటు చేయిస్తాను."

ఇద్దరూ కలిసి కోర్టుకు వెళ్ళారు. జడ్జీగారు కోపగించు కున్నట్లు "ఈ ముసలిది నీ భార్యేనా?" అని అడిగారు.

"నిజంచెప్పటానికి నోరు రావటం లేదు. ఉన్నత కుటుం బంలో జన్మించాను అబద్ధం చెప్పి పాపం తెచ్చుకోను. అదీగాక అటు ఒకవేళ ఈమెను వదిలించుకోటానికి పాపం చేస్తే, ఆ పాపంతోపాటు ఈమెకూడా నన్ను వెన్నంటే ఉంటుంది. అంటే అలా చెప్పినప్పటికీ ఈమె నన్నెలాగూ వదలదు. అందుకని నేను మొదట వివాహం చేసుకున్నది ఈ స్త్రీయేనని మర్యాదగా అంగీకరిస్తున్నాను" అని విన్నవిం చాడు పుత్తన్.

"మొదటి స్త్రీ అంటున్నావు. ఇంకెవరైనా ఉన్నారా ఏం?" అని అడిగారు జడ్జిగారు.

"మాది ఉన్నతమగు నైష్కమ్యకులం. వంశమర్యాద నిలవటానికి వేరెవరూ లేకుండా ఎలా కుదురుతుంది" అని అన్నాడు ఫ్రత్తన్.

*　　*　　*

ఆదివారంనాడు పాపక్క ఈ కథను చదివింది. వెంటనే నా వద్దకు వచ్చి ఇలా అంది — "తాతగారూ, ఇంగ్లీషు పుస్తకాల దొంతర్లు పేర్చి మీరు ఏదో కాలేజీకోసం పుస్తకం వ్రాస్తున్నట్లు వ్రాశారుగదా, మీకు ఈ కాలేజీ ఎక్కడి నుంచి వచ్చింది? ఇంతకుముందు అది ఎక్కడా కన్పించలేదు. అలాంటి ఇంగ్లీషు పుస్తకాలు మీరు చదవటం కూడా నే నెప్పుడూ చూడలేదు. నాకు తెలిసినంతవరకు మీరు కవిత్వం మాత్రమే వ్రాయగలరు"

నేను స్పష్టంగా ఏమీ జవాబు చెప్పకుండా నవ్వాను.

అప్పుడు పాపక్క మళ్ళీ నా వైపు చూస్తూ "తాత గారూ, మీకు సంస్కృతం తెలుసునా?" అని అడిగింది.

"చూడు, పాపక్కా! ఇలాంటి ప్రశ్నలు అడగటం ఆచారమే. వ్యతిరేక ప్రశ్నలు మాత్రం అడగకూడదు" అని జవాబు చెప్పాను.

# 9

ఒకనాడు తెల్లవారగానే పాపక్క నా వద్దకువచ్చి "ఏం, తాతగారూ, మన 'అతడి'ని గురించి మీ కథలన్నీ అయిపోయాయా?" అని చాలా ఆదుర్దాగా అడిగింది.

తాతగారు చేతిలోని దినపత్రికను ప్రక్కనే పెట్టి కళ్ళ జోడును నుదురుమీదికెక్కించి "కథలు ఎప్పుడూ ముగియవు. కథ చెప్పేవారి కాలం ముగుస్తూ ఉంటుంది" అని జవాబు చెప్పారు

"అయితే, అతనికి మళ్ళీ తనదేహం లభించింది. తరువాత ఏం జరిగిందో చెప్పండి."

"జరిగేదేముంది. మళ్ళీ అతడా దేహంతో కటకట లాడుతూ చావవలసిందే. ఎక్కడికైనా షికారుకు వెళ్ళాలనే కోర్కె కలిగినప్పుడు ఒంటరిగా వెళ్ళలేడు. దేహాన్నికూడా మోసుకు పోవలసిందే. ఏదైనా రుచిగల పదార్థం మీదికి మనస్సు పోయినప్పుడు ప్రయత్నం చేసేది అతడు, మధ్యలో ఆనందాన్ని అనుభవించేది దేహంలోని నాలుక. బాగా కడుపునిండా తిని దేహం విశ్రాంతి తీసుకొంటుంది. ప్రజలతో రకరకాల సూటీపోటీ మాటలు భరించేది అతడు. 'పనీలేదు పాటాలేదు. పూటకు రెండు శేర్ల బియ్యం కావాలి' అని నిందించేది అతడిని. ఒక్కొక్కప్పుడు కట్ట గుడ్డ లేకపోయినా అప్పు అడిగి తాంబూలం వేసుకోవాలనే కోర్కెతో దేహం అతనిని ఈడ్చుకు పోతుంది 'మింగ మెతుకు లేకపోయినా మీసాలకు సంపెంగనూనె అన్నట్లు కట్టుకోటానికి గుడ్డముక్క లేదు. తాంబూలానికి బయలుదేరాడు' అని అవమానించబడేది అతడు. ఈ దేహంవల్ల అనేక చిక్కులువస్తాయి. జబ్బుపడేది దేహం, నానాబాధలు అనుభవించేది 'అతడు'. ఒక్కొక్కసారి దేహం బరువెక్కుతుంది. మరొకప్పుడు బాధ పెడుతుంది. ఒకప్పుడు కృశించి పుల్లయితే మరొకప్పుడు బాగా

ఉబ్బిలా వెక్కి వచ్చు. ఒకప్పుడు దేహం వెచ్చగా ఉంటే మరొకప్పుడు చల్లగా ఉంటుంది. ఒకప్పుడు భయంతో దేహం కంపిస్తుంది. మరొకప్పుడు మట్టిగరుస్తుంది ఒక్కొక్కరిమాట విన్నప్పుడు ఒళ్ళు మండుతుంది కొందరిని కలుసుకొని సంతోషంగా వారితో కలిసిపోతుంది. ఈ ఒక్క దేహంవల్ల ఎన్ని చిక్కులు ఉన్నాయో లెక్కించి చెప్పలేము"

"తాతగారూ, 'అతడు' ఫుత్తన్ దేహంలో జొరబడి తిరిగినప్పుడు ఈ చిక్కులన్నీ ఎవరు భరించారు? దేహం బరువెక్కితే ఆ బాధ ఎవరికి కలిగేది?" అని అడిగింది పాపక్క.

"ఇది చెప్పటం చాలా కష్టమే. నేను చెప్పలేను. 'అతడు' వచ్చినప్పుడు అడుగు. ఈ ప్రశ్నవిని అతడి తల తిరుగుతుంది."

"అన్ని చిక్కులొస్తాయా తాతయ్యా? నిజంగా నాకింత వరకు ఒక దేహంవల్ల ఇన్ని చిక్కులు ఉంటాయని తెలియనే తెలియదు. ఇది నేనెప్పుడూ ఆలోచించనూ లేదు."

"ఈ చిక్కుల్ని అటూఇటూ కలుపుతూ తగ్గిస్తూ ఉన్నందువల్లనే ఇన్ని కథలు నడుస్తున్నాయి. ఈ ప్రపంచంలో. దేహంమీద చుట్టూ చేరి కథలు పరుగులు తీస్తున్నాయి కథకు ఒక్కొక్క దేహం గార్దభవాహనమైతే, మరొక దేహం ఏనుగు అంబారీ అవుతుంది."

"మీ దేహం ఏమిటి తాతయ్యా?"

"చెప్పను మనల్ని గురించి మనం గొప్పలు చెప్పుకునే అహంకారం పనికిరాదని శాస్త్రాలు చెపుతున్నాయి."

తాతయ్యా, అతడి కథను మీరెందుకు ఆపేశారు?"

"మరి చెపుతాను విను. సోమరితనపు స్వర్గం అన్ని స్వర్గాలకు పైన ఉంటుంది. అక్కడ తన వేనకువేల నేత్రాలకు తన్మయుడై సగంసగంమూసి అమృతాన్ని సేవిస్తున్న ఇంద్రుడు ఉన్నాడు ఈ కథలన్నింటికీ దేవత అతడే. నేను వారి భక్తుడనే. కానీ ప్రస్తుతం నేను వారి సభలోనికి ప్రవేశించలేకపోతున్నాను అక్కడ నాకు లభించే కథాప్రసాదం చాలా కాలంనుంచి లభించటం లేదు."

"ఎందుకని?"

"నేను అక్కడికి వెళ్ళేమార్గం మర్చిపోయాను."

"ఎట్లా?"

* * *

"అమరావతిలో గంగానది ఒడ్డున ఇంద్రలోకం ఉంది. దాని దిగువభాగాన మరొక స్వర్గం ఉంది. మిల్లులోనుంచి వెలువడే నల్లని పొగతో అక్కడి ఆకాశమంతా నిండి ఉంటుంది. అది శ్రమజీవుల స్వర్గం. అక్కడ నిక్కర్లు ధరించిన దేవతలే సృష్టికర్తలు. ఒకానొక శరత్కాలపు ఉదయాన నేను పూజా పుష్పములు తీసుకొని ఆ మార్గానే వెళుతున్నాను. ఇంతలో వెనుకనుంచి సైకిలుమీద ఎక్కిన ఒక పంజా వచ్చి నా మీద పడ్డాడు. అతని సంచిలో చిత్తా అవర్జాల పెద్దకట్ట ఉంది. పై జేబులో ఎర్రసిరాకలం ఒకటి నల్లసిరాకలం ఒకటి

వున్నాయి. అతడు ధరించిన షైనాకోటు క్రింది జేబులు రెండూ దినపత్రికలలో కత్తిరించిన ముక్కలతో నిండుగా ఉన్నాయి. కుడిచేతి గడియారం స్టాండర్డు టైము చూపిస్తూ ఉంది. ఎడమ చేతికి ఉన్న గడియారం కలకత్తా టైము చూపు తుంది. సంచిలో ఇ. బి ఆర్., ఎ. బి. ఆర్., ఎన్. డబ్ల్యు ఆర్., బి. ఎన్. ఆర్., ఎస్. ఐ. ఆర్., టైము టేబుల్సన్నీ ఉన్నాయి. పై జేబులో రెండుకలములతోపాటు ఒక డైరీ, మరొక నోటు పుస్తకం కూడా ఉన్నాయి. అతడు మీదపడిన విసురుకు నేను బొక్క-బోర్లా పడాల్సింది. నిలదొక్కుకున్నాను లేకపోతే ముఖం అంతా చెక్కులూడిపోయేది. ఆ పండా నన్ను గుసరుసలాడుతూ చూచి 'పైన ఆకాశంలోకి చూస్తూ పోతావేం?' అని అన్నాడు.

"అయ్యా, పండాగారూ, ఆగ్రహించకండి. నేను పూజ చేసుకోటానికి దేవాలయానికి వెళుతున్నాను- కానీ, ఎంత వెతికినా దారి తెలియటం లేదు-" అని అన్నాను నేను.

అందుకతడు నన్ను తేరిపారచూచి "మేఘాల్లోకి చూస్తూ మార్గాలు వెతికేవారి ముఠాకు చెందినట్లున్నావు నువ్వు. నా వెంటరా, దారి చూపిస్తాను" అని అన్నాడు.

నన్ను ఈడ్చుకొని విశ్వకర్మ దేవాలయానికి తీసుకు వెళ్ళి వదలాడు. అవును కాదు అని చెప్పే అవకాశాన్నివ్వనే లేదు. నేను నోరు తెరిచి మాట్లాడకముందే అతడు "ఆ పూజా పుష్పాలను అటుఉంచు- ముందు జేబులోనుంచి రూపాయి పావలా దక్షిణ బయటకు తియ్యి" అని అన్నాడు.

తెలివి తక్కువగా నేను దక్షిణ చెల్లించాను. పూజ కూడా చేశాను. అప్పటికప్పుడే అతడు తన నోటు పుస్త కంలో లెక్క వ్రాసుకున్నాడు. తరువాత తనచేతి గడియారం లోకి చూసుకొని "పనిపూర్తయింది. నువ్వింక ఇక్కడనుంచి వెళ్ళు. ఇంతకంటె ఎక్కువ అవకాశం లేదు" అని అన్నాడు.

ఆ మర్నాటి నుంచే ఫలితం కలుగుతున్నట్లు కన్పిం చింది పూర్తిగా తెల్లవారలేదు. ఇంకా కనుచీకటిగా ఉంది. నాలుగున్నర అయిదుగంటల సమయం కావచ్చు. అకస్మా త్తుగా నేను గడబడుతూ లేచికూర్చున్నాను ఇంటిని దొంగలు ముట్టడించారేమో ననిపించింది. అనాథ సహాయక సమితి సభ్యులు పన్నెండు పదమూడు సంవత్సరాల బాలురతో ఒక గాయకమండలిని ఏర్పాటు చేశారు. ఆ మండలి సభ్యులు మా ద్వారం ముందు చేరి తెల్లవారక ముందే పాటలు ప్రారంభించారు:-

ఋణము తీర్చుము! ఋణము తీర్చుము!
ఋణము తీర్చుము! ఋణము తీర్చుమురా!
ఋణము తీర్చక వళ్ళుమరచి
నిద్దురేలరా! వేవేగ లేచిరమ్మురా!
పట్టెడన్నము లేక దేశము
అల్లాడిపోవు చుండెరా!
కళ్ళు తెరిచి నిజము తెలిసి
లేచి వేగమె రమ్మురా!
పొట్టబట్టిన దానికంటె
నాల్గురెట్లధికంబేల తింటావురా!

వంద రెట్లల కూడ బెడతావురా!
దేశసంపదనంత దోచి
ఇనుపపెట్టెల నేల దాచావురా!
కుడువ కూడు లేక
దీన జనులము మేము
వెతలబడుచున్నామురా!
దేశము మేల్కొన్నది
నువ్వింకా నిద్రపోతున్నావు
ప్రాతఃకాల సమయము
కళ్ళు తెరచి చూడరా!
ఋణము తీర్చవలయురా
పెనునిద్దుర వదలుమురా!
ఋణము తీర్చుము! ఋణము తీర్చుము!
ఋణము తీర్చుము! ఋణము తీర్చుమురా!

"తీర్చరా, తీర్చరా" అంటూ ఆకాశం బ్రద్దలయ్యేట్టు డోలక్ మీద దెబ్బలుపడుతున్నాయి. ఇంతలో ఆకాశం బ్రద్దలై నిజంగానే వెలుగు వచ్చింది. నేను మనస్సులో రొక్కములో ఎంత మిగలాలి అని లెక్కవేసి చూచుకొంటున్నాను. ఒకప్రక్క ఆ డోలక్ శబ్దానికి చెవులు పగిలిపోతున్నాయి. చప్పట్లు, మంజీరా వాయిద్యం కూడా దానికి తోడయ్యాయి. పిల్లలు నాట్యం చేయసాగారు. భరింపశక్యం గాక నేను వెంటనే లేచి తలుపు తెరుచుకునివచ్చి పర్సు తెరిచాను. వరండాలోకి వచ్చి చూసేసరికి పదెనిమిది రోజుల నుంచి గడ్డంమీసాలు చేసుకోని వారి నాయకుడు ఉత్సా

హంగా కొంగు చూచి నిలబడి వున్నాను. పర్సు దులిపి చూశాను. దానిలో ఒక రూపాయి, తొమ్మిది అణాలు, మూడుపైసలు కన్పించాయి. నెల గడవటానికి ఇంకా రెండు రోజులుంది. టైలర్‌కు ఇవ్వాలని ఎంతో ప్రయాసపడి ఈ డబ్బును మిగిల్చాను

వాళ్ళందరూ పాట ఆపి తిట్లు ప్రారంభించారు. "డబ్బు మూలుగుతుంది జీవితమంతా పరుపులమీద పరుపువలెపడి వున్నావేగాని నువ్వు చనిపోయినప్పుడు తిండికిలేని మా వంటి దరిద్రులకంటె నువ్వేమీ ఎక్కువకాదని. నీ శవానికి ఆ రోజున లక్షాధికారికుండే విలువ వుండదని ఒకసారైనా ఆలోచించావా?" అని ఎన్నోమాట లన్నారు

ఇవన్నీ పూర్వంనుంచీ అందరూ అంటున్న వాటివలె కన్పించాయి. కానీ లక్షాధికారి అనే విశేషణం విని శరీరం మీది రోమాలు నిక్కబొడిచాయి.

ఇది ప్రారంభం. దీని తరువాత ఇరవై ముప్పై సంఘాలలో సభ్యుడుగా చేరాను. ఇప్పుడు నాకు దేశమంతటిలో ప్రభుత్వ సభాపతి పదవి లభించింది. అవి భారతీయ సంగీతసభ మలేరియా విధ్వంసక సమితి, శవదహన సమితి, సాహిత్య సంస్కరణ మండలి, ముగ్గురు చండీదాసుల సమన్వయసమితి, గోశాల అభివృద్ధిసాధన సమితి, కవి కాళిదాస జన్మతిథి నిర్ధారణ మండలి, చెరుకు పిప్పి విక్రయ పరిశీలక సంఘము' క్షౌరవ్యవ నివారిణి గడ్డంమీసాల రక్షణ సమితి మొదలగు అనేకానేక సంఘాలలో నేను ప్రధాన సభ్యుడుగా ఉంటున్నాను. 'ధనుష్టంకారతత్త్వం' అను గ్రంథానికి భూమిక

ప్రాయమనీ, 'నవీన గణితాదర్శము' ను గురించి మీ అభిప్రాయాన్ని తెలియజేయమనీ, 'భవభూతి భువనపురంలో జన్మించాడు' అనే గ్రంథం రచించిన గ్రంథకర్తకు ఆశీర్వచనాలు పంపించమనీ, రావల్ పిండిలోని ఫారెస్టు ఆఫీసరు కుమార్తెకు నామకరణం చేయించటానికి రావలసిందనీ, గడ్డంచేసుకొనుటకు ఉపయోగించే సబ్బును ప్రశంసిస్తూ రెండు వాక్యాలు వ్రాసిపంపవలసిందిగా ప్రార్థిస్తూ, 'పిచ్చికి దివ్యౌషధం' ను గురించి నా అనుభవాన్ని చెప్పవలసిందిగానూ ప్రతినిత్యం ఎన్నో కోర్కెలు కోరుతూ ఎందరెందరో ఉత్తరాలు వ్రాస్తూ ఉంటారు."

* * *

"తాతయ్యా, మీరు సమయం లేదంటూ ఎన్నో అబద్ధాలు మాట్లాడుతూ ఉంటారు. మీకు సమయంలేదని అన్నంత మాత్రాన ఎవరూ నమ్మరు. మళ్ళీ దేహం లభించిన తరువాత 'అతడు' ఏంచేస్తున్నాడో ఇవాళ మీరు చెప్పక తప్పదు"

"దేహం లభించగానే చాలా సంతోషిస్తూ అతడు తపతప అడుగులు వేస్తూ అక్కడనుంచి వెళ్ళిపోయాడు."

"తపతప అడుగులు వేయటం ఎందుకు?"

"చాలా కాలానికి తిరిగి చెవులు లభించినందువల్ల తన చెవులతో శబ్దాన్ని వినాలనే కోర్కెను చంపుకోలేకపోయాడు. శ్యామాబజారు చౌకులోకి వెళ్ళి నిలబడి ట్రాములు, బస్సుల

కఠోర ధ్వనుల్ని మైమరచి వినేవాడు. మరొకప్పుడు అక్కడి నుంచి టిటాఘర్ జూట్ మిల్లు కాపలావానితో స్నేహం చేసి అతనిగదిలో చేరి జూట్ మిల్లు కూత వింటూ కునికిపాట్లు పడుతూ ఉండేవాడు దోనెనిండా రసగుల్లాలు. పొగచూరిన బంగాళాదుంపలు తీసుకొని బర్నకంపెనీవారి ఇనపకొట్టులో కూర్చొనితినటం ప్రారంభించేవాడు. ఆంగ్లసైనికులుతుపాకిశిక్ష ణకుడమ్‌డమ్ శబ్దంవచ్చినప్పుడు అతడుఅక్కడ చేరిటార్గెట్ అవతలకూర్చొని ఆ శబ్దాన్ని విని ఆనందించేవాడు. ఆనందంపట్టలేక తలను టార్గెట్ ఇవతలకు చాచి చూస్తున్నాడు. రయ్ మంటూ ఒక తుపాకి గుండు వచ్చి అతని తలలో దూరింది. అంతే."

"అంతే ఏమిటి, తాతయ్యా?"

"అంతే అంటే కథ అంతటితో ముగిసింది అనే."

"లేదు, లేదు. అలాజరగటానికి వీల్లేదు. మీరునాతో టక్కులు చెపుతున్నారు. ఈ విధంగా అన్ని కథలూ ముగించవచ్చును."

"అవును, అలాగే జరుగుతుంది గదా!"

"అదే, అలాజరగటానికి వీల్లేదు. తరువాత ఏం జరిగిందో చెప్పు తాతయ్యా!"

"ఇంకా చెప్పేదేముంది? చనిపోయిన తరువాత చెప్పటానికేముంటుంది?"

"చనిపోయిన తరువాత కథనే చెప్పు—"

"నువ్వు కథలో సావిత్రి వవుతున్నట్లు కన్పిస్తుంది."

"ఆ విధంగా మీరు మాయమాటలు చెప్పి నన్ను మరిపించటానికి ప్రయత్నించవద్దు. తరువాత ఏం జరిగిందో చెప్పు తాతయ్యా!"

"సరే, అలాగే చెప్తాను. చావటంకంటె పెద్ద తిట్టు లేదని ప్రజలు అంటూ వుంటారు చావటంకంటె మించిన తిట్టుఉంది. ఇప్పుడు నేను దానిని గురించే చెప్తాను. మిలటరీ డాక్టరు అక్కడే డేరాలో కూర్చొని ఉన్నాడు. ఆయన చాలా గొప్ప డాక్టరు ఒకమనిషి తలలో తుపాకి గుండు దూరి అతడు చనిపోయాడనే వార్త తెలియగానే ఆ డాక్టరు సంతోషంగా 'హుర్రా' అంటూ ఎగిరి గంతేశాడు."

"ఆ డాక్టరుకు అంత సంతోషం ఎందుకు?"

"మెదడును మార్చుటకు అవకాశం కలిగింది" అని ఆ డాక్టరు అన్నాడు.

"మెదడును ఎలా మారుస్తారు?"

"సైన్సులో ఉన్న గొప్పతనం అదే. జంతుప్రదర్శనశాలనుంచి డాక్టరు వెంటనే ఒక అడవి మనిషిని తెప్పించారు. తరువాత మన 'అతడి' తలమీాది పైమూతను తెరిచి దానిలో అడవిమనిషి మెదడును నింపి మూతమూసి దాని చుట్టూ సీమసున్నపు వ లాస్త్రి పట్టీవేసి పదిహేను రోజులు తలకు కట్టుకట్టి ఉంచారు. తల మామూలుగా అతుక్కు పోయింది 'అతడు' మంచంమీాది నుంచి లేచినది మొదలు చాలా గడబిడ ప్రారంభమయింది. 'అతడు' ఎదుట ఎవరు కన్పించినా సరే పళ్ళికిలించి కిచకిచలాడేవాడు. అక్కడ పనిచేసే నర్సు భయపడి కన్నుమిన్నుగానకుండా పారిపోయిందో, ఈనాటివరకు

ఆమె జాడ తెలియలేదు. డాక్టరుగారు భల్లూకప్పట్టుతో 'అతడి' రెండు చేతులు గట్టిగా పట్టుకొని "అల్లరిచేయకుండా కదలకుండా ఇక్కడే కూర్చో" అని గద్దించారు. 'అతడు' డాక్టరుగారి గద్దింపును గ్రహించాడు. కానీ, ఆ భాషను అర్థం చేసుకోలేకపోయాడు. 'అతడి'కి కుర్చీలో కూర్చోవటం ఇష్టం లేదు, ఎగిరిదూకి బల్లమీద కూర్చోవాలని కోర్కెగా ఉంది. కానీ, ఎగరటం అతనికి చేతకాలేదు. ఎగరటానికి ప్రయత్నించి దభీమని క్రిందపడిపోయేవాడు. గది తలుపులు తెరిచే ఉన్నాయి ఎదురుగా బయట ఒక రావిచెట్టుంది. అందరినీ తప్పించుకొని 'అతడు' రావిచెట్టువైపు పరుగెత్తాడు. ఒక్క దుముకులో ఏదో ఒక కొమ్మమీదికి చేరుకోవచ్చుగదా అని ఆశించాడు. ఎన్నిసార్లు ఎగిరినా ఏ కొమ్మమీదికీ చేరుకోలేక పోయాడు. ప్రతిసారి క్రింద పడిపోతూ ఉన్నాడు. తాను ఎందుకు ఎగరలేకపోతున్నాడో అతనికి అర్థం కాలేదు. కోపంతో పళ్ళుపటపటనూరసాగాడు. 'అతడు' ఎగరటంచూచి మెడికల్ కాలేజి విద్యార్థులు చుట్టూచేరి గలగలనవ్వసాగారు. 'అతడు' పళ్ళికిలించి వారివెంట పడేవాడు. ఒక ఆంగ్లేయుడు చెట్టుక్రింద కాళ్ళుచాచుకు కూర్చొని రొట్టె వెన్నతో అరటి పండుకలిపి ఆనందంగా తింటున్నాడు. అకస్మాత్తుగా మన 'అతడు' అది చూచి దుముకుతూ ఆంగ్లేయబాలునివద్దకు వెళ్ళి గభాలున అరటిపండు లాక్కొని తినేశాడు. ఆ కుర్రాడు కోపం వచ్చి 'అతడి'ని కొట్టాలనిలేచాడు. కానీ, కొట్టలేకపోయాడు. చుట్టూచేరిన అతని మిత్రులు ఇదిచూచి పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వసాగారు.

"తరువాత?"

"తరువాత, అతని బాధ్యత ఎవరు వహించాలా అని అంగరూ ఆలోచనలో పడిపోయారు, 'జంతుప్రదర్శనశాలకు పంపితేసరి' అన్నారొకరు 'అనాథ ఆశ్రమానికి పంపటం మంచిది' అని సలహా చెప్పారు మరొకరు. 'జంతుప్రదర్శన శాలలో మనుష్యుల్ని పెంచటం మా పనికాదు' అన్నారు అక్కడి అధికారి. అనాథ ఆశ్రమపు సెక్రటరీగారు 'కోతుల్ని పెంచటం మా ఆశ్రమ నియమాలకు విరుద్ధం' అని తిరస్కరించారు."

"ఆగారేం తాతయ్యా?"

"పాపక్కా, ఈ ప్రపంచంలో అన్నిటికీ అంతమందు ఉన్నది ఆగటమే."

"వద్దు, ఇక్కడ ఆపవద్దు. అరటిపండు లాక్కొనితినటం అది అందరూ చేయవచ్చు."

"సరే, రేపుచెప్తాను. ఇవాళ నాకు పనివుంది."

"రేపు చెప్పేదేమిటో, తరువాత ఏం జరుగుతుందో కొద్దిగా చెప్పు తాతయ్యా!"

"అతనికి అంతకుముందే వివాహం నిశ్చయమైందని నీకు తెలుసుగదా! కానీ అతని మెదడు మారిపోయినవార్త అతని అత్తవారికి తెలియలేదు. ముహూర్తం వగైరా అన్నీ అంతకు ముందే నిశ్చయించారు వరుని మేనమామ పెద్దపెద్ద అరటి పళ్లు పెట్టి, ఏదోవిధంగా అతనిని శాంతింపజేసి పెళ్ళికుమార్తె ఇంటికి తీసుకు వెళ్ళాడు. అక్కడ జరిగిన అల్లరిని గురించి వర్ణించి చెపితే, అవును, కథ అంటే ఇది అని నువ్వు తప్ప

కుండా అంటావు తరువాత అతనిని చంపివేయవలసిన అవసరం ఉండదు. దావటంకంటె కూడా ఘోరం జరుగుతుంది."

*　　*　　*

సాయంత్రం సమయాన నేను డాభామీద కూర్చొని ఉన్నాను. దక్షిణపుగాలి చాలా హాయిగొలుపుతూ ఉంది. అప్పుడే శుక్లపక్షపు చవితి చంద్రుడు ఉదయిస్తున్నాడు. పాపక్క ఒక మందారమాల గుచ్చి గాజు పళ్ళెములో పెట్టి తెచ్చింది- కథ పూర్తవగానే ఆమె నాకు ఆమాలను బహూకరిస్తుంది.

ఇంతలో రొప్పుతూ రోజుతూ ఎక్కడినుంచో 'అతడు' అక్కడికి వచ్చాడు.

"వృద్ధసోదరా, నేను సహించినకొద్దీ నువ్వు మరీ మితి మీరుతున్నావు. ఇంతకుముందు గంజాయిదమ్ము పుత్తన్ దేహంలో ప్రవేశపెట్టినపుడు సహించాను. అలుసు కనిపెట్టి ఇప్పుడు కోతిమెదడును నా తలలోకి ఎక్కించావు. ఇది ఎంత మాత్రం నేను సహించను. దీని తరువాత నువ్వు నన్ను ఏ గబ్బిలంగానో, జల్లిగానో లేదా పేడపురుగుగానో చిత్రిస్తావు. నీకు అసాధ్యమంటూ ఏదీ లేదు. ఇవాళ నేను ఆఫీసుకు వెళ్ళి కుర్చీలో కూర్చొగానే ఎదురుగా బల్లమీద ఒక పాత్రలో అరటిపండ్లు కన్పించాయి. సహజంగా నాకు అరటిపండ్లంటే చాలాఇష్టమే. కానీ ఇవాళ్టినుంచి నేను పూర్తిగా అరటి పండ్లను తినటం మానివేయాల్సిందే. పాపక్కా, దీని తరువాత మీ తాతయ్య నన్ను

బ్రహ్మరాక్షసునిగానో, కబంధుడిగానో చిత్రించి కథ ప్రారంభిస్తే దయచేసి అది పత్రికలలో అచ్చుకాకుండా చూడవలసిన బాధ్యత నీదే. ఈ మధ్య పెండ్లికుమార్తె తండ్రి మా ఇంటికి వచ్చాడు. ఇంతకుముందు వారు పెళ్ళికుమార్తెకు ఎనభై తులాల బంగారం పెట్టాలని నిర్ణయించారు. కానీ ఇప్పుడు పదమూడు తులాలకు దిగివచ్చారు. మరికొంతకాలం ఆగితే నాకిక వివాహం చేసుకొనే అదృష్టమే కలగదని వారు అర్థం చేసుకున్నారు. సరే, నేనిక శలవు తీసుకుంటాను."

# 10

ఆ రోజు సాయంత్రం నేను దక్షిణపువైపు వరండాలో కూర్చొని ఉన్నాను ఎదురుగా ఎత్తుగా ఉన్న దిరిసెనచెట్లు చాలా ఉన్నాయి. అవి ఏనాటివో, ఆకాశంలోని నక్షత్రాలను తమచాటున దాచుకొని అవి మిణుగురుల కాంతితో వాటికి సైగచేస్తున్నట్లున్నాయి.

నేను పాపక్కవైపుతిరిగి "ఇప్పుడు నువ్వు చాలా తెలివి మీరిపోయావు. బుద్ధి బాగా వికసించింది. అందుకని ఒకసారి నీ బాల్యాన్ని గుర్తుచేసి ఒకప్పుడు నువ్వు చాలా చిన్నదానవని చెప్పాలని ఆలోచిస్తున్నాను" అని అన్నాను.

పాపక్క నవ్వుతూ "ఇదే మీ విజయం. ఒకప్పుడు మీరుకూడా చిన్నపిల్లలేగదా! అది గుర్తుచేయటానికి తగిన ఉపాయమేదీ నాకు కన్పించటంలేదు" అని అంది.

నేను పాపక్క మాటకు దీర్ఘంగా నిట్టూర్చి ఈరోజులు ఎవరి చేతుల్లోనూ లేవు. నేనూ ఒకప్పుడు చిన్నవాడినే. దీనికి

ఆకాశంలోని నక్షత్రాలు మాత్రమే సాక్ష్యం చెప్పగలవు. నా విషయం వదలివేద్దాం. ఇవాళ నీ చిన్ననాటి సంగతి ఒకటి చెపుతాను. అది నీకు నచ్చుతుందో లేదో నాకు తెలియదు; నాకుమాత్రం ఎంతో ఆనందంగా ఉంటుంది"

"అయితే, చెప్పు తాతయ్యా!"

* * *

అది ఫాల్గుణమాస మనుకుంటాను. అంతకుముందు చాలా రోజుల్నుంచి నువ్వు చందమామవలె తెల్లగా మెరిసి పోయే బనియను ధరించిన చటర్జీ కుర్రవానివద్ద రామాయణ కథ వింటున్నావు. ఉదయం నేను టీ త్రాగుతూ పత్రిక చదువుతున్నాను. ఇంతలో నువ్వు ఇంతింత కళ్ళు చేసుకొని నా వద్దకు వచ్చావు. "ఏమమ్మా, ఏం జరిగింది!" అని అడిగాను నేను నిన్ను చూచి.

నువ్వు రొప్పుతూ "మరే, నన్ను అపహరించారు" అని చెప్పావు.

"అయితే, ఏదో ప్రళయమే జరిగింది ఎవరాపని చేశారు!" అని ప్రశ్నించాను నేను.

ఈ ప్రశ్నకు జవాబు అంతకుముందు ఆలోచించలేదు. రావణుడని నువ్వు జవాబు చెప్పవచ్చు. కానీ, అది నిజంగా ఉండదని నీకు సందేహం కలిగింది. అంతకు ముందు రోజునే యుద్ధంలో రావణుడు చనిపోయాడు. అతని తలలలో ఒక్కటి కూడా మిగలలేదు. మరేమీ ఉపాయం తోచక తటాలున

"మరెవరితోనూ చెప్పవద్దని అతడు నన్ను హెచ్చరించాడు" అని చెప్పావు.

"ఇది మరింత ఆపదే వచ్చిపడింది. అతడు ఎటునుంచి పారిపోయాడు?" అని అన్నాను నేను.

"అది ఇంతకు ముందెప్పుడూ చూడని కొత్తదేశం."

"ఖాన్ దేశం కాదుగదా?"

"కాదు."

"బులందేల్ ఖండంకూడా కాదా?"

"కాదు"

"ఎలాంటి దేశం అది?"

"ఆ దేశంలో నదులున్నాయి, పెద్ద పెద్ద పర్వతాలున్నాయి. కొంత వెలుగూ ఉంది, కొంత చీకటీ ఉంది."

"అలాంటివి చాలా దేశాలలో ఉండేవేగదా! అక్కడ ముళ్ళ నాలుకలు చాచిన రాక్షసులు కన్పించారా?"

"అవును, కన్పించారు- ఒకసారి నాలుక బయటకు పెట్టి వెంటనే లోనికి ముడుచుకున్నాడు."

"అతడు నిన్ను పూర్తిగా మోసం చేశాడు. లేకపోతే నేను అతడి జుట్టు ముడిని గట్టిగా పట్టుకునేవాడిని. అతడు నిన్ను ఎలాంటి వాహనంమీద తీసుకువెళ్ళాడు? రథంలోనా?"

"కాదు."

"గుర్రంమీదనా?"

"కాదు."

"ఏనుగుమీద కూర్చోబెట్టి తీసుకువెళ్ళాడా?"

"కాదు, కుందేలుమీద" అని వెంటనే నువ్వు జవాబు చెప్పావు. అప్పుడు నీ మనస్సులో ఆ జంతువే మెదులుతూ ఉంది. నీ పుట్టిన రోజు పండుగనాడు నాన్నగారు నీకు రెండు కుందేళ్ళను కానుకగా ఇచ్చారు."

నువ్వు ముసి ముసి నవ్వులు నవ్వుతూ "అతడు ఎవరో చెప్పరో తాతయ్యా" అని అడిగావు.

"తప్పకుండా అది చందమామయ్య పనే" అని నేను జవాబు చెప్పాను.

"మీకెలా తెలిసింది?"

"అతనికి కూడా పూర్వం నుంచీ కుందేళ్ళను పెంచే అలవాటు ఉంది."

"అతనికి ఆ కుందేలు ఎలా వచ్చింది?"

"మీ నాన్నగారు మాత్రం ఇవ్వలేదు."

"మరెవరిచ్చారు?"

"బ్రహ్మదేవుని జంతుప్రదర్శనశాలలోనుంచి దొంగ తనంగా తెచ్చుకున్నాడు."

"ఛీ, ఛీ!"

"చేసిందిపాడుపనే. అందుకే అతని శరీరం మీద కళంకం అంటుకుంది. బ్రహ్మదేవుడు అతనిని చాలా బాగా మోసగించాడు."

"మంచి పని జరిగింది."

"అతనికి తగిన శిక్ష లభించనే లేదు. మళ్ళీ నిన్ను దొంగిలించి తీసుకువెళ్ళాడు. అతని కుందేలుకు నిన్ను కాబేజి ఆకులు తినిపించమని చెప్పాడా?"

ఈ మాట విని నీకు చాలా సంతోషం కలిగింది. నా తెలివిని పరీక్షించటానికి "తాతయ్యా, కుందేలు నన్ను తన వీపుమీద ఎలా ఎక్కించుకు వెళ్ళిందో చెప్పచూద్దాం!" అని అడిగావు

"ఆ సమయంలో నువ్వు నిద్రపోయి ఉంటావు."

"నిద్రపోయినప్పుడు మనిషి తేలికవుతాడా?"

"ఎందుకు కాలేదు! నువ్వు నిద్రలో ఎప్పుడూ ఎగర లేదా?"

"ఎగిరాను."

"అలాంటప్పుడు కుందేలుకు కష్టమేముంది? కుందేలు కూడా అవసరం లేదు. అతడు తలుచుకుంటే అప్పుడు నిన్ను కప్పవీపుమీద ఎక్కించుకొని కోటముందు కాళీప్రదేశంలో కప్ప దాను తీయించేవాడు."

"కప్ప! ఛీ! ఛీ! వింటుంటేనే అసహ్యం కలుగుతుంది."

"భయపడాల్సిన పనిలేదు. చందమామ దేశంలో కప్పలు ఏమీ గడబిడ చేయవు అసలు విషయం మరిచాను. దారిలో నీకు కప్పతాత కన్పించలేదా?"

"కన్పించాడు"

"ఏం జరిగిందేమిటి?"

"సరివి చెట్టు మీదినుంచి దిగి ఎదురుగావచ్చి నిలబడి 'పాపక్కను దొంగిలించి తీసుకు పోతోందెవరు?' అని గద్దించాడు. కప్పతాత మాట వినగానే కుందేలు వెనక్కి తిరిగి చూడకుండా పరుగెత్తింది. కప్పతాత దానిని పట్టుకోలేక పోయాడు- మరి దాని తరువాత?"

"దేని తరువాత?"

"కుందేలు నన్ను తీసుకు వెళ్ళిపోయింది. తరువాత ఏంజరిగిందో చెప్పు తాతయ్యా?"

"నేనేం చెప్పగలను? నువ్వే చెప్పాలి."

"భలే నేను నిద్రపోయానుగదా, నాకేం తెలుసు?"

"అదే వచ్చిన చిక్కు. నిన్నెక్కడికి తీసుకు వెళ్ళారో నేను తెలుసుకోలేక పోతున్నాను. నిన్ను తీసుకు వచ్చుటకు వెళ్ళాలంటే మార్గమే తెలియదు. అతడు నిన్ను తీసుకు వెళు తున్నప్పుడు దారిలో గంట మ్రోగిన ధ్వని విన్పించిందా?"

"అవును, గుర్తొచ్చింది టన్, టన్ అంటూ గంట ధ్వని విన్పించింది"

"అంటే ఆ మార్గం సరాసరి గంటాకర్ణుల పేటవైపు వెళ్ళిందన్నమాట"

"గంటాకర్ణులా! ఎలా ఉంటారు వాళ్ళు?"

"వాళ్ళ రెండు చెవులూ రెండు గంటలు, మీసాలు రెండూ రెండు సమ్మెటలు. తోకతో గట్టిగా ఈచెవుమీద ఒక సారి ఆ చెవుమీద ఒకసారి కొడుతూ ఉంటారు. మరొక జాతి గంటాకర్ణులు ఉంటారు. వాళ్ళు చాలా క్రూరులు. వాళ్ళ చెవుల్లోనుంచి కంచుమ్రోత వినపడుతూ ఉంటుంది."

"వాళ్ళ గంటల ధ్వని మీ కెప్పుడైనా విన్పించిందా, తాతయ్యా?"

"ఎందుకు విన్పించలేదు. నిన్నరాత్రి పుస్తకం నేనుచదు వుతూ కూర్చున్నాను. ఇంతలో అకస్మాత్తుగా చీకట్లోగంటా కర్ణులు వెళుతున్నట్లు విన్పించింది. వాళ్ళు పన్నెండుగంటలు

కొట్టేసరికి నేను భయంతో కూర్చోలేక పోయాను. వెంటనే పుస్తకాన్ని దూరంగా విసిరివేసి మంచంమీద దిండులో ముఖం దాచుకొని పడుకున్నాను.''

"గంటాకర్ణులకు, కుందేలుకు స్నేహం ఉందా?"

"వాళ్ళకు చాలా స్నేహం. కుందేలు వాళ్ళగంటల ధ్వని వింటూ అటే నడుస్తుంది. సప్తర్షిపేటలో క్రీనీడ మార్గానే వెళుతుంది అది."

"తరువాత?"

"తరువాత ఒక గంట మ్రోగుతుంది. రెండు మూడు నాలుగు, అయిదు గంటలు మ్రోగుతాయి. అంతటితో మార్గం ఆగిపోతుంది."

"తరువాత?"

"తరువాత నిద్రా నక్షత్రానుకు అవతలవైపున ఉన్న వెలుగు దేశంలోకి అదివెళుతుంది. అప్పుడిక అది కన్పించదు"

"అయితే, నేను ఆ దేశంలోకి చేరుకున్నానా?"

"ముమ్మాటికి చేరుకున్నావు."

"అయితే, నేనిప్పుడు కుందేలు వీపుమీద లేనంటారా?"

"ఇప్పుడు గనుక ఉంటే దాని వీపు విరిగిపోతుంది."

"అవును, ఆ సంగతే మర్చిపోయాను. ఇప్పుడు నేను బరువుగా ఉంటానుగదూ! తరువాత ఏంజరిగింది?"

"తరువాత నిన్నేదో ఒక విధంగా అక్కడినుంచి నేను తీసుకురాక తప్పదు."

"తప్పకుండా తీసుకురావాలి. ఎలా తీసుకొస్తారు?"

"ఆ విషయమే ఆలోచిస్తున్నాను. ఏ రాజకుమారుడి నైనా శరణు వేడాలి"

"రాజకుమారుడు ఎక్కడ కన్పిస్తాడు?"

"ఉన్నాడుగదా, మన ఆ సుకుమార్"

ఇది వినగానే ఒక క్షణకాలం నీ ముఖం చాలా గంభీరంగా మారిపోయింది. నువ్వు కొంచెం కోపంగా "అతడంటే నీకు చాలా ప్రేమ. అతడు నీవద్ద పాఠం చదువుకుంటున్నాడు గదూ, అందుకనే గణితంలో నా కంటె ఎక్కువ మార్కులు వస్తున్నాయి" అని అన్నావు.

ఆతనికి నీ కంటె ఎక్కువ మార్కులు రావటానికి ఇంతకంటె మరొక కారణంకూడా ఉంది. కానీ నేనిక ఆ విషయాన్ని చర్చించలేదు. "నేను ప్రేమించినా ప్రేమించక పోయినా అతడేగదా రాజకుమారుడు" అని అన్నాను నేను.

"మీకెలా తెలిసింది?"

"నాతో రాజీచేసుకొని అతడు ఆ పదవిని గట్టిగా నిలబెట్టుకున్నాడు,"

నువ్వు గట్టిగా ముఖంచిట్లించి "ప్రపంచంలోఅందరూ నీతో రాజీచేసుకొనే వాళ్ళే" అని అన్నావు.

"నన్నేం చేయమంటావో నువ్వే చెప్పు. వయస్సులో నేను అతనికంటె చాలా పెద్దవాడినని ఎంత చెప్పినా అతడు అంగీకరించనే లేదు."

"అలాంటివాడినేగదా నువురాజకుమారుడు అనిఅంటున్నావు. అతనిని నేను జటాయువుగా కాదు సరిగదా సామా

న్యముగు గద్దగాకూడా గుర్తించను బయలుదేరాడులే దొడ్డ రాజకుమారుడు!"

"శాంతించు, ప్రస్తుతం మనము చాలా ఆపదలో ఉన్నాము. నువ్వు ఎక్కడ ఉన్నావో ఏమీ తెలియనే లేదు కనుక ఈ సారికి అతనిని మన పనిని చేయనిద్దాం. ముందు బ్రతికి బయటపడాలిగదా! తరువాత అతనిని వారధికట్టిన ఉడతగా మార్చేస్తాను."

"నన్ను తీసుకు వచ్చుటకు అతడెందుకు అంగీకరిస్తాడు? అతడు పరీక్ష చదువు చదువుతున్నాగదా?"

"అంగీకరిస్తాడని నాకు పూర్తిగా నమ్మకం ఉంది. నేను నిన్నగాక మొన్న శనివారం మధ్యాహ్నం మూడుగంటలకు అతని ఇంటికి వెళ్ళాను. ఎండ చాలా తీవ్రంగా ఉంది. తల్లికళ్ళలో కారంకొట్టి డాబా మీద తిరుగుతున్నాడు."

"ఏమిటి సంగతులు?" అని అడిగాను నేను.

"అతడు తటాలున తలపైకెత్తి "నేను రాజకుమారుడను" అని అన్నాడు.

"రాజకుమారుడవైతే కత్తిఏది?"

"దీపావళినాడు కాల్చిన అవ్వాయి చువ్వాయ తాలూకు సగంకాలిన వెదురుపుల్లను నడుముబెల్టుకు వ్రేలాడగట్టుకొన్నాడు దానివైపు సైగచేసి "ఇదుగో"అని అన్నాడు.

"కత్తిఉన్నది. మరి గుఱ్ఱంకూడా కావాలి గదా!" అని అన్నాను నేను.

"గుఱ్ఱపుశాలలో ఉంది" అన్నాడు వెంటనే.

ఈ మాట అంటూ అతను డాబామీద ఒకమూలకు వెళ్ళాడు. తన మేనత్తగారి విరిగిపోయి అసహ్యంగా ఉన్న ఒక పాతగొడుగును బరబరఇవతలికి ఈడ్చుకొచ్చాడు. రెండు కాళ్ళతో దానిని నొక్కిపట్టుకొని 'చల్ చల్' అంటూ డాబా మీద పరుగెత్తించ సాగాడు.

"అవును, మంచిగుర్రమే" అని అన్నాను నేను.

"ఇది పక్షిరాజు రూపం కూడా ధరించగలదు చూస్తారా?"

"తప్పకుండా చూద్దాం!"

వెంటనే అతడు గొడుగును తెరిచాడు. గొడుగులోపల గుర్రపుదాణా ఉందేమో తెరవగానే దాణా అంతా డాబా మీద పడిపోయింది.

"ఆహా, ఎంత అద్భుతం! గొప్పసంగతే! ఈ జన్మలో పక్షిరాజును చూడగలుతానని కలలోకూడా అనుకోలేదు."

"తాతయ్యా, నేనిక ఇప్పుడు ఎగిరి వెళ్ళిపోతాను. మీరు గట్టిగా కళ్ళుమూసుకోవాలి. నేను ఆ మేఘాలలోనికి వెళ్ళటం మీకు స్పష్టంగా కనిపిస్తుంది. అక్కడ చాలా చీకటిగా ఉంటుంది."

"కళ్ళుమూసుకోవలసిన అవసరం లేదు. నేను అన్నీ స్పష్టంగా చూడగలుగుతున్నాను నువ్వు చాలా అద్భుతంగా ఎగురుతున్నావు సుమా! పక్షిరాజు రెక్కలు మేఘాలలో మాయమైపోయాయి."

"తాతయ్యా, నా గుర్రానికి ఏదైనా మంచి పేరొకటి చెప్పండి."

"ఛత్రపతి"

పేరు అతనికి నచ్చింది. అతడు గుర్రం వీపుమీద చేతితో తట్టుతూ "ఛత్రపతి!" అని అన్నాడు.

గుర్రం పక్షాన కూడా అతడే "చిత్తం, ఏమి ఆజ్ఞ!" అని జవాబు చెప్పాడు.

తరువాత అతడు నా ముఖంలోకి చూస్తూ "నేను మాట్లాడానని మీరు ఆలోచిస్తున్నారుగదూ? కాదు, నేను మాట్లాడలేదు. గుర్రమే మాట్లాడింది" అని అన్నాడు

"ఆ విషయం కూడా నాతో చెప్పాలా! నేనేమీ చెవిటివాడిని కాదుగదా!"

"ఛత్రపతీ, ఏమీ పనిలేకుండా మెదలకుండా కూర్చోవటం నాకేమీ నచ్చటం లేదు" అని అన్నాడు రాజకుమారుడు.

"తమరు ఆజ్ఞాపించండి" అని అతడే జవాబు కూడా చెప్పాడు

"ఏడు సముద్రాలు, పదమూడు ద్వీపాలు దాటి వెళ్ళాలి."

"సిద్ధంగా ఉన్నాను."

నాకు ముఖ్యమైన పని ఉన్నందువల్ల అక్కడ ఎక్కువ సేపు ఉండలేకపోయాను. అతని ఆనందానికి అడ్డొస్తూ "రాజకుమారా, మీ పంతులుగారు క్రింద కూర్చొనివున్నారు వచ్చేటప్పుడు నేను వారిని చూచివచ్చాను. చాలా కోపంగా ఉన్నట్లు కన్పించారు" అని చెప్పక తప్పలేదు.

ఆ మాట వినేసరికి రాకుమారుని మనస్సు విలవిల లాడింది. గొడుగుమీద గట్టిగా ఒక చరుపు చరిచి "తక్షణం నన్నిక్కడినుంచి తీసుకు వెళ్ళలేవా!" అని అన్నాడు.

పాపం ఆ గుర్రం తరఫున నేనే జవాబు చెప్పవలసి వచ్చింది- "చీకటి పడకముందు ఇది ఎగరలేదు. పగలు ఇది గాడుగువలె నటిస్తుంది. నువ్వు నిద్రపోగానే రెక్కలు విప్పు తుంది! నువ్వింక వెళ్ళి చదువుకో. లేకపోతే చాలా బాధ పడాల్సి వస్తుంది."

సుకుమార్ క్రింద ఉన్న మాష్టరు దగ్గరకు వెళ్ళాడు వెళుతూ వెళుతూ నాతో "ఇంకా విషయమంతా పూర్తి కాలేదు" అని చెప్పాడు.

"విషయాలు అంతంత మాత్రాన పూర్తవుతాయా! పూర్తయితే ఇక ఆనందమేముంటుంది!" అని నేను అన్నాను.

"అయిదుగంటలకు పాఠం అయిపోతుంది. తాతయ్యా, అప్పటికి నువ్వు తప్పకుండా రావాలి."

"మూడవ వాచకంలోని పాఠం తరువాత రుచిమార్పు కోసం మంచి కథ ఏదైనా కావాలి. నేను తప్పకుండా వస్తాను"

# 11

సందుమలుపులో ట్రాముకోసం ఎదురు చూస్తున్న పంతులుగారు కన్పించారు. నేను సుకుమార్ ఇంటికి వెళ్ళే సరికి అయిదున్నర గంటలయింది. ఎదురుగా ఉన్న మూడం తస్తుల భవనంమీాద నీరెండ పడుతూఉంది. సరాసరి డాబా మీాదికి వెళ్ళాను. మెట్లద్వారం వద్దనే సుకుమార్ మెదల కుండా కూర్చున్నాడు. డాబామీాద ఒకమూల అతని ఛత్ర పతి విశ్రాంతి తీసుకొంటుంది వెనుక మెట్లగుండా నేను పైకి

వచ్చినప్పటికీ నా అడుగుల చప్పుడు అతనికి వినిపించనేలేదు. కాస్సేపాగి నేను "రాజకుమారా," అని అతనిని పిలచాను. అతడు స్వప్నలోకం నుంచి దిగివచ్చినట్లున్నాడు. త్రుళ్ళి పడ్డాడు.

"ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చున్నావేమిటి?" అని అడిగాను నేను.

"చిలుక గోరువంకల సంభాషణ వింటున్నాను."

"చిలుక గోరువంకలు నీ కెక్కడ దొరికాయి?"

"ఎదురుగా పర్వతంమీద అడవి కన్పిస్తుందా? కొమ్మ కొమ్మకూ పుష్పాలు విరగపూసాయి.

ఎర్రనివి, పసుపు పచ్చనివి, నీలవర్ణమైనవి రంగురంగుల పుష్పాలు సాయంత్రపు రంగురంగుల మేఘాలవలె కన్పిస్తున్నాయి. అక్కడినుంచే చిలుక గోరువంకల మాటలు వినబడుతున్నాయి."

"అవి నీకు కన్పిస్తున్నాయా ఏమిటి?"

"కన్పిస్తున్నాయి కొంతకన్పిస్తూనూవుంది. కొంతకప్పినట్లూ ఉంది."

"ఆ రెండిటికీ జరిగే సంభాషణ ఏమిటి?"

ఈ ప్రశ్నతో రాకుమారుని తల తిరిగి పోయింది అతడు నత్తులుకొడుతూ "అవి మాట్లాడునేదేమిటో మీరే చెప్పండి, తాతయ్యా!" అని అన్నాడు.

"స్పష్టంగానే వినపడుతుందిగదా, అవి రెండూ చర్చించుకొంటున్నాయి."

"ఏ విషయాన్ని గురించి చర్చిస్తున్నాయి?"

"'నేనిక ఎగిరి వెళ్ళిపోతాను' అంటుంది చిలుక, 'ఎక్కడికి ఎగిరి వెళతావు?' అని అడుగుతుంది గోరువంక. 'ఎక్కడికి' అనే పేరుగల వస్తువే లేనప్పుడు ఎగురుతూ ఉండటమే చేయవలసిన పని' అని జవాబు చెప్పింది చిలుక 'నువ్వుకూడా నావెంట రారాదూ' అనికూడా అడిగింది అది. 'నాకు ఈఅడవి అంటేచాలఇష్టం. చెట్లకొమ్మలకు ఇక్కడరకరకాలలతలు అల్లుకొనిఉంటాయి. రేగుచెట్లమీదపండ్లున్నాయి ఇక్కడబూరుగు పుష్పాలు వికసించినప్పుడు కాకులతో పోట్లాడి ఆ పుష్పాలలోని తేనె త్రాగటం ఎంతో ఆనందంగా ఉంటుంది. చీకటి పడేసరికి చెట్లమీద మిణుగురులు ఆకాశంలోని నక్షత్రాల వలె అందంగా ఉంటాయి. దట్టంగా మబ్బులు పట్టి వర్షం కురుస్తున్నప్పుడు కొబ్బరిచెట్లు మనోహరంగా తలలువూపుతూ ఉంటాయి నువ్వు ఎగిరే ఆ ఆకాశంలో ఏముంటుంది' అని అడిగింది గోరువంక.

"నా ఆకాశంలో ఉదయం ఉంది, సాయంత్రంఉంది. అర్థరాత్రిసమయపు నక్షత్రాలున్నాయి. హాయిగొలిపే దక్షిణవాయువు ఉంది. ఇంకా ఏమీ లేదు, ఏమీలేదు ఏమీలేదు" అని జవాబు చెప్పింది చిలుక.

"ఏమీలేదు అంటే ఏమిటి తాతయ్యా?" అని అడిగాడు సుకుమార్.

"ఈ మాటే గోరువంకకూడా చిలుకనుఅడుగుతుంది."

"చిలుక ఏమని జవాబు చెప్పింది?"

"అది చెప్పేదేమంటే: ఆకాశంలో అన్నింటికంటె గొప్ప అమూల్య వస్తువు 'ఏమీలేదు' అనేదే. ఆ 'ఏమీ

లేదు' అనేదే తెల్లవారేసరికి నన్ను పిలుస్తూ వుంటుంది. దానికోసమేగదా నేనింతగా తపించిపోతూ ఉంటాను. ఇప్పుడు నేను అడవిలో గూడు అల్లుకుంటున్నాను 'ఏమీ లేదు' అనే అది ఎప్పుడూ ఆడుతూనే ఉంటుంది. రంగులతో ఆట, నీలి రంగు ముంగిట, మాఘమాసపు చివరి రోజుల్లో ఆ 'ఏమీ లేదు' అనేదాని ముసుగు కప్పుకొనే గుట్టలు గుట్టలుగా మామిడిపూత ఆహ్వాన పత్రికలు వస్తూవుంటాయి. ఇక్కడికి వార్త అందితే చాలు తేనెటీగలు మహదానందంతో మైమరచి నాట్యం చేస్తాయి.''

అమితోత్సాహంతో సుకుమార్ ఎగిరిలేచినిలబడ్డాడు. ''అయితే నేను ఇప్పుడు మా పక్షిరాజుమీద ఆ 'ఏమీ లేదు' అనే మార్గానే వెళతాను'' అని అన్నాడు.

''తప్పకుండా వెళ్ళు. పాపక్కను దొంగిలించుకుపోయిన ఘటన మొదటినుంచి చివరి వరకు 'ఏమీ లేదు' అనే విశాల మైదానంలోనే జరిగింది.''

సుకుమార్ పిడికిలిబిగించి ''అక్కడి నుంచి ఆమెను నేను తీసుకు వస్తాను. ఎన్ని అవాంతరాలొచ్చినా తీసుకు వస్తాను'' అని అన్నాడు.

* * *

''అర్థమవుతుందా పాపక్కా?- రాకుమారుడు సర్వసన్నద్ధుడై ఉన్నాడు. ఇక నిన్ను తీసుకు రావటమే ఆలస్యం. ఇంత వరకు డాబామీద అతని గుర్రం ఒకసారి రెక్కలు చాస్తూ మళ్ళీ మూసుకుంటూ ఉండి వుంటుంది.''

నువ్వు రుసరుసలాడుతూ "నాకేమీ అవసరం లేదు" అని అనేశావు.

"నువ్వనేదేమిటి? ఇంత ఆపదలో చిక్కుకున్న నిన్ను ఉద్ధరించకుండా మేమందరం నిశ్చింతగా ఎలా ఉండగలుగుతాము?" అని అన్నాను నేను.

"ఉద్ధరించటం అయిపోయింది."

"ఏం జరిగింది?"

"వినిపించటం లేదా? ఇప్పుడే గంటాకర్ణుడు నన్ను తీసుకువచ్చి ఇక్కడ వదలి వెళ్ళాడు."

"ఇదెప్పుడు జరిగింది?"

"ఇప్పుడే, ఇంతకుముందు 'టన్, టన్' అంటూ తొమ్మిది గంటలు కూడా కొట్టాడు."

"ఆ గంటాకర్ణుడు ఏ జాతివాడు?"

"రక్తపిపాసగల క్రూరమైన జాతికి చెందినవాడే. ఇప్పుడిక స్కూలుకు వెళ్ళేసమయం ఆసన్నమౌతూ ఉంది. అతని ధ్వని చాలా అసహ్యంగా ఉంది తాతయ్యా!"

"పాపం, కథ అకాలమరణం పొందింది. మరొక రాకుమారుడు అన్వేషించి తీసుకురావటం సబబుగా ఉండేది. గణేశ అపహరణ ముగింపుమాత్రం కాదు. 'స్కూలు ఎగతవేత' అనే విశాల మైదానాన్ని దాటటానికి సాహసించటాన్ని నువ్వు ఎంతమాత్రం సహించలేకపోయావు. లక్ష కీచురాళ్ళ దళాన్ని సమకూర్చి మన చెరువు ఒడ్డున ఉన్న సీటి పాచి అడవిలోనుంచి చందమామ దేశం వరకు నిలబెట్టాలని నాలో నేను నిశ్చయించుకొన్నాను. అవి అక్కడ నువ్వు నిద్రిం

శయనాగారంలోకి జొరబడి నువ్వు నిద్రించే మంచంమీది దుప్పటిని పట్టుకొని లాగుతాయి. చందనూమయ్యా సైనికు లందరూ కునికిపాట్లు పడుతూ ఉంటారు అద్వాన్నులు, జీతాలు బాగా ఇచ్చి దారిపొడుగునా మిణుగురు సైనికుల్ని నియమించాను. వెదురుబద్దల ఇరుకు సందులో నుంచి నిన్ను తీసుకువస్తున్నప్పుడు ఎండుటాకులు గలగలమంటూ చప్పుడు చేస్తాయి. కొబ్బరి చెట్ల ఆకులు గలగలలాడతాయి కమ్మని వాసనలు వెదజల్లే ఆవాల పొలాలు మీగుగా నువ్వు తిన్న రనీ రేవుకు చేరుకుంటావు. నేను గంపనిండా పర్వతప్పు ముళ్ళ ధాన్యాన్ని నింపుకొని గంగానదిలో నివసించే తొండముగల మొసలిని పిలిచేవాడిని. నిన్ను దాని వీపుమీద కూర్చొబెట్టి తీసుకు వెళ్ళేవాడిని అది గలగల నీళ్ళను చీల్చుకుంటూ ముందుకు పోతూ ఉండే మూడు జాముల రాత్రివేళ నాచు మొక్కలన్నీ లేచి ఒడ్డున నిలబడి 'ఏంజరిగింది, ఏంజరిగింద' అని అడుగుతూ ఉండేవి. 'మీ రెవరూ మాట్లాడవద్దు, ఏమీ జరగలేదు' అని నేను జవాబు చెప్పేవాడిని. ఈ యాత్రామార్గంలో గుడ్లగూబలను, గబ్బిలాలను కూడా జాగ్రత్తగా కనిపెట్టి ఉండేందుకు ముందుగానే ఏర్పాట్లు చేశాను. తెల్లవారుజామున నాలుగున్నర గంటలకు పశ్చిమా కాశాన ఉదయతార కన్పించేది. తూర్పు ఆకాశపు కాంతి రేఖలో ఉదయపుచిటికెన వ్రేలి బంగారు ఉంగరంలో నుంచి వెలువడే కిరణాల సైగలుకన్పించేవి. నిద్రనుంచి హడావుడిగా లేచిన కాకులు చింత చెట్లమీద కూర్చొని "కా కా!" అని ప్రశ్నిస్తున్నాయి. 'ఏమీలేదు' అని జవాబు చెప్పేసరికి

క్షణంలో అన్నీ అదృశ్యమై పోతాయి. అప్పటికి నువ్వుకూడా నిద్రమేల్కొని లేచి మంచంమీద కూర్చుంటావు"

*　　　*　　　*

పాపక్క చిరునవ్వు నవ్వుతూ ఇలా అంది- "ఇప్పుడు మీరు చెప్పిన నా చిన్ననాటి కథకు ఇన్ని చిలవలు పలవలు కల్పించి చెప్పటంవల్ల అంతగా ఏం ఆనందం కలగింది మీకు? నాలో ఈర్ష్య ఉన్నదని చెప్పటానికి మీరు చాలా ఉత్సాహంగా చెప్పారు! మీరు విదేశాలనుంచి తెప్పించి పెంచిన మామిడిచెట్టు పండుకాయలన్నీ కోసి దొంగచాటుగా సుకుమార్‌కు నేను ఇచ్చి వచ్చే విషయాన్ని మీ కథలో వదలి వేశారు అతనికి మామిడి పళ్ళంటే చాలా ఇష్టం. దొంగిలించాననే చెడుపేరు నాది, కాయలుతిని ఆనందించేది సుకుమార్. గణితంలో అతడు నా కంటె చురుకైన వాడని అంగీకరిద్దాం ఒకసారి ఏజరిగిందో మీకు గుర్తున్నదా? 'అవధానం' అనేమాటకు అతనికి అర్థం తెలియలేదు. అప్పుడు నేను పలకమీద వ్రాసి చాటుగా అతనికి చూపించాను- ఈ విషయాలేవీ మీ కథలో రానేలేదు!"

"మనసులోని ఈర్ష్యవల్ల నువ్వు సుకుమార్ యువరాజు పదవి నలంకరించటానికి ఇష్టపడనందుకు కాదు నేను సంతోషించేది. నా యందు నీకున్న అనురాగంవల్లనే నువ్వు అతనిమీద ఈర్ష్యగా ఉంటున్నావు- నాకు ఆనందం కలిగిన కారణం అదే."

"సరే, మీలో ఈ అహంకారం ఎప్పుడూ ఉండేదే. దానిని అలాగే ఉంచుకోండి. మీరు సృష్టించిన వూరూ పేరూ లేని 'అతడు' ప్రస్తుతం ఏమయ్యాడో చెప్పండి, తాతయ్యా!"

ఇప్పుడతడు చాలా వృద్ధుడైపోయాడు."

"మంచిదేగదా!"

"ప్రస్తుతం అతని కాలమంతా ఆలోచనలతోనే గడిచి పోతూ ఉంది. అతని బుర్రలో అనేక దుష్టసమస్యలు తుమ్మెదల గుంపువలె గూడు అల్లుకున్నాయి. చర్చలో ఇప్పుడు అతనిని జయించలేము."

"అయితే, అతడు కూడా ప్రస్తుతం నా సమానాంతర రేఖ మీదే నడుస్తున్నాడన్నమాట!"

"అంతేకావచ్చును. కానీ ఇప్పుడతడు కథ ఆవరణ నుంచి నిష్క్రమించాడు. ఉండిఉండి పిడికిలి బిగిస్తాడు. గట్టిగా తల ఆడిస్తూ 'కఠోరంగా మారాలి. కఠోరంగా మారాలి' అని అరుస్తూ ఉంటాడు."

"చెప్పనివ్వండి, మనకేంనష్టం. ఆకఠోరత మూసలోనే కథ అల్లండి. త్రాగటానికి సాధ్యపడనప్పుడు నమిలి తింటూ ఉంటామే కాని త్రాగుటకు వీలులేదు గనుక వదలివేయం గదా! అలాంటిదే నాకు నచ్చవచ్చునేమో!"

"నువ్వు నీ బుద్ధిబలంతో 'అతడి'ని అదుపులో పెట్ట లేవనే భయంవల్లనే ఇంతకాలం నేనతనిని మెదలకుండా కూర్చోబెట్టాను,"

"భలే, మీ భయం చూచి నాకు నిజంగా నవ్వొస్తుంది, తాతయ్యా, నేసింకా చిన్నపిల్లనే అని మీ ఉద్దేశ్యమా!"

"అదేంమాట పాపక్కా. నువ్వింకా చిన్నపిల్లవే అని శత్రువులుకూడా నిన్ను నిందించలేరు అలాంటిది ఆ మాట నేనెలా అంటాను?"

"అలాఅయితే అతనిని మీ దర్బారుకు పిలిపించండి. అతడి ప్రస్తుత పరిస్థితి ఏమిటో చూద్దాం."

"సరే, అలాగే చేద్దాం."

# 12

నేను ఝుగమాని పిలిచి "ఆ కోతి ఎక్కడ ఉన్నాడు? ఎక్కడ ఉన్నాసరే, వెంటనే అతనిని పిలుచుకురా" అని చెప్పాను.

ముళ్ళుగల గులాబిరంగు బొణాక్రను టకటకలాడిస్తూ 'అతడు' రానేవచ్చాడు. బాగా ముతక పంచె ధరించాడు నడుముకు వెడల్పాటిదుప్పటి చుట్టాడు. పొడవుగా మోకాళ వరకు వచ్చే లావుపాటి ఉన్ని మేజోళ్ళు తొడిగాడు. ఎర్ర గళ్ళ పొడవైన కోటు వేసుకొని దానిమీద చేతులులేని ఆకు పచ్చరంగు చిన్నకోటు ధరించాడు. నెత్తిమీద రష్యన్ బొచ్చుటోపీ ఉంది. బహుశా వీటిని పాతసామాన్లు అమ్మే చోట కొని వుంటాడు. అనుకోకుండా అప్పటికప్పుడు తగిలిన దెబ్బకు నిదర్శనంగా ఎడమచేతి బొటన వ్రేలికి గుడ్డపీలిక చుట్టిఉంది అతడు ధరించిన ఆ చెప్పుల ధ్వని సందుమూల

నుంచే విన్పిస్తూ ఉండేటట్లుంది. దట్టమైన కనుబొమ్మల క్రింద ఉన్న కళ్ళు రెండూ మంత్రించి నిలబెట్టిన రెండు బులెట్లవలె కన్పిస్తున్నాయి.

వచ్చీరావటమే ప్రారంభించాడు- "ఏమిటి సంగతి! దంతాల గట్టికోసం ఎండు బఠానీలు తింటూ కూర్చున్నాను. ఇంతలో ఝుగడూ వచ్చి బయలుదేరేవరకు నన్ను వదలలేదు 'బాబుగారి కళ్ళు నిప్పులవలె ఎర్రగా ఉన్నాయి డాక్టరును పిలవాలేమో' అని చెప్పాడు అందుకని అటునుంచే పరుగు పరుగున గొల్లవాని ఇంటికి వెళ్ళి కుండనిండుగా గోమూత్రం తెచ్చాను. మాదిగవాని కత్తివరలో నుంచి ఒక్కొక్కచుక్క వేస్తే కళ్ళు శుభ్ర పడతాయి."

"నా చుట్టుపట్ల నువ్వు ఎక్కడ ఉన్నాసరే, నువ్వు ఉన్నంతవరకు నా కళ్ళ ఎరుపు ఎంతమాత్రం తగ్గదు తెల్ల వారినది మొదలు మీ పేటలోని నీ ప్రియ శిష్యులందరూ ముండికేసి మా వాకిట కూర్చొని ఉన్నారు."

"ఇందులో మీరు చలించునంత కారణం ఏముంది?"

"నువ్వు ఉండగా వేరే కారణమేదీ అవసరంలేదు. మీ శిష్యుడు కింసారి మున్షీ ఉన్నాడే వాడిముఖం చూడటమే పాపమనుకుంటారు ప్రజలు. అతను ఈమధ్య మీ డాబామీద కూర్చొని చెవులు చిల్లులు పడేట్లు బిగ్గరగా వీరశంఖం పూరి స్తున్నాడట ఏమిటి? ఆ సందులో చెడిపోయిన వాళ్ళందరినీ గంజాయిదమ్ము ఆశపెట్టి గుంపుగా చేరుస్తున్నాడట - అంతి టితో ఆగక అందరూ కలిసి అరవటం అభ్యాసం చేస్తున్నా రట నిజమేనా? అది భరించలేక పేటలోనుంచి తామైనా

వెళ్ళిపోవాలి లేదా కంసారి ముష్టి సైన్యమేనా వెళ్ళిపోవాలని పేటలోని పెద్దమనుష్యు లందరూ చెపుతున్నారు."

మహదానందంతో 'అతడు' ఎగిరి గంతేసి, బిగ్గరగా అరుస్తూ "ఉందాలు, నిరూపించ గలిగాం!" అని అన్నాడు

"ఏమిటా నిరూపించినది?"

"అపస్వరంలో కూడా దుర్భరమగు బలం ఉన్నట్లు నిరూపించాం అపస్వరంలో నుంచి అజేయమగు వేగం బయలుదేరింది. దానితో పేటలోని వారి నిద్రఎగిరిపోయింది. సుఖశాంతులు తోకముడిచి పారిపోయాయి. ఎటుచూచినా "పారిపోండి, పారిపోండి" అనే ధ్వనే విన్పిస్తుంది. ఇది ప్రచండమగు అసురశక్తి ఒకేఒక్క వూపుతో స్వర్గంలోని సజ్జనులకు అర్థమయింది. ప్రశాంతంగా కూర్చొని అర్థనిమీలిత నేత్రాలతో అమృతం సేవిస్తున్నారు గంధర్వగురువులు భుజాన తాంబూర పెట్టుకొని అతిజాగ్రత్తగా వసంతరాగాన్ని అలాపిస్తున్నారు. అప్సరసలు కాళ్ళకుగజ్జెలుకట్టి లయబద్ధంగా అడుగులువేస్తూ నృత్యంచేస్తున్నారు ఇక ఇక్కడ మృత్యువును వరించి నీలాంధకారంలోబడి మూడు యుగాలనుంచి అసురులు రసాతల గృహంలో కూర్చొని చీకట్లోవిన్పించే దోమల సంగీతంవలె లయహీనంగా అపస్వరాన్ని సాధనచేస్తున్నారు. చివరికి ఒకనాడు శని, కలి ఇద్దరూ కలిసి సిగ్నలు ఇచ్చేశారు. అలాపన ననుసరించి లయబద్ధంగా వూగే తలలమీద, హుంకార క్రేంకారఝుంకార ధ్రుమకార ద్రుమకార గడగడ గడాత్కారఘోష పెడుతూ అపస్వరసంగీతసాధక అసురసైన్యం విరుచుకు పడింది తీవ్రమగు అపస్వర నూనె పకోడీల మంటకు

తట్టుకోలేక 'తాతగారూ, తాతగారూ,' అంటూ అరుస్తూ బ్రహ్మదేవుని భవనంలోకి వెళ్ళి తలదాచుకున్నారు. నీకు నేను చెప్పవలసిందేముంది. సమస్తశాస్త్రాలు నీకు తెలిసినవే!"

"తెలిసినవే కాదు, ఇవాళ నువ్వు చెపితే విని తెలుసుకున్నాను."

వృద్ధసోదరా, నీదంతా పుస్తకాలు చదివిన జ్ఞానం-జరుగుతున్న వాస్తవ విషయాలు నీ చెవిదాకా రావు. నేను స్మశానాలలోనూ గోరీలవద్దనూ తిరుగుతూ వుంటాను. కొన్ని నెలల పర్యంతం సాధకుల అరికాళ్ళకు విరేచన శక్తిగల ఆము దాన్ని మర్దనచేసి ఇలాంటి నిగూఢ తత్త్వాన్ని తెలుసుకొంటాను. మా ఉత్కటదంతీ గురువుగారి గుహలాంటి నోటి నుంచి అపస్వర తత్త్వాన్ని గురించి చాలా సంగతులు తెలుసుకున్నాను."

"అపస్వర తత్త్వ జ్ఞానాన్ని నువ్వు చాలా త్వరగానే పొంది వుంటావని నేను గ్రహించాను."

"వృద్ధసోదరా, నేను గర్వపడే విషయం ఇదే. పురుషునిగా జన్మించినంత మాత్రాన ఎవరూ పురుషులు కాలేరు పురుషత్వ ప్రతిభ ఉండాలి అతనిలో. ఒకనాడు మా గురువుగారి అతి అపూర్వమగు విశ్రీముఖం నుంచి-"

"గురువుగారి ముఖాన్ని మేముశ్రీముఖంఅనిఅంటాము. నువ్వు విశ్రీముఖం అంటావేమిటి?"

"గురువుగారి ఆజ్ఞ. శ్రీముఖం అనే శబ్దం స్త్రీలు మాట్లాడేదని వారి ఉద్దేశ్యం. విశ్రీముఖం అనేశబ్దంలోనే పురు

షుని గౌరవం అంతా వ్యక్తమవుతుంది. అతనిబలంఆకర్షణలో లేదు, విప్రకర్షణలో ఉంది మీరు అంగీకరిస్తారా లేదా?"

"అంగీకరించక తప్పని పరిస్థితిలో పడిన దురదృష్టవంతుడు అంగీకరించక తప్పదుగదా!"

"మధురరసంవల్ల మీరా వూగిసలాట బాగా బలపడింది. కఠోరసత్యం మీకు రుచించదు. మీలోని ఆ బలహీనతను మొదలంటా పెకలించి పారేయాలి. మీలోవున్న బలహీనత వల్లనే సురుచి అని అందమైన పేర్లుపెట్టుకుంటారు. 'విశ్రీ' అనే శబ్దాన్ని భరించే శక్తికూడా మీలో ఉండదు."

"బలహీనత అనేది బలమైనదానికంటెకూడా లోతుగా పాతుకొని ఎక్కువ దృఢంగా ఉంటుంది. అందుకని దానిని పెకలించి వేయుటం చాలా కష్టమైనపని. సరే, విశ్రీ తత్త్వాన్ని గురించి మీ గురువుగారు చెప్పినది చెపుతున్నావుగదూ, తరువాత చెప్పు!"

"గురువుగారు ఒకేసారి ఆదిపర్వంనుంచి వ్యాఖ్యానం ప్రారంభించారు. మానవ సృష్టి ప్రారంభంలోనే చతుర్ముఖుడు గడ్డము మీసాలు తీసివేసిన తన ముందు ముఖాలు రెండిటినుంచి సున్నితమైన స్వరాలు పలికించాడు. కోమలమగు ఋషభంనుంచి మధుర ప్రవాహపు ఆనందకరమగు గమకం నుంచి రానురాను నిషాదం వరకు జారిపడ్డాయి. ఆ సుకుమార స్వర తరంగము ప్రభాత కాలపు అరుణవర్ణ మేఘాల మీద ప్రతిఫలించి తీయని గాలుల వూయలలో హాయిగా వూగసాగింది. ఆ అలలలో ఊగుచున్న నృత్య ఛంద

స్సులో రూపాన్ని పొంది కన్పించినదే స్త్రీ. స్వర్గంలో వరుణదేవుని భార్య శంఖం పూరించింది."

"వరుణదేవుని భార్య ఎందువల్ల?"

"ఆమె జలదేవతగదా! స్త్రీజాతి విశుద్ధజలమువంటి వారు. వారిలో కాఠిన్యమనేదే ఉండదు. చంచలమైనవాళ్ళు చలింపచేస్తారు భూమి పుట్టటానికి ముందు ప్రారంభంలో అంతా మహాజలరాశి గదా! ఆ నీటిలో నీటికాకుల వీపుమీద కూర్చొని స్త్రీలు నావికులపాటలు పాడుతూ విహరించేవారు."

"చాలా బాగుంది! అయితే, అప్పటికే నీటికాకుల సృష్టిజరిగిందన్నమాట?"

"నిస్సందేహంగా. పక్షుల కంఠాలనుంచే మొట్టమొదట స్వరసాధన ప్రారంభమయింది. బలహీనతకు, మాధుర్యానికి అవిచ్ఛిన్న సంబంధం ఉంది. ఈ తత్త్వపు మొదటి పరీక్ష ఆ జలహీన జీవుల కంఠాలద్వారాను, రెక్కల ద్వారాను జరిగింది. మీకు కోపం రాదంటే మరొక సంగతి చెప్తాను."

"కోపంరాకుండా ఉండాలని ప్రయత్నిస్తాను."

"యుగాంతరమందు సృష్టికర్త మానవ సమాజంలో బలహీనతనే మహిమాన్వితమైనదిగా నిరూపించు పనిలో కవులను సృష్టించినప్పుడు ఈ పక్షులను చూచేవారికి వాటి నమూనాలో కవుల్ని సృష్టించాలనే ఆలోచన కలిగింది సాహిత్య సభల పద్ధతిలోనే ఆ రోజున సృష్టికర్త సభామండప కార్యక్రమమంతా జరిగింది. సృష్టికర్త స్వయంగా।అధ్యక్షపీఠనుంచి కవులను ఆహ్వానించి వారితో 'మీరు మనోలోకంలో

శూన్యంలో ఎగురుతూ ఉండండి. క్షణక్షణం కారణం లేకుం డానే ఛందస్సులో పాటలు పాడుతూ ఉండండి. దానివల్ల బలిష్ఠమైనది, కఠోరమైనది కరుణతో కరిగి శిథిలమైపోతుంది. ఓ కవిసమ్రాట్, తెలిసిందా ; నేటివరకు నువ్వు ఆ మార్గం లోనే నడుస్తున్నావు "

"ఈ రూపం మారనంతవరకు అలాగే నడవక తప్పదు."

"ఆధునికయుగం ఎండి గట్టిపడుతూ ఉంది. మైనం లాంటి మెత్తనిరూపాలు ఇప్పుడు లేవు. మనోహరమగు బల హీనత వల్ల పృథ్వి అతలంలో నిమగ్నమై ఉన్నప్పుడు, స్త్రీ దేవత నీటిలో నివసిస్తూ కమలపుష్పముల వూయలలో వూగుతూ ఉండేది – ఇప్పుడు ఆ రోజులు తిరిగిరావు."

"సృష్టి ఆ సుకుమార ఛందస్సులోకి వచ్చి ఎందుకు ఆగిపోయింది ?"

"రెండు మూడు యుగాలు గడిచీ గడవకముందే ధరణీదేవత చతుర్ముఖునికి తన కష్టగాథను వివరిస్తూ విజ్ఞాపన పత్రం పంపుకొంది." లలనామణుల ఈ లకారాధిక్యతగల లాలిత్యాన్ని భరించలేకుండా ఉన్నాను. స్త్రీలు తమకుతామె కరుణాభరిత కల్లోలములతో 'మాకేమీ నచ్చటంలేదు' అని ఘోషిస్తున్నారు. 'మీకు నచ్చనిదేమిటి ?' అని ఊర్ధ్వ లోకం నుంచి ప్రశ్న వినిపించింది. సుకుమార సుందరీమణులు 'ఏమిటో చెప్పలేము' అని జవాబు చెప్పారు. 'మీకు ఇప్పుడు కావలసిందేమిటి ?' అని మళ్ళీ ప్రశ్నించారు. 'మాకు కావలసిందేమిటో, అది కూడా తెలుసుకోలేక

పోతున్నాం' అని చెప్పారు. అని ధరణీదేవత చతుర్ముఖునితో మొరపెట్టుకుంది.

"మొత్తం పేటనంతా ఎదరించే గయ్యాళిస్త్రీల అభిప్రాయం అందులో వ్యక్తం కాలేదా? అది చెప్పిన వాళ్ళందరూ మంచి వాళ్ళైనా ఏమిటి?"

"కలహానికి తగిన కారణం ఏదీ కన్పించనందువల్ల వాక్య బాణాల టంకారం అతలంలో మునిగివుంది. చీపురు కట్టలకు పనితగలక దుబ్బులుదుబ్బులుగా పెరిగిపోతున్నాయి"

"ఇలాంటి ఘోర దుర్వార్త విని బ్రహ్మదేవుడు చాలా సిగ్గుపడి ఉండాలి."

"నిజంగానే చాలా సిగ్గుపడ్డాడు సిగ్గుతో నాలుగు తలలు వంచుకున్నాడు. కోటి యోజనముల దూరం వ్యాపించిన రాజహంస రెక్కలమీద బ్రహ్మ నిశ్చేష్టుడై కూర్చున్నాడు. ఇక ఇక్కడ ఆదికాలపు లోకవిదితమగు పరమసాధ్వి, ఆడనీటి కాకి వరకు. పరిశుభ్రతలో బ్రహ్మదేవుని రాజహంసను మించిపోవాలనే సాధనలో వెయ్యి సార్లు నీటిలో మునిగి ముక్కులతో మాటిమాటికి పొడుచుకొని తమ రెక్కలను ఎండిపోయిన కొమ్మలవలె చేసుకున్నాయి – చివరికి అవి కూడా బ్రహ్మదేవునితో "ఎక్కడ చూచినా పరిశుభ్రతే ఉన్నప్పుడు శుభ్రతలో ఉండే అత్యంత ప్రధానమైన ఆనందం లభించదు గదా, ఇతరుల దోషాలను ఎత్తిచూపించటం, వారి మీద నాలుగురాళ్లు వేయటం మొదలగునవి ఏవీ చేయలేము అలాంటప్పుడు పరిశుద్ధత్వంలోని ఆనందం ఏముంటుంది? ఓ, సృష్టికర్తా, మాకు

మాలిన్యం చాలా అవసరం. చాలా ఎక్కువ పరిమాణంలో, అతి త్వరగా వేగంగా మాలిన్యాన్ని మాకు అందించండి" అంటూ ప్రార్థించాయి. వాటి ప్రార్థన వినగానే బ్రహ్మ దేవుడు ఎగిరి గంతేసి 'పొరపాటే జరిగింది. ఇప్పుడైనా దానిని సంస్కరించాలి' అని అనుకున్నాడు అమ్మాబాబోయ్, బ్రహ్మదేవుని కంఠస్వరం ఎంత భయంకరంగా ఉంది! అక స్మాత్తుగా దుర్గాదేవి మహాసింహం శివుని మహావృషభం మీదికి దుమికినప్పుడు ఈ రెండింటి భయంకర గర్జనలవల్ల ద్యులోకంలోని నీలమణి గోడ పగిలిపోయింది ఆ ధ్వని విని ఆనందించటానికి విష్ణులోకంనుంచి నారదమహర్షి పరుగు పరుగున అక్కడికి వచ్చాడు. అతడు తన తాంబూరబుర్ర విప్పుతట్టి "అమ్మాయీ, భావిలోకపు అపస్వర ప్రపంచ ఆది మంత్రాన్ని ఇప్పటినుంచే వింటూ ఉండు అవసరమైనప్పుడు ఇళ్లు పడగొట్టటానికి కూడా ఉపయోగపడుతుంది' అని చెప్పాడు."

విక్షుబ్ధ బ్రహ్మదేవుని నాల్గు కంఠములనుండి ఏకనా దంగా వెలువడిన స్వరానికి దిగ్గజములు కూడా తొండములు పైకెత్తి ఘీంకారము చేశాయి. ఆ భయంకర శబ్దవేగానికి దిక్పాలకుల భార్యల జుట్టుముడులు విడిపోయాయి. విడిపో యిన వారి జుట్టు తాకిడికి ఆకాశము గట్టిపడింది నల్లని తెగ చాప నెత్తుకొని వ్యోమ తరుణియముని స్మశానము వైపు పరుగెత్తినట్లుగా ఉంది ఆకాశం."

"ఏమి జరిగినా, సృష్టికర్త పురుషుడే గదా!"

"వారి పౌరుషం తగ్గలేదు. గడ్డము మీసాలు పెరిగి ఉన్న వెనుకవైపు రెండు ముఖాల ముక్కు-పుటాలు ఎగిరిపడు తున్నాయి. ఆ నాలుగు ముక్కు-పుటాలనుంచి ఒక్కుమ్మడిగా ఆకాశాన్ని వూగించివేసే తుఫాను వీచింది. ఈ బ్రహ్మాండ ములో మొట్టమొదట అజేయమైన శక్తిగల అపస్వర ప్రవా హానికే విముక్తి లభించింది. గోం-గోం-గాం-గాం- భడభడ్ గడగడ్, ఘుడఘుడ్ ఘుఢాంగ్, గంధర్వులందరూ తాంబూ రలు భుజాన పెట్టుకొని ఇంద్రలోకానికి వెనుక వైపున ఉన్న ఆవరణలోకి వ రిపోయారు స్నానంచేసిన తరువాత శచీదేవి అక్కడ పూలమొక్కల నీడలో జుట్టు ఆరబెట్టుకుంటూ ఉంటుంది. ధరణీదేవత భయకంపితురాలై ఇష్టమంత్రము జపిస్తూ 'పొరపాటు జరగలేదు కదా!' అని ఆలోచించసాగింది. తరువాత ఆ అపస్వర తుపాను విసుర్లనుంచి ఫిరంగిగుళ్ళవలె పురుషులు బయటపడసాగారు. 'ఏం, సోదరా, మాట్లాడ కుండా కూర్చున్నావేమిటి! నేను చెప్పేమాటలు అర్థం చేసు కొంటున్నావా?"

"అర్థం చేసుకొంటున్నాను. సరాసరి తుపాకి గుళ్ళవలె మనసులో జొరబడి అర్థమవుతూనే ఉన్నాయి."

"సృష్టియొక్క అత్యంత ప్రధాన పర్వములో అప స్వరానిదే రాజ్యమనే విషయం అర్థమయింది గదా?"

"వివరంగా చెప్పరాదా?"

"ద్రవరూపంలో ఉన్న జలరాశి యొక్క కోమలత్వపు దుర్భర ఏకాధిపత్యాన్ని త్రోసిరాజని, కొమ్ములతో గుచ్చెత్తి, కాలితో తన్ని పిడికిళ్ళతో కొట్టి, చెంపదెబ్బలు

చరిచి, నెట్టుకుంటూ అక్కడక్కడా భూమి తన రాతి తలను పైకెత్తింది భూలోక చరిత్రలో దీనినే అన్నిటికంటె గొప్ప పర్వంగా భావిస్తారు అవునా కాదా చెప్పండి!"

"ఎందుకు అంగీకరించను!"

"ఇంత కాలానికి భూమిమీద బ్రహ్మదేవుని పౌరుషం వ్యక్తమయింది. సృష్టియొక్క కఠోర భూమిమీద పురుషుని చేవ్రాలు పడింది ప్రారంభంలోనే ఎంతటి భీభత్సమల్లయుద్ధం జరిగింది! ఒకప్పుడు అగ్నిలో దగ్ధం కావటం. మరొకప్పుడు మంచులో కూరుకుపోవటం, వేరొకప్పుడు భూకంపపు వత్తిడితో పృథ్వి నోరుతెరుకొని వైద్యుని చేదుతిట్లవలె గానిలో నుంచి పర్వతాలను వెళ్ళగక్కటమూ- వీటిలో స్త్రీ సంబంధమైన దేమీలేదు ఇది అంగీకరిస్తావా లేదా?"

"అంగీకరిస్తాను!"

"నీటిలో కలధ్వని జనించేది, వాయువులో మురళీ రవం విన్పించేవి, సోం-సోం-సోం; కానీ గతిదప్పిన భూమి ఆహ్వానించినప్పుడు భరతముని సంగీత శాస్త్రమును మట్టగించి వేసి పీడా వదిలిస్తుది. అదేమిటి, మీ ముఖం అలాఉందేం, నామాటలు మీకు రుచిస్తున్నట్లులేదు మీరు ఆలోచిస్తున్న దేమిటో చెప్పండి!"

"కళ అనేది మాత్రమే అతిప్రాచీన సత్యమని నేను ఆలోచిస్తున్నాను. దానినే 'ట్రెడిషన్' అంటారు. నువ్వు చెప్పే అపస్వర ధ్వని కళను సత్యమని నిరూపించగలవా?"

"మహాచక్కగా నిరూపించగలను. మీ స్వరకళయొక్క మూల చారిత్రిక సత్యము స్త్రీ దేవత వాద్యయంత్రంలో

ఉంది. అపస్వర పుట్టుకను గురించి మీరు పరిశోధన చేయాలనుకుంటే పౌరాణిక స్త్రీ శాఖను దాటి సరాసరి పురుష దేవుడు జటాధారి ద్వారం వరకు వెళ్ళాలి కైలాసములో వీణ చట్టవిరుద్ధమైనది. అక్కడ నాట్యం చేయటానికి ఊర్వశి బజానా కూడా తీసుకోలేదు. అక్కడ లయ విరుద్ధమగు తాండవ నృత్యం జరుగుతుంది. నంది గండు తుమ్మెదలు రణనినాదమునకు కొమ్ముబూరలు వూదుతూ ఉంటాయి. దేవతలు స్వయంగా నోటితో బమ్‌బమ్ వాయిద్యాలు, డుగ్ డుగాడుగ్ అంటూ డమరుకము వాయిస్తూవుంటారు. కైలాసములోని రాతిగుట్టలన్నీ క్రిందికి దిగబడిపోతాయి. మహా అపస్వరపు అతిప్రాచీన పుట్టుక చరిత్ర ఇప్పుడు స్పష్టంగా అర్థమయిందా మీకు.''

''అర్థమయింది.''

''మరొకవిషయం మీరు గుర్తుంచుకోవాలి. స్వర ఓటమి, అపస్వర విజయము, దీని ఆధారంగానే పురాణములలో దక్షయజ్ఞకథను రచించారు. ఒకానొకప్పుడు దేవతాగణము యజ్ఞసభలో సమావేశమయింది. అందరూ రెండు చెవులకు కుండలాలు, బాహువులకు దండ కడియాలు, మెడలో మణిమాలలు ధరించారు. మహాసౌందర్యము! ఋషులు మునుల శరీరములనుండి కాంతి వెలువడుతూ ఉంది. వారి కంఠాలనుంచి అనింద్య సుందర స్వరంలో మధురమైన సామగానం వెలువడుతూ ఉంది. ఇంతలో అకస్మాత్తుగా విశ్రీ విరూపుని అపస్వర దళం అక్కడికి వచ్చిపడింది. శుచి సౌందర్యాల అందమంతా క్షణంలో ఛిన్నాభిన్నమైపోయింది. విశ్రీ

ఎదుట సుశ్రీ అపజయం. అపస్వర శక్తి ముందు స్వరశక్తి ఓడిపోయింది- ఈ విషయాన్ని పురాణాలలో మహదానం దంగా కీర్తించారు. మహా అట్టహాసంగా దానిని వర్ణించారు. 'ఆనందమంగళం' లోని ప్రతిఘటలోనూ ఇది కన్పిస్తూనే ఉంటుంది చూశారా, అపస్వర కళకు శాస్త్రసమ్మతమైన సత్యం ఇదే. మరొక నిదర్శనం - ముందుగా మనం బొజ్జ గణనాథుని పూజ చేస్తూ ఉంటాము అది కూడా నేత్రా నందం కల్గించే దుర్బల లలిత కళకు విరుద్ధంగా గొప్ప 'ప్రొటెస్ట్'. వర్తమాన యుగంలో గణనాథుని తొండమునే పొగ గొట్టము రూపంలో సృష్టిచేసి పాశ్చాత్య వ్యాపార యజ్ఞశాలలో బ్రూం ధ్వనిని కల్గిస్తున్నారు. గణనాయకుల యొక్క కుత్సిత అపస్వర బలంవల్ల వారు సిద్ధిలాభం పొందుట లేదా? మీరే ఆలోచించండి."

"ఆలోచిస్తాను."

"అప్పుడు మరొక విషయాన్ని తప్పకుండా ఆలోచించండి. అపస్వర మహత్యం కఠినమైన స్థలంలోనే ఉంది. సింహంగానీ, పులిగానీ లేదా వృషభమే కావచ్చు వాటితో సగర్వంగా వీరపురుషుల్ని పోల్చవచ్చు ఇలాంటివాళ్ళెప్పుడూ గురువులవద్ద స్వరసాధన చేయలేదు. ఈ విషయంలో మీకేదైనా సందేహం ఉన్నదా?"

"ఏమీ సందేహంలేదు."

"మీకు అంతవరకు అవసరంలేదు. భూమి మీద అధమ పశువు గార్ధభము ఉన్నదికదా, అది బలహీనమైనదే కావచ్చు. కానీ ఎన్నడూ అది సరస్వతీదేవి కొలువులో

సాధన చేయనేలేదు- ఈ విషయం దాని శత్రువులు,మిత్రులు అందరూ అంగీకరించేదే."

"అవును, అంగీకరిస్తారు."

"గుర్రము మనిషియొక్క పెంపుడు జంతువుగదా, గట్టిగా తన్నగల గిట్టలున్నప్పటికీ అది కొరడా దెబ్బలు తిన లేక చస్తుంది. గుర్రాల శాలలో తిన్నగా నిలబడి అది ఝుం ఝుటఖామాచి రాగం ఆలాపించాలి అవి చిం హిం హిం-చిం హిం హిం అంటూ నురుగులు కక్కుతూ అర్ధానుస్వార బిందువును వర్ణించవచ్చు. కానీ అపస్వర అనునాసికాన్ని గౌరవించటం మర్చిపోవు. మరి గజ రాజు? వారిని గురించి చెప్పకోవటమే మహా గొప్పసంగతి ఆదిశంకరునివద్ద పొందిన ఈ స్థల చరములలో కోకిల కంఠం ఒకటైనా చూపించ గలవా? అందాకా ఎందుకు, మీ పెంపుడు కుక్క బుల్‌డాగ్ విషయం చూడండి. అది తన చీత్కారముతో పేటలోని వారికి నిద్రాభంగం కల్గిస్తూ ఉంటుంది బ్రహ్మదేవుడు దాని మీద దయతలచిగానీ, లేదా ఎగతాళికోసమో దానికిమురళీ రవంలాంటి కంఠస్వరాన్ని ఇచ్చిఉంటే అది అలాంటి మధుర మగు అసహ్య కంఠస్వరం లభించినందుకు ఏ కారు క్రిందనో పడి ప్రాణ త్యాగంచేసి ఉండేదని నేను పందెంవేసి చెప్ప గలను. ఒక విషయం అడుగుతాను, నిజం చెప్పండి- బలివ్వ టానికి తీసుకువెళ్ళే మేక కర్కశంగా 'బ్యా బ్యా' అనకుండా రామనామ సంకీర్తన విన్పించేట్లయితే దానిని మీరు జగ న్మాత ఆలయంనుంచి బయటకు తెస్తారా లేదా?"

"బయటకే తీసుకువస్తాం."

"అయితే, మేము ఎంత గొప్ప వ్రతాన్ని పూనామో దాని సార్థకత ఏమిటో మీరు గ్రహించే ఉంటారు. మేము అపస్వరమంత్రదీక్ష పొందిన కిరినస్థల శాక్తేయ సంతానము. సగము చచ్చినట్లు పడియున్న దేశమునకు చికిత్సలో చరమ ముష్టియోగాన్ని ప్రయోగించ దలచాము జాగృతిని,బలాన్ని కోరుతున్నాం. పేటలో జాగృతికలిగింది. దానికి నిదర్శనంగా నా శిష్యగణము వీపులమీద ఇరుగు పొరుగుల బలము దమ దమ ఘోషతో భయంకరముగా కన్పిస్తూనే ఉంది. బ్రిటిష్ సామ్రాజ్య సంరక్షకులు సైతం చలించారు, అధికారులు ఆందోళన చెందసాగారు."

"మీ గురువుగారు ఏమంటారు?"

"వారు మహదానందంలో నిమగ్నులై ఉన్నారు. సమస్త జగత్తులో అపస్వరపు నూత్నశకం ఆరంభమైనట్లు వారు దివ్యదృష్టితో చూస్తూనే ఉన్నారు. సభ్యజాతులన్నీ నేను 'అపస్వరమే వాస్తవమనిదానిలోనే పౌరుషమునిండివున్న దనీ, స్త్రీసహజమగుస్వరస్వభావమే సభ్యతనుబలహీనపర్చినదనీ అంగీకరిస్తున్నాయి. దేశపద్ధతులలో ఆరోహణ మెట్లగుండా అపస్వర తత్త్వం పైకిపోతూనే ఉంది. దీనిని మీరు గమనించ లేదా?"

"గమనించే అవకాశం మాత్రం ఎక్కడ లభించింది? వీపుమీద దమదమ గుద్దులతాళం పడుతుందిగదా!"

"ఇటు లయవిరుద్ధ పంచవింశతిక సాహిత్యశిరోభాగాన ఎక్కికూర్చుంది. ఆనందించు సోదరా, ఆనందించు. వారిని వెంటబడి తరుముకొని వస్తున్నామని హెచ్చరించు."

"అదంతా నేను చూస్తూనే ఉన్నాను. వెంబడించటంలో మనదేశం ఎప్పుడూ వెనకబడలేదు."

"ఇటు గురువుగారి ఆదేశానుసారంగా మేము అపస్వర మంత్రసాధనకు మహాకోలాహల సంఘాన్ని స్థాపించాము మా సంఘంలో ఒక కవిగారు కూడా వచ్చి చేరారు. వారి ముఖాన్ని చూడగానే నవయుగం మా ఎదుట సాక్షాత్కరించినట్లే భావించుకున్నాము. అతని కవిత్వాన్ని వినేసరికి మా కున్న భ్రమ తొలగి అతడు నీకు తగిన శిష్యుడని తేలిపోయింది. ఛందోరీతుల్ని తుత్తునియలు చేయవలసిందిగా మేము అతనితో అనేకసార్లు చెప్పాము. 'అర్థమనర్థం చింతయ నిత్యమ్' అని చెప్పాము. శబ్దాలయొక్క అర్థాన్ని గౌరవించటంవల్ల జ్ఞానిసబుద్ధి మాత్రమే అలవడుతుందని కూడా నచ్చచెప్పాము. ఏమీ ఫలితం కన్పించలేదు, పాపం అతని దోషమేమీ లేదు. ముచ్చెమటలు పోసేట్లు శ్రమపడినా సభ్యకావ్య ధోరణిని అతడు అధిగమించ లేక పోయాడు. అతనిని పరీక్ష అధీనంలో అలా వదలివేశాం. మా సంఘ సమావేశంలో అతడు మొట్టమొదట చదివిన గేయాన్ని విన్పించమంటారా? పాడలేనుగనుక మామూల్గా చదువుతాను."

"అందుకనే నిన్ను నేను ఇంట్లోకి అడుగు పెట్టనివ్వటానికి సాహసించలేను."

"అయితే, సావధానంగా వినండి."

"ఇది మన పేట కోలాహల సంఘమురా,
ఇక్కడ 'ఆఁ ఆఁ ఆఁ' అని రాగాలు వద్దురా!
ఓ గాయక సోదరులారా నమస్కారమయ్యా,

పాదపూజ చేస్తాము - మా మాట ఆలకించండయా!
సా-రే-గా-మా-పా-ధా-నీసా-,
రాగ-రాగిణి, అన్నా చెల్లెలు,
కోమలమూ కఠోరములకు
సమమూ బేసములకు
యుద్ధము రగిలెను భయంకరముగా!
సితారా తంత్రులు తెగి,
తబలా తప్పెట చర్మం పగిలి
లయ తప్పెను మృదంగ శబ్దం!
కోలాహలము హెచ్చి కల్లోలమైనది!
పెచ్చుపెరిగెను హెచ్చుగా మోసాలు,
గొంతుచించుకుని జనులు గోలచేశారు!
ఇది నీ సంఘం, ఇది నీ లక్ష్యం,
లయవిరుద్ధ అపస్వర నృత్యం
ధాఁ దాఁ దాఁ లేవరా! ॥ఇది॥

కోలాహలసంఘ గౌరవసభ్యులందరూ అనేకరాగాలలో "ఇంకానాఇకపై సాగదు! ఇంకాఇంతవరకుకులమతాలమోహం వదలలేదు శుద్ధాశుద్ధమనే విచక్షణ రోగం తగ్గలేదు, నాడి మందంగా ఉంది. మాకుఛందస్సువద్దు, మాకుఛందోవిరుద్ధం కావాలి. ఎవర్నీ ఏనియమాన్నీ లెక్కచేయనిస్వచ్ఛందముక్త ఛందస్సు కావాలి మాకు" అని గోలగా అరవసాగారు. మరొకసారి ప్రయత్నించి చూడమని కవిగారికి అవకాశాన్నిచ్చాము.

"మరొకసారి నడుం బిగించి ప్రయత్నించి చూడు సుత్తితో కొట్టి దేశవాసుల చెవుల్లోకి గట్టిగా నీ అపస్వర మంత్రాన్ని ప్రవేశపెట్టు గట్టిగా తన్ని బలప్రయోగంద్వారా అధికారం చలాయించటమే నేడు ప్రపంచమంతటా అమలులో ఉందనే సంగతి గుర్తుంచుకో మన భారతదేశం ఎంత కాలం ఇలా నిద్రాణమై ఉంటుంది?" అని నేను కవితో చెప్పాను.

పాపం, కవి హృదయం మెలితిరిగి పోసాగింది మెలి తిరిగిన హృదయావేదనతో "వీల్లేదు. వీల్లేదు! భారతదేశం నిద్రపోదు!" అని అరిచాడు కలాన్ని పంటితో నొక్కి పట్టుకొని ధనామని పరుగున వెళ్ళి బల్లమీద కూర్చున్నాడు సిద్ధివినాయకునికి నమస్కరించి ఈ విధంగా ప్రార్థించాడు:-
"ఓ సిద్ధివినాయకా, మీరు మీ కళానిధువును అంతఃపురం లోకి పంపివేయండి మీ తొండముతో నా బుద్ధిని గట్టిగా మోదుతూ ఉండండి, నా మాతృభాషలో భూకంపం ప్రారంభం కావాలి. నా కలములో నుండి భగభగమండే అగ్నిధారలు వర్షించాలి. కర్ణకఠోర కావ్యగానపు పిడుగు పాటుకు దేశంలోని ఆ బాల గోపాలం మేల్కోవాలి!"

తరువాత పది పదిహేను నిముషాలకు కవిగారు సత్య దృష్టిలోకి తిరిగివచ్చారు. చీత్కార స్వరంతో చమత్కార చరణాలు వ్రాయనారంభించాడు. కళ్ళు రెండూ ఎర్రబడ్డాయి. ముఖం రౌద్రాకారం దాల్చింది. చెదిరిన జుట్టు అప్పటి కవి గారి రూపం చుండముచ్చటగా ఉంది. అప్పుడు అతడు వ్రాసిన పాట ఇది:-

కొట్టు, కొట్టు, జట్టు కట్టరా,
మట్టిబుఱ్ఱ ఉండనీకురా!
మొండెములను కూల్చరా,
తలలు పగుల గొట్టరా,
వళ్ళు విరగ గొట్టరా!
దేశానికి పుష్టిరా, రారా!
దుడ్డుకఱ్ఱ పట్టిలేవరా!
గట్టిగా సమష్టిగా రారా!
పిడిగుద్దు నేర్వరా,
డొక్క పగుల కొట్టరా!
పన్ను, కన్ను, ముక్కు చెవి
అదరగొట్టి చదును చేయరా!
దేశానికి పుష్టిరా,
నవ్వబోకురా, నలగగొట్టరా!
హరహరా శివశివా
కుప్పిగంతు లేయరా,
అరచి గోలచేయరా,
జట్టుకట్టి, పట్టుబట్టి
మట్టగించి వేయరా!
వేణువును విరగొట్టు
చీత్కారము పెట్టు
వెలుగును మట్టుపెట్టు
అంధకారాన్ని తెచ్చిపెట్టు
పూలమొక్కల్ని పెకలించు

లతలన్నిటినీ నేలగూల్చు
లోకాన్ని కానన మొనర్చు
సౌందర్యాన్ని అంతమొందించు

ఆ పాటవిని నా మతిపోయింది. "చాలు, చాలు, పాటచాలించు. జయదేవుని భూతం ఇంకా ఇంతవరకు నెత్తి మీద ఎక్కి సర్కసు ఫీట్లు చేస్తూనేఉంది. నీరస కవిత్వపు నియమాలు ఇంకా వదలినట్లు లేదు. గయలో దానిపీడ వదిలించుకో దలచినట్లయితే రోకలితో దానినెత్తిన నాలుగు బాదు. పిండి పిండిగా దంచి దానిని నామరూపాలు లేకుండా చేసి దానిమీద ఇంత ద్రావకం కూడా చల్లు" అని నేను కవిగారితో చెప్పాను.

కవిగారు నాకు నమస్కరించి "అయ్యా, అది నా వల్ల కాదు. ఇందులో నాకు మీ సహాయం చాలా అవసరం" అని అన్నాడు.

"'సప్రేతభూమి' మొదలగు కొత్తమాటలు నీ గేయంలో దొర్లినందుకు చాలా సంతోషిస్తున్నాను. ముందు ముందు చాలా అభివృద్ధిలోకి రాగలవనే ఆశ కూడా కలుగుతుంది. 'డిక్షనరీలో నుంచి ఆ శబ్దాన్నే నువ్వు చించుకున్నావు. దాని అర్థంకాస్తా భూమి అడుగున ఉండిపోయింది. ధ్వనిరణ విగ్రహం కొమ్మ ఆధారంగా మాత్రమే నిలచివుంది. నేను పీటన్నింటినీ ఎలా ఛిన్నాభిన్నం చేసి నిరాశ్రయంగా చేస్తానో చూడు- అప్పుడు సాక్షాత్కరించే స్వరూపం ఎలా ఉంటుందో కూడా గమనించు-"

అరెరే లేరా రారా!
వదరుబోతా, గడసరివాడా!
గండరి గండా రారా!
బడబడ బడబడ
పట్టిఈడ్వరా!
గిర గిర గిర గిర
కర్రతిప్పరా
ఛాణాకర్ర
ధనా ధన్!
బిర బిర బిర బిర
రయమున రారా!
రామచంద్రుడా!
గోపీకృష్ణా,
గంగాధరుడా
పీతాంబరుడా
వెంకట సుబ్బా
తడతడ తడాతడ్, తడతడ తడాతడ్
ఖట ఖట మచ మచ
ఫడఫడ ఫడాఫడ్
హోహో హుూహుూ హోహో
రారా వీరా లేరా రారా!

"వృద్ధసోదరా, దీనిలో నేను కవిత్వాన్ని ఎక్కడా అనుకరించ లేదు. అలా అని నువ్వు నా కొక సర్టిఫికెట్టు ఇవ్వాలి."

"దానిదేముంది, సంతోషంగా ఇస్తాను."

"నువ్వీ నవయుగాన్ని గురించి ఒక మహాకావ్యం వ్రాయాలి, సోదరా!"

"వ్రాయగలిగితే తప్పకుండా వ్రాస్తాను. విషయం ఏమిటి?"

"అపస్వరహిడింబ దిగ్విజయం"

"ఎలా ఉందిది?" అని పాపక్కను అడిగాను.

"నాకు ఇదంతా చాలా గొడవగా ఉంది" అని జవాబు చెప్పింది పాపక్క.

"అంటే?"

"అంటే, సురాసురుల యుద్ధంలో అసురుల విజయం నాకు అంత చెడుగా ఎందుకు కన్పించలేదా అనే ఆలోచిస్తున్నాను. ఆ పల్లెటూరి విశ్రీ తరఫునే మాట్లాడాలని కుతూహలంగా ఉంది."

"అవును, అలాగే ఉంటుంది. నువ్వు స్త్రీ జాతికి చెందిన దానవు కావటమే అందుకు కారణం. అన్యాయాలు భరించే మోజు తగ్గలేదు. కొట్టగలిగిన శక్తిని ప్రత్యక్షంగా చూచి దెబ్బలు తినటంలోనే మీ స్త్రీ జాతి ఆనందం పొందుతుంది."

"నేనిప్పుడు క్రూరమగు అలాంటి ఆక్రమణ ఇష్టమూ కాదా అనేది చెప్పలేను. కానీ భీభత్సాకృతిలో పిడికిలి బిగించి నిలిచే పౌరుషం నాకు 'సబ్‌లైమ్' గా అనిపిస్తుంది."

"అయితే, నా అభిప్రాయం కూడా విను. దుశ్శాసనుని గర్వము పౌరుషం కాదు. పైగా ఇందుకు పూర్తిగా

విరుద్ధమైనది నేటి వరకు పురుషుడే సౌందర్యాన్ని సృష్టించాడు. అపస్వరంతో యుద్ధంచేశాడు. ప్రపంచంలో ఇవాళ అందుకు ఎన్నోనిదర్శనాలు ప్రతిచోట కన్పిస్తూనే వున్నాయి.

# 13

నేను తనను అవమానించానని పాపక్క భావించింది. సాయంత్రమయింది. ఆమె నా దగ్గరే పడక కుర్చీలో కూర్చొని ఉంది. ముఖం అటుకేసి త్రిప్పి "నా పేరుమీద మీరు ఇష్టం వచ్చినట్లు ఎప్పుడూ ఏవో కుర్రతనపు చేష్టలు చేస్తున్నారుగదా, దీనివల్ల మీకు ఆనందంగా ఉంటుందా?" అని అడిగింది.

ప్రస్తుతం ఆమె మాటలు విని నవ్వటానికి కూడా సాహసించలేక పోతున్నాను. నేను చిన్నపిల్లవానివలె ముఖం ముడుచుకొని ఆమెతో ఇలా అన్నాను - "నీ వయస్సులో ఉన్న వాళ్ళకు అనుభజ్ఞులవలె పెద్దపెద్ద కబుర్లు చెప్పాలని పిస్తూ ఉంటుంది. నా వయస్సులోని వాళ్ళకు ఎముకల్లోని మూలుగు ఇంకా లేతగానే కన్పిస్తూ ఉంటుంది. అందుకని అవకాశం చిక్కిందంటే ఆనందం లేక పోయినప్పటికీ చిన్నతనం కబుర్లే కల్పిస్తూ ఉంటాను."

"కేవలము ఈ ఉద్దేశ్యముతోనే మొదటినుంచి చివరి వరకు బాల్యచేష్టలే చేస్తూవస్తే అలాంటప్పుడు అసలు బాల్యంలోని ఆనందం ఏముంటుంది? చిన్నతనంలోనే లోలోపల ముదిమి కూడా వచ్చేస్తుంది."

"పాపకా, ఈ సారి నువ్వు ఒకమాటలాంటి మాట చెప్పావు. చిన్నపిల్లవాని దేహంలో కూడా గట్టి ఎముకలు ఉంటాయి. ఆ విషయాన్ని నేను మర్చిపోయా ననుకొంటు న్నావా?"

"మీ వాగుడు వింటూంటే నేను చిన్నదానినిగా ఉన్నప్పుడు ఎగతాళిచేసి ఆనందించ కలిగింది ఇక మరేదీ లేనేలేదా అనిపిస్తూ ఉంది"

"ఏదైనా ఒక ఉదాహరణ చెప్పు"

"కావాలంటే మా మాస్టరుగారినే తీసుకోండి. వారు అద్భుతమైన మనిషి. ఆ అద్భుతంలో మరేమీ కల్తీఉండేది కాదు"

"ఏదీ, వారి విషయం మరికొంత వివరంగా చెప్పు."

"వారు క్లాసులో కూర్చుంటే తానక్కడలేనట్లే శూన్యంలోఉన్నట్లే ఉండేవారు. ఇవాల్టికీ వారి ముఖం నా కళ్ళముందు మెదులుతూనే ఉంది పుస్తకాలన్నీ వారికి కంఠస్థమైనట్లే ఉండేవారు. పైవంక చూస్తూ పాఠం చెప్పుకు పోయేవారు. అప్పటికప్పుడు ఆ మాటలన్నీ ఆకాశంనుంచి ఊడిపడుతున్నాయా అన్నట్లుండేది వారి మాటలు వింటే. మేము క్లాసులో ఉండి శ్రద్ధగా చదువుకోగల శక్తి మాలో పూర్తిగా ఉన్నదనే వారి ఉద్దేశ్యం"

"అంటే మీ ముఖ భావం గ్రహించే అవకాశం వారి కెప్పుడూ కలుగలేదా?"

"అందుకు వారెప్పుడూ ప్రయత్నించనూ లేదు. ఒక సారి శెలవురోజున మాట్లాడాలనే వారింటికి వెళ్ళాను. నేను

లోపలికి ప్రవేశించగానే వారు గాబరాపడుతూ, అంటే నన్నొక పెద్దస్త్రీగా భావించి గబగబ మంచం మీదినుంచి లేచి నిలబడ్డారు."

"ఆలోచన లేకుండా మరీ అంత పొరపాటు చేయటం వారికి అలవాటుగదా!"

"అవును! అలవాటే. అందుకని మీ గడ్డాన్ని చూచి ఖాంజేఖాన్ నవాబుగారి ప్రవేటు శక్రటరీ అని మాత్రం ఎప్పుడూ పొరపాటు పడలేదుగదా! నేను నవ్వులాటగా చెప్పటంలేదు. వారు మీ మిత్రులేగదా,-వారి విషయం మీరే చెప్పండి"

"అతనికి శత్రువు లెవరూ లేరు? కానీ అతని మిత్రులలో తెలివైనవాడిని నేనొక్కడినే. అతని వెర్రిబుర్రను గురించి ప్రజలు చర్చిస్తూ ఉంటే ఆశ్చర్యంతో గుడ్లప్పగించి వింటూ ఉండేవాడు. ఒకనాడు అతడు నా వద్దకు వచ్చి "ఏమయ్యా, మిత్రమా, నేను క్లాసులో పాఠం చెపుతున్నప్పుడు క్లాసువంక చూడనని అందరూ అంటున్నారేమిటి?" అని అడిగాడు.

"నీ మిత్రులు నువ్వు చెప్పే విద్యలో లోపాలు పట్టుకోలేక నీ బుద్ధి దోషాన్ని పట్టుకొంటున్నారు చదువు చెప్పటంలో నువ్వేమీ తప్పులు చెప్పవట, కానీ 'చదువు చెప్తున్నాను' అనే విషయమే మర్చిపోతావని వాళ్ళంటారు-" అని చెప్పాను నేను.

"చదువు చెపుతున్నాను అనే విషయాన్ని మర్చిపోకుండా నేను అసలు చదువు చెప్పలేను. అది కేవలం మాస్టరు

గిరీ చేసినట్లే అవుతుంది. చదువు చెప్పటం పూర్తిగా జీర్ణించుకుపోయింది. దానిని గురించి ఇప్పుడిక విచారమేమీ లేదు."

"జలచరాలు నీటిలో ఈదుతూ ఉంటే మనకు ఆ సంగతి తెలియనే తెలియదు, కానీ స్థలచరాలు ఈదుతూ ఉంటే స్పష్టంగా కన్పిస్తూనేఉంటుంది. నువ్వు చదువుల సరోవరంలో నీటిలోపల నివసించే పెద్దచేపవు."

నేను విద్యార్థుల ముఖాలవంక చూస్తూవుంటే క్లాసు వైపు చూచేదెట్లా?"

"నువ్వు చెప్పే ఆ క్లాసు ఎక్కడ ఉంది?"

"ఎక్కడాలేదు, అందుకనే ఏమీ బాధపడను. విద్యార్థులు- విద్యార్థినుల యందే నా దృష్టిని నిలిపితే క్లాసులోని ఆత్మపురుషుడు నా దృష్టిపథం నుంచి తప్పుకొంటాడు."

"అయితే, 'ఆత్మారామ్ బాబా చదువు' అనేదే నువ్వు మాట్లాడతావా?"

"నేను చదువెక్కడ చెపుతున్నాను? నా ఆత్మారాముని అక్కడ షికార్లు చేయిస్తాను."

"దాని పద్ధతి ఏమిటి?"

"గంగానది ప్రవహించే పద్ధతి ఏమిటో దాని పద్ధతి కూడా అలాంటిదే. ఆ నదికి కుడిఎడమల మైదానాలు, పంట చేలు, స్మశానాలు, పట్టణాలు అనేకం ఉంటాయి. గంగా మాత అడుగడుగునా ఎక్కడ ఏమున్నాయి, వాటి సంగతి ఏమిటి అంటూ ఆలోచిస్తూ కూర్చుంటే సగర పుత్రులు ఈనాటికి కూడా తరించే వారేకాదు. ఎవరికి ఎంత ప్రాప్తమో అంతే జరుగుతుందని కూర్చోకుండా సృష్టికర్తను ఎదిరించి

అంతకంటె ఎక్కువ కావాలని చేసే ప్రయత్నం దానివల్ల ఆగి పోతుంది. నేను మేఘంవలె శూన్యంలో చదువు చెప్పటం సాగిస్తూ ఉంటాను వర్షం కురుస్తూ ఉంటుంది. ఆయా పొలాల సారాన్ని బట్టి పంటలు పండుతాయి. అసంభవ విషయాలు పట్టుకొని నేనెప్పుడూ కుస్తీపట్లు పట్టను. దీనివల్ల మా ప్రధానోపాధ్యాయునికి చాలా కోపం వస్తుంది చదువువలెనే ప్రధానోపాధ్యాయుడు కూడా పరమ సత్యమని భావించటం గొప్ప పొరపాటే కాగలదు."

అందుకు పాపక్క ఇలా అంది- "విద్యార్థుల మనసులలో అనేక సందేహాలు ఉండేవి దానిని ఉద్దేశించి మాస్టరుగారు ఒకనాడు "ఇక్కడ మీ ఎదుట ఉన్న మాస్టరును 'లేదు'గా చేశాను. దీనివల్ల మీరు మానసికంగా అభివృద్ధి సాధించగలుగుతారు" అని చెప్పారు. మరొకనాడు వారు మాస్టరు గిరిలో నేను క్లాసిక్ నైతే సిద్ధుబాబు 'రొమాంటిక్ వాది' అని అన్నారు. మాస్టరుగారు చెప్పింది మేమెవరూ అర్థం చేసుకోలేదని వేరుగా చెప్పనవసరం లేదనుకుంటాను."

"మీ మాస్టరుగారు క్లాసునంతా పైకెత్తినట్లుంది. మరి సిద్ధిబాబు ఒక్కొక్క విద్యార్థిని తన భుజాలమీద ఎక్కించుకొని గోతులు వగైరాలు దాటించేవారన్నమాట. అర్థమయిందా?"

"లేదు, అర్థంచేసుకోవలసిన అవసరం లేదు. మీరు ఆ మాస్టరుగారిని గురించి వివరంగా చెప్పండి. వినటానికి చాలా ఆనందంగా ఉంది."

"అతనిని అర్థం చేసుకోవటం కష్టంగనుక నాకు కూడా ఆనందంగానే ఉంది ఒకనాడు అతడు రాజరికములేని రాజ్యము చాలా గొప్పదని ఎవరో చైనా తత్త్వవేత్త చెప్పా డంటూ నాతో అన్నాడు"

ఆ మాట విని పాపక్క చాలా గర్వంగా "అయితే, మా క్లాసు అన్ని క్లాసులలోనూ గొప్పదనటంలో ఏమీ సందేహం లేదు" అని అంది.

"మీ మంద బుద్ధిని స్పష్టంగా చూడగల నిదర్శనాలు కన్పించినప్పటికీ మాస్టరుగారు దానిని గమనించనట్లుండటమే అందుకు కారణం కావచ్చు" అన్నాను నేను

పాపక్క తలవిదిలిస్తూ "మీరు ఎగతాళి చేస్తున్నారా లేక తిడుతున్నారా?" అని అంది

"నేను అప్పుడప్పుడూ నీ వెనుక నుంచి వెళుతూ జుట్టు పట్టుకొని లాగుతూ ఉంటానుగదా, ఇది అలాంటి స్నిగ్ధజాతికి చెందిన ఎగతాళి. దీనిలో 'కైసస్ బలాయీ' అంటే 'అద్య యుద్ధం త్వియామయా' అనేఅభివ్యక్తి లేదు"

"మాస్టరుగారి ఏర్పాట్లు బాగానేఉండేవి 'మిమ్మల్ని గురించి మీరే జాగ్రత్త వహించుకోవాలి. మీ గురించి జాగ్రత్తతీసుకోవటంనాపనికాదు' అనివారుఅంటూఉండేవారు. రోజూ జరిగే చదువుకు ఫలితం పొందవలసిన బాధ్యతమాదే; మార్కులు ఎలా వేసుకోవాలో తెలిసేది కాదు."

"దానివల్ల కలిగిన ఫలితం ఏమిటి?"

"మార్కులు చాలా తక్కువ వేసుకొనే వాళ్ళం."

"ఎక్కువ వేసుకోవటానికి ఎప్పుడూ ప్రయత్నించలేదా?"

"బయట వాళ్ళెవరైనా వేస్తే ఎక్కువ మార్కులు వేయించుకోవాలనే ఆశ ఉంటుంది. కానీ మనల్ని మనమే మోసగించుకోవటం మూర్ఖత్వమే అవుతుంది. అదీగాక వారెప్పుడూ మా మార్కుల్ని కూడా చూసేవారు కాదు. అందువల్ల మేము అలాంటి ప్రయత్నం అసలే చేయలేము."

"తరువాత?"

"ప్రతిమూడు నెలలకు ఒకసారి మార్కులు హెచ్చుతున్నాయో తగ్గుతున్నాయో లెక్కవేసిచూసుకొనేవాళ్ళం."

"మీ హైస్కూలు మరి అంత సత్యయుగం నాటిదా, అత్యంత హైలో ఉండేదా? మోసంగా మార్కులు ఎక్కువ వేసుకొనే వారెవరూ ఉండేవారు కాదన్నమాట?"

"మాస్టరుగారు నేటికీ చలించే వారు కాదు. ప్రపంచంలో ఒక తరహా జనులు కర్తవ్యమార్గం నుంచి తప్పించుకుంటూ ఉంటారు. కానీ, తమ జవాబుదారీ తమమీదఉన్న వాళ్ళయినా కనీసం పనినుండి తప్పించుకొంటూ ఉంటారు. మా శిక్షకూడా ఈ తరహాకు చెందినదేకాని మరొకటికాదు. ఒకనాడు హాజరువేసే సమయంలో నేను మా ప్రియసఖికి పరసెంటేజి తగ్గుతుందనే భయంవల్ల అబద్ధం చెప్పాను. 'అపవిత్రం జరిగింది. ప్రాయశ్చిత్తం చేసుకోవాలి' అని అన్నారు వారు. తరువాత అది జరిగిందా లేదా అనే విషయంకూడా వారు తెలుసుకోలేదు."

"మరి నువ్వు ప్రాయశ్చిత్తం చేసుకొన్నావా?"

"తప్పుతుందా, చేసుకొన్నాను."

"అంటే, నీపౌడరు డబ్బాను ఆ ప్రియసఖికి దానంగా ఇచ్చి వేశావా?"

"నే నెప్పుడూ పౌడరు ఉపయోగించను."

"ఇప్పుడున్న నీ ముఖం రంగు సహజమైనదేనని చెప్పాలని నీ ఉద్దేశ్యమా?"

"మీరు ఏదైనా అనుకోండి, మీ వద్ద ఎరువు తీసుకొన్నది మాత్రం కాదు. మీ ముఖం రంగుతో పోల్చి చూస్తే అర్థమవుతుంది.

"ఛీ, ఛీ! నా విషయంలో నీ దృష్టికి ఏదైనా భేదబుద్ధి కన్పిస్తే అది మన వంశాన్నే నిందించినట్లవుతుంది మనిద్దరం ఒకే వర్ణానికి చెందిన వాళ్ళం- కనుక ఇక్కడ వర్ణ భేదానికి తావేలేదు. మన చుట్టుపట్ల ఎవరైనా కవిగారు ఉంటే నీ దేహకాంతి బ్రహ్మదేవుని నవ్వులోనుంచి వెలువడిందని వర్ణించి ఉండేవారు."

"మరి మీ రంగు వారి పరిహాసం నుంచి వెలువడి ఉంటుంది"

"దీనినే అన్యోన్యస్తుతి అంటారు. అంటే మ్యూచుయల్ ఎడ్మిరేషన్. బ్రహ్మదేవుని నవ్వు రెండు రకాలైనది ఒకటి దంత్యము, రెండోది మూర్ధన్యము రెండో తరహాకు చెందిన ఆ మూర్ధన్యం నుంచే .నా దేహకాంతి వచ్చింది- దానినే ఇంగ్లీషులో 'విట్' అంటారు."

"అదిసరే; మిమ్మల్ని మీరు పొగుడుకోవటం ప్రారంభిస్తే దానికి ఇక అంతు ఉండదు."

"అదేగదా నాలో ఉన్న ప్రధానమైన గుణం. తనను తాను తెలుసుకొన్న అసాధారణ వ్యక్తులలో నేనొకడిని"

"నోరు తెరిచారంటే ఇక దానికి విసుగూ విరామం ఉండదు, దయచేసి ఆపండి. మనం మాస్టరుగారిని గురించి మాట్లాడుతూ ఉన్నాము. మధ్యలో మీ స్వవిషయం ప్రారంభించారు"

"ఇందులో తప్పేముంది? విషయం మంచిది కావాలి, అంటే ఆసక్తి కలిగించేదిగా ఉండాలి."

"ఇవన్నీ నిత్యం వింటున్న విషయాలేగదా! వీటిని ప్రత్యేకంగా చెప్పుకోవలసిన అవసరమేముంది పైగా, ఇటువంటి విషయాలను మర్చిపోవటం మంచిది."

"అయితే, మాస్టరుగారిని గురించి ఒక కొత్తవిషయం చెప్తాను. విషయం వ్రాసుకోదగినది, శ్రద్ధగా విను. ఒక నాడు మాస్టరు చాలామంది మిత్రుల్ని తన ఇంటికి విందుకు పిలిచారు. ఈ విషయం అసలు వారికి గుర్తున్నదో లేదో తెలుకోవాలని ఉదయం నిద్రలేవగానే వారింటికి వెళ్ళాను. అప్పుడు నౌకరు కన్నయ్యాకు వారికీ జరిగిన సంభాషణ చెప్తాను విను."

"కాళీపూజ కావటంవల్ల బజారులో చేపలధర చాలా హెచ్చుగా ఉంది. అందుకని ఎండ్రకాయలు తెచ్చాను" అని కన్నయ్యా చెప్తున్నాడు మాస్టరుగారితో.

"అతని మాటలువిని మాస్టరుగారు చింతిస్తూ "ఎండ్రకాయల్ని ఏంచేస్తావు?" అని అడిగారు.

"ఎండ్రకాయల్ని సొరకాయ కలిపి పులుసుచేస్తే చాలా రుచిగా ఉంటుంది" అన్నాడు కన్నయ్యా

"మాస్టరుగారూ, పెద్దపెద్ద చేపలంటే మీకు చాలా ఇష్టమా?" అని అడిగాను నేను.

"ఇష్టమే" అన్నాడు మాస్టరుగారు.

"అయితే, మీ ఇష్టాన్ని చంపుకోవాలి."

"ఎందుకని? ఇష్టం అనేది ఎప్పుడూ ఉంటూనే వుంటుంది. కానీ దానిని ఇప్పుడు ఎండ్రకాయలమైనుమీదికి మంటింగు చేస్తాను"

"ఆ విషయంలో మీరు చాలా శ్రమపడాల్సి ఉంటుందేమో!"

"అదేమీ ఉండదు. ఇంతకుముందుకూడా నేను అనేక సార్లు ఎండ్రకాయల పులుసు తిన్నాను అయితే, అప్పుడు దానిమీద అంతగా దృష్టి వుంచలేదు. వాటి పేరు చెపితేనే కన్నయ్యకు నోరూరుతుంది. అతని కోర్కె ననుసరించి ఇష్టం చేసుకొని నేనుకూడా ఎండ్రకాయల పులుసునే తింటాను. అప్పుడు రుచిగానే ఉంటుంది. ఎండ్రకాయల పులుసు అనే మాట క్రింద ఎర్రపెన్సిలుతో అండర్‌లైను చేసినట్లు చెప్పటంవల్ల ఆ మాటను కంఠస్థం చేయటానికి నాకు అవకాశం లభించింది."

తరువాత మాస్టరుగారు కన్నయ్యను చూచి "మరి ఆ రెండు కట్టలు ఏమిటి?" అని అడిగారు.

"మునగకాయలు" అని చెప్పాడు కన్నయ్య.

మాస్టరుగారు సగర్వంగా నా వైపు చూచి "చూచారా! ఇతడు బజారుకు వెళ్ళినప్పుడు ఇవాళ సొరకాయ తెస్తాడేమో అనుకొన్నాను, కానీ అతడు బజారునుంచి మునగకాయలు తెచ్చాడు. ముందు చెప్పకుండా ఉండటంలో ఉన్న సౌకర్యం ఇదే" అని అన్నారు.

"మునగకాయలు తేకుండా ఇతడు పొట్లకాయలు తెస్తే ఏమనేవారు" అని అడిగాను నేను.

అందుకు మాస్టరుగారు చెప్పిన జవాబు ఇది– "అలాంటప్పుడు ఒక క్షణం ఆలోచించాల్సి వచ్చేది. ఆ వస్తువు పేరులో కూడా ఒకవిధమైన ప్రభావం ఉంటుంది. పొట్లకాయ అనే శబ్దం అంత ఆసక్తి కలిగించేదిగా లేదు, కానీ, కన్నయ్యా గనుక వాటిలో మంచివి ఏరి తీసుకువస్తే ఆసక్తి కలిగించుకో వచ్చును. 'ఎలాఉంటుందో చూద్దాం' అని జీవితంలో మొట్టమొదటిసారిగా ఆలోచించే అవకాశమైనా కలిగేది. 'చెడుగా మాత్రం లేదు' అని అనుకోవటం కూడా జరగవచ్చును. పొట్లకాయ అనే పదార్థానికి వ్యతిరేకంగాఉన్నఅంధవైరాగ్యంతొలగిపోవటంవల్ల తినుపదార్థాల సంఖ్య మరొకటికి పెరిగేది. కావ్యాలలోజరిగేది కూడా ఇదేగదా, కవులు వాటిలో తమ అభిరుచుల్ని జొప్పించి మన అభిరుచుల్ని పెంపొందిస్తారు 'సృష్టి' కి అండర్‌లైన్ చేస్తూ ఉండటమే గదా వారి పని."

"మీ అభిరుచుల్ని అభివృద్ధి చేయటంలో కన్నయ్యకు ఇంకా చాలా బాధ్యత ఉండి వుంటుంది!"

"అది నిజమే! అతడే గనుక లేకపోతే నేను తిండిని గురించి కూరల్ని గురించి పట్టించుకొనేవాడనుగాదు. శబ్దమే నన్ను పడత్రోస్తూ ఉంటుంది. ప్రపంచంలో సంస్కార విముక్తే అధికార వ్యాప్తి."

"ఈ మహత్కార్యంలో కిన్నాయా మీకు సహాయ పడుతూ ఉంటాడన్న మాట!"

"అది అంగీకరించక తప్పదు, మిత్రమా! ప్రతినిత్యము అతని కోర్కె సహకారంతో నా కోర్కెలోని అజ్ఞానం విడి పోతూ ఉంటుంది. నేను ఒక్కడినే ఉంటే ఇలా జరిగేది కాదు."

"అర్థమయింది, కానీ కిన్నాయా కోర్కెల హద్దు–"

"అవును, అతని కోర్కెలుకూడా అభివృద్ధిచెందాయి. అతడు తూర్పు బెంగాలునుంచి వచ్చాడు. బటానీ పప్పును గురించి అతడు ఎప్పుడూ విని కూడా ఉండడు. కానీ, ఇప్పుడతడు ఇంగువ తిరుగపోతతో బటానీపప్పు వండుతాడు, అమితానందంగా తింటూ వుంటాడు."

ఇంతలో కిన్నాయా మళ్ళీ అక్కడికి వచ్చాడు. "మీతో ఒక విషయం చెప్పనేలేదు, పెరుగు తీసుకురాలేదు రాత్రిపూట పెరుగు తినకూడదని డాక్టరుగారు చెప్పారు" అని అన్నాడు.

"పెరుగుధర పెరిగిపోయింది" అని చెపితే కోపం వస్తుందేమోననిమధ్య డాక్టరుగారిని సృష్టించవలసి వచ్చింది. ఓదార్చినట్లుగా అతడు "కొంచెం అల్లంవేసి 'లైట్' టీ

తయారు చేస్తాను, చలికాలంలో రాత్రులందు మంచి పని చేస్తుంది" అని చెప్పాడు.

"ఏమండీ, మాస్టరుగారూ, అల్లపు టీ అందరికీ ఇస్తారా?" అని అడిగాను నేను.

"అందరి విషయం నేనెలా చెప్పగలను? త్రాగేవాళ్ళు త్రాగుతారు. వారికి లాభం కలిగితే కలగవచ్చును. త్రాగని వారికి దానివల్ల అపకారం కూడా ఉండదు."

"చైనా తత్త్వవేత్త చెప్పినట్లు మీ సంసారంలో యజమాని ఎవరూ లేరా?" అని ప్రశ్నించాను నేను.

"లేరు."

"అలాంటప్పుడు నౌకరుమాత్రం ఎందుకు?"

"యజమాని అనేవాడే లేనప్పుడు నౌకరు అనేవాడు ఉండనే ఉండడు."

"మీ ఇంట్లో యజమాని నౌకరు భేదం లేకుండా కలిసిపోయి సంయుక్త పదార్థంగా తయారయినట్లుందే?"

మాస్టరుగారు నవ్వుతూ "ఆక్సిజను, హైడ్రోజను కలిసేసరికి వాటిలోని దహన స్వభావం పోయి నీరుగా మారతాయి" అని అన్నారు.

"మిత్రమా, మీరు గనుక వివాహం చేసుకొంటే చైనా సిద్ధాంతం ఈ పేటవదలి పారిపోతుంది. 'గృహిణి ఉండి కూడా లేవు' అనేలాంటి ప్రాముఖ్యత లేని వస్తువు కాదు. ముఖంనిండా ముసుగు కప్పుకొన్నప్పటికీ ఆమె అత్యంత స్పష్టంగా మీ ఇంట్లో ఉంటుంది. ఆమె రాజ్యంలో రాజు పదవి ఆమె కటాక్షము మీదనే వూయల లూగుతూ

ఉంటుంది. ఒకప్పుడు వీపుమీద, మరొకప్పుడు రొమ్ముమీద అనుక్షణం దెబ్బ తగులుతూనే ఉంటుంది."

"అలాఅయితే, భర్త అనే రాములవారు రిటరన్ టిక్కట్టుకూడా కొనకుండా ముసల్మాను వీరుడి డేరాలోకి పారి పోతాడు. ఈస్టరన్ బెంగాల్ రైల్వేమార్గాన భార్యాత్వము తిన్నగా పుట్టింటికి అంతర్ధానమవుతుంది."

మాస్టరుగారు అప్పుడప్పుడూ నవ్వొచ్చే మాటలు చెపుతూ ఉండేవారు. కానీ వారెప్పుడూ నవ్వేవారు కారు.

* * *

"తాతయ్యా, మా మాస్టరుగారిని గురించి కథ వ్రాయాలంటే ఎలా వ్రాస్తారు!" అని పాపక్క నన్ను అడి గింది.

"అలాంటప్పుడు ఆ కథ ఏ పదిలక్షల సంవత్సరాల తరువాతనో జరిగినట్లు చెప్పాలి."

"అంటే మీరు విచిత్రమైన కథలు వ్రాస్తారనిఅర్థమా? దానిలో ఆధునిక కాలానికి సంబంధించిన దేమీఉండదనే గదా! ఆధునికులు మిమ్మల్ని అవునని కాదని విమర్శించే అవ కాశం లేకుండా తప్పించుకోవాలని మీ అభిప్రాయం కావ చ్చును."

"సాహిత్యవేత్త లెవరూ విమర్శలకు భయపడరు. అసలు విషయమేమంటే మరొక యుగానికిగాని నా కథలు రాణించవు. ఎందుకనో చెపుతాను విను. ఇనుము, రాయి మొదలగు బరువైన మోటువస్తువులే భూమి పుట్టిన ప్రారంభ

యుగంనాటి సామగ్రి. చాలా కాలం వరకు నాటికి ఒక రూపం కల్పించే ప్రయత్నం సాగింది అనేకయుగాల వరకు ఈ పృథ్వి అసహ్యంగా అతికఠోరంగా ఉండేది. చివరకు మెత్తని మట్టి పృథ్విని శ్యామల వర్ణంతో కప్పివేసి సృష్టికర్త మర్యాదను కాపాడింది. అప్పుడు ఈ భూమి మీద మాంసము ఎముకలబరువుతో స్థూపాకార జీవజంతువులు అవతరించాయి. లావాటి చర్మము నాలుగైదు వందల మణుగుల బరువైన అసహ్యకరమగు తోకలతో తిరుగుతూ ఉండే జంతువులు! నిజంగా అవి చూడదగిన జంతువులే! కానీ, ఆ దైత్యాకార జంతువులు సృష్టికర్తకు నచ్చలేదు. తరువాత మళ్ళీ అనేక యుగాలవరకు కఠిన పరీక్ష జరుగుతూనేఉంది చివరికి మనస్సు కలిగిన మానవుడు అవతరించాడు. తోకచిన్నదయింది, శరీర పరిమాణం కూడా తగ్గింది, కఠిన చర్మము మెత్తగామారి శరీరమయింది. క్రమంగా కొమ్ములు పోయాయి, తోక లేదు, గిట్టలులేవు. వాడియైన గోళ్ళులేవు, నాలుగు కాళ్ళకు బదులు రెండేకాళ్ళు వచ్చాయి. సృష్టిని క్రమంగా సూక్ష్మంగా తయారుచేయటానికి సృష్టికర్త అనుక్షణం మెరుగులు దిద్దుతూ వచ్చాడనేది అర్థంచేసుకొన్నావుగదా! స్థూలమూ సూక్ష్మములతో మానవ శరీరం నిర్మితమయింది. మనస్సుకు శరీరానికి అనుక్షణం సంఘర్షణ జరుగుతూనే ఉంటుంది. 'ఇది కూడా కుదరలేదు' అంటూ బ్రహ్మ తల అడ్డంగా త్రిప్పాడు. ఆ లక్షణాలనుబట్టి ఇదికూడా నిలవదేమో అనిపిస్తుంది; కానీ, ఇప్పుడు మనిషి ఆశ్చర్యకరమగు ఆధునిక విజ్ఞాన సాధనాల ద్వారా తనను తానే చక్కదిద్దుకొంటాడు. మళ్ళీ కొన్ని

లక్షల సంవత్సరాలు ఇలా గడిచిపోతాయి. శరీరం అంతరించి మనస్సు ఏకేశ్వరరూపం ధరిస్తుంది. ఆవిశుద్ధ మనోయుగంలో శూన్యశరీర కక్ష్యలో మీ మాస్టరుగారు కూర్చొనిఉన్నారు. 'మనస్సు మీద మనస్సు పరిచి విద్యార్థులలో నిన్ను ఏకం చేసుకో' అనేదే వారు చదువుచెప్పే సిద్ధాంతం. బయటి బాధలనేవేమీ లేవనే అనుకో. ఒకసారి నువ్వు ఆ దృశ్యాన్ని వూహించుకొని చూడు ఎలాఉంటుందో!"

"స్థూలమైన బుద్ధివల్ల కూడా ఏమీ బాధ ఉండదా?"

"అది లేకపోతే బుద్ధిఅనేదే నిరర్థకమవుతుంది. మంచి చెడు, తెలివైనవాడు తెలివితక్కువవాడు అనే భేదం ఉండేదే గదా! స్వభావంకూడా రకరకాలుగా ఉంటుంది. భావాలలో విచిత్రత ఉంటుంది. కోర్కెలు స్వతంత్రంగా ఉంటాయి. ఆ అనేకమందిలో ప్రవేశించ గలవాడే ఇప్పుడిక మంచి మాస్టరు. చదువు మనసులలోనే సాగుతూ ఉంటుంది."

"తాతయ్యా, ఆ స్కూలు ఎక్కడ ఉన్నదో నేను ఊహించలేక పోతున్నాను."

"ప్రపంచంలో మూడు గృహాలున్నాయి: ఒకటి సాగరగర్భంలో ఉంది. రెండోది సూక్ష్మమగు వాయువు వెలుతురుగల ఆకాశంలోనూ ఉంది. మూడవది రాబోయే యుగం కోసం ఖాళీగా ఉంది."

"ఆ గాలి వెలుతురులోనే మీ క్లాసు జరుగుతూఉంది. కానీ, అక్కడ విద్యార్థుల ముఖాలు ఎలా వున్నాయి?"

"అది చెప్పటం కష్టమే. వారికి ఒక ఆకారమనేది ఉన్నది. కానీ, ఆకారానికి ఆధారం లేదు."

"అంటే, వారు రకరకాల రంగుల వెలుగుతో తయారయారన్న మాట."

"అంతే కావచ్చును. ఆ రోజున మీ సైన్సుమాస్టరు 'జగత్తులోని సూక్ష్మకాంతి కణమే బహురూపాలు పొంది స్థూలరూపంలో ఆకారాన్ని ధరించింది' అని చెప్పాడుగదూ! మీ రందరూ తరగతిలో వెలుతురు చేసుకొని కూర్చున్నప్పుడే వెలుగు తన ఆదిమ సూక్ష్మరూపంలో ప్రత్యక్ష మవుతుంది ముఖాలకు క్రీము పులుముకొనే అమ్మాయి లందరూ ఆ రోజున పూర్తిగా మారిపోతారు."

"మారిపోవచ్చునేమిటె,- వెలుగు వస్తుందిగదా!"

"మార్పు అంటే వెలుగు రావటమే."

"నేను ఏ రంగు వెలుగు నవుతాను, తాతయ్యా?"

"బంగారురంగు."

"మరినువ్వో?"

"నేను విశుద్ధ 'రేడియమ్' గా మారిపోతాను."

"ఆరోజున వెలుగుకు వెలుగుకు మధ్య యుద్ధం జరగదు కదా? ఎలక్ట్రానులకోసం దెబ్బలాటలు, దొమ్మీలుజరగవా?"

"నువ్వు నన్ను ఆలోచనలో పడేశావు. 'లీగ్ ఆఫ్ లైట్స్' స్థాపన అవసరమయేట్లు కన్పిస్తుంది. ఎలక్ట్రానులకోసం యుద్ధాలు జరుగుతున్నట్లు ఇప్పటినుంచే వదంతులు విన్పిస్తున్నాయి "

"మంచిదేకదా, తాతయ్యా! నీ భాషలో అద్భుతమైన వీరరస కావ్యాలకు మంచి సామాగ్రి లభిస్తుంది.- మరచాను, భాష వుంటుందా?"

"శబ్దరూపంలోని భాష శుద్ధమగు భావ భాషగా పరిణతి పొందుతుంది. వ్యాకరణం కంఠస్థం చేయవలసిన అవ సరం వుండదు."

"మరిపాటలో?"

"పాటలు రంగులతో స్నేహంచేస్తాయి. అప్పుడది అంత సరళంగా వుండదు. సంగీతం అప్పుడు ప్రకాశిస్తూ వుంటుంది. ఆకాశం చుట్టూ కాంతిని వెదజల్లుతూ వుంటుంది"

"అప్పుడు నీగద్యకావ్యాలుఏమవుతాయి, తాతయ్యా?"

"నాటిలోనికి బంగారు ఎలక్ట్రానులు, ఇనుప ఎలక్ట్రా నులు వచ్చి కలుస్తాయి."

"కానీ, అప్పటి నాయనమ్మలకు నచ్చవేమో?"

"ఆ నాటి ఆధునిక మనుమరాండ్రకు మాత్రం తప్పక నచ్చుతుందనే నమ్మకం నాకుంది."

"అలా అయితే నేనా కాంతియుగంలో మీ మనమ రాలిగా జన్మిస్తాను. ఈ జన్మలో దేహంతో జన్మించాను గనుక ధైర్యంగా వుండండి: నేనిక సినిమాకు వెళ్ళొస్తాను."

"ఏ సినిమాకు?"

"సీత వనవాసం."

# 14

మర్నాడు వుదయం నాస్తాచేసే సమయానికి నేను చెప్పిన ప్రకారం పాపక్క మట్టిపాత్రలో నానబెట్టిన శనగలు బెల్లము తీసుకొచ్చింది. ప్రస్తుత నవీన యుగంలో పూర్వ

కాలంనాటి గౌడీయ ఆహార పద్ధతిని పునరుద్ధరించాలని ప్రయత్నిస్తున్నాను.

"టీ త్రాగవచ్చునా?" అని అడిగింది పాపక్క.

"వద్దు, ఖర్జూరకాయల రసం కావాలి" అన్నాను నేను.

"ఇవాళ మీ ముఖం అదోమాదిరిగా వున్నట్లుంది. ఏదైనా పీడకల వచ్చిందా ఏం?"

"కలలు నీడలు మనస్సు మీద నుంచే రాకపోకలు సాగిస్తూ వుంటాయి. స్వప్నమూ అదృశ్యమవుతుంది. దాని నీడ జాడ కూడా కన్పించదు. ఇవాళ నీ చిన్నతనపు విషయం ఒకటి మాటిమాటికి గుర్తొస్తూ ఉంది, చెప్పాలనే కోర్కెగా ఉంది."

"ఏమిటో చెప్పండి."

"ఆ రోజున నేను వ్రాతపని ముగించుకొని వసారాలో కూర్చొని ఉన్నాను. నువ్వూ, సుకుమార్ కూడా అక్కడే వున్నారు. సాయంత్రమయింది వీధిదీపాలు వెలిగాయి. నేను సత్యయుగాన్ని గురించి అనేక సంగతులు కల్పించి చెప్తున్నాను."

"కల్పించి చెప్తున్నారా! అంటే, మీరు దానివి అసత్యయుగం చేసివేస్తున్నారన్నమాట!"

"దానిని అసత్యమని అనరు. సూర్యకిరణాలు దిగంతాన్ని దాటి వెళ్ళిపోతాయి. అప్పుడవి కన్పించనంత మాత్రాన వాటిని మిథ్య అని చెప్పలేము. అదికూడా వెలుగే చరిత్రలోని ఆ దిగంతానికి అవతల కాంతిలోనే మానవుని సత్యయుగ సృష్టిఉంది."

"వివరంగా చెప్పనవసరంలేదు. తరువాత ఏంజరిగిందో చెప్పండి."

"సత్యయుగంలో మనుష్యులు పుస్తకాలు చదివిగానీ, వార్తలు వినిగానీ తెలుసుకొనేవారుకాదు. తాము దానిలో లీనమై దానిని గురించి తెలుసుకోవటం ఆనాటి పద్ధతి అని నేను మీతో చెపుతున్నాను."

"అంటే ఏమిటో నాకు స్పష్టంగా అర్థంకాలేదు."

"శ్రద్ధగా విను. నన్ను నువ్వు ఎరుగుదువనేగదా నీ ఉద్దేశ్యం?"

"ఉద్దేశ్యమేగాదు, గట్టిగా నమ్ముతున్నాను."

"కానీ నన్ను నువ్వు ఎరుగుదువనే దానిలోనే నన్ను నువ్వేమీ ఎరగవని తెలియుదా? నన్ను తెలుసుకోవాలని అనుకోగానే 'నువ్వు' లోలోపల 'నేను' కాగలిగినప్పుడే నువ్వు నన్ను తెలుసుకొన్నది నిజంగా తెలుసుకోవట మవుతుంది."

"అంటే, మనకేమీ తెలియదనేగదా మీరు చెప్ప దలచినది?"

"అంతే, మనకేమీ తెలియదు. అందరమూ కలిసి తెలుసు అని అనుకొన్నాం. ఆ అనుకొన్నదాని ఆధారంతోనే మన పనులన్నీ సాగిపోతున్నాయి."

"పనులన్నీ సవ్యంగానే జరుగుతున్నాయిగదా!"

"జరుగుతున్నాయి, గానీ ఇది సత్యయుగంలో మాదిరి జరగటంకాదు. ఆ విషయమే నేను ఆలోజన మీతో చెపుతున్నాను- సత్యయుగపు మనిషి చూడటాన్ని తెలుసుకోవటం అనేవాడు కాదు. స్పర్శను కూడా అతడు తెలుసు

కోవటంగా భావించేవాడు కాదు. దానిలో తానూ లీనమై మాత్రమే అతడు తెలుసుకొనేవాడు."

స్త్రీల మనస్సు ప్రత్యక్షంగా కన్పించే దానినే నమ్ముతుంది అందువల్ల నేను చెప్పేది పాపక్కకు అవాస్తవంగా కన్పిస్తాయేమో, ఆమెకు నచ్చవేమోనని ఆలోచిస్తున్నాను. కానీ ఆమె చాలా ఉత్సాహం చూపుతున్నట్లే కన్పించింది.

"చాలా ఆసక్తిగానే ఉంది" అని అంది పాపక్క.

తరువాత ఆమె మరింత ఉత్సాహంగా "అదిసరే, తాతయ్యా, ఆధునిక విజ్ఞానం చాలా గొప్ప గొప్ప పనులు సాధిస్తుందిగదా; చనిపోయిన మనిషి పాటను విన్పిస్తూ ఉంది, సీసముతో బంగారం చేస్తున్నారని కూడా వింటున్నాను- ఇదేవిధంగా మనం కోరినప్పుడు ఇతరుల మనసులో లీనమై పోగలటం కూడా సాధించగలరేమో!"

"అసంభవ మేమీ కాదు. కానీ అప్పుడు నువ్వేమి చేస్తావు? మనసులో ఏమీ దాచుకోలేవు."

"అది చాలా విచిత్ర విషయమే! ప్రతి మనిషికి ఏదో ఒక రహస్యం ఉంటుందిగదా!"

"దాచుకొంటారు గనుక దాచుకొనే విషయాలు ఉంటాయి. దాచుకొనేవి ఎవరికీ ఏమీ లేనప్పుడు అందరూ అందరి విషయాలు తెలుసుకొని వ్యవహరిస్తారు."

"సిగ్గుపడే విషయాలు కొన్ని వుంటాయిగదా!"

"సిగ్గుపడే విషయాలన్నీ బహిరంగంగా జరిగితే ఇక సిగ్గు అనేది మాత్రం ఎక్కడుంటుంది?"

"సరే, నా విషయం ఏదో చెప్తున్నారుగదూ, అదే మిటి?"

"ఆ రోజున నువ్వా సత్యయుగంలో జన్మిస్తే నిన్ను ఏ రూపంలో చూచుకోవా లనుకొంటున్నావు అని అడిగాను నిన్ను. అందుకు జవాబుగా నువ్వు వెంటనే "కాబూలీ పిల్లివలె" అని చెప్పావు"

ఈ మాటవిని పాపక్కకు కోపం వచ్చింది- నేనలా ఎంతమాత్రం అని ఉండను. నువ్వు కల్పించి చెప్తున్నావు" అని అంది.

"నేను చెప్పే సత్యయుగం నేను కల్పించిందికావచ్చు, కానీ నీ నోటనుంచి వచ్చినమాట నువ్వన్నదేకదా. నాలాంటి మాటకారి కూడా వెంటనే అలాంటి జవాబు చెప్పలేడు."

"ఆ జవాబు విని నేను తెలివితక్కువదానినని మీరు అలోచించారా?"

"కాబూలీ పిల్లిని సంపాదించే మార్గం ఏదీ కన్పించక పోయేసరికి నీకు అదంటే చాలా ఆసక్తి కలుగుతుందని ఆలోచించాను. పిల్లులు మొదలగు జంతువులంటే మీ నాన్నగారికి సరిపడని కారణంవల్ల అది నీకు దుర్లభమైనది గనుక నీ మనస్సు అటే ఆకర్షించబడుతూ ఉండేది. సత్యయుగంలో పిల్లులు కొనటానికి దొరకవుగనుక కావాలంటే తామే పిల్లి కావాలని కోరుకోవచ్చును."

"మనిషిని, పిల్లినైపోతాను! దానివల్ల కలిగిన లాభం ఏమిటి? దానికంటే పిల్లిని కొనుక్కోవటం మంచిది, కొనలేక పోయినా మంచిదే."

"ఇదుగో చూడు, మనం సత్యయుగాన్ని గురించి మాట్లాడుకుంటున్నాం దానిని గురించి నీకు ఒక నిశ్చితాభిప్రాయమే లేదు. సత్యయుగపు పాపకట్ట నా ప్రదేశాన్ని పిల్లివరకు పెంచుతుంది. ప్రదేశం లోపించదు. నువ్వు 'నువ్వు' గానూ ఉంటావు, 'పిల్లి' గానూ ఉంటావు."

"మీరు చెప్పే ఇలాంటి మాటలన్నింటికీ ఏమీ అర్థం ఉండదు."

"సత్యయుగపు భాషలో దీనికి అర్థాలు ఉన్నాయి ఆ రోజున మీ మాస్టరు ప్రథమ నాథుడు కాంతిలోని అణుపరమాణువర్షం వలెనే, కణవర్షము ఉంటుంది, నదీప్రవాహమూ ఉంటుంది. 'ఇదైనా కావచ్చు లేదా అదైనా కావచ్చును' అని మనం మన సాధారణమగు తెలివి తేటలతో అర్థంచేసుకొంటాము. కానీ విజ్ఞాని బుద్ధి ఒకేసారి రెండు వస్తువుల్నీ అంగీకరిస్తుంది. అదేవిధంగా నువ్వు ఏకకాలంలో పాపకట్ట గానూ ఉంటావు, పిల్లిగానూ వుంటావు. ఇది సత్యయుగపు విషయం."

"తాతయ్యా, వయస్సు పెరుగుతున్నకొద్దీ మీ మాటలు మీ కవిత్వాల వలెనే మరీ అర్థంకాకుండా తయారవుతున్నాయి."

"చివరికి పూర్తిగా గంభీర నిశ్శబ్దం ఆవరిస్తుంది. దానికి పూర్వలక్షణాలు ఇవే"

ఆ రోజున 'కాబూలీ పిల్లి' విషయం తరువాత అంతటితో సంభాషణ ఆగిపోయిందా!"

"లేదు, తరువాత కూడా సంభాషణ జరిగింది. సుకుమార్ ఒక మూల కూర్చొని ఉన్నాడు. అతడు ఏదో కలను గురించి చెప్పినట్లుగా మనవైపు తిరిగి "సత్యయుగంలో నేను ఓకిచెట్టు కావాలని కోర్కెగా ఉంది'' అని అన్నాడు.

సుకుమార్‌ను ఉత్సాహపరిచే అవకాశంలభిస్తే నువ్వు చాలా సంతోషించే దానివి కానీ, అతడు ఓకిచెట్టు కావాలనుకొంటున్నాడనే మాట విని ఎంత నవ్వావో చెప్పలేను. దానితో అతడు సిగ్గుపడిపోయాడు. అందుకని నేను అతని పక్షం వహించి ఇలా అన్నాను: "దక్షిణపు గాలి ఎటు నుంచివీచింది, చెట్లన్నీ పుష్పాలతో నిండివున్నాయి. వాటిలో మాయామంత్రంలాంటి అదృశ్య ప్రవాహ మేదో ఉంది, అందానికి అందం- మైమరపించే సువాసన! ఇలాంటి సమయాల్లో మనసులోని ఆవేశాన్ని వ్యక్తంచేయాలనే కోర్కెను అణచుకోవటం సాధ్యం కాదు. చెట్టుకానిదే వసంతావం దాన్ని అనుభవించటం సాధ్యంకాదు.''

నా మాటలు విని సుకుమార్‌కు ఉత్సాహం కలిగింది. "నా పడక గదికి ఎదురుగా ఒక ఓకిచెట్టుఉంది. నేను మంచం మీద పడుకొని దాని శిరోభాగం వైపు చూస్తూ వుంటాను. అది స్వప్నలోకంలో విహరిస్తుందా అన్నట్లు కన్పిస్తూ ఉంటుంది'' అని అన్నాడు సుకుమార్.

ఓకిచెట్టు స్వప్నలోకంలో విహరిస్తుంది ఈ మాట విని నువ్వు 'ఏం తెలివి తక్కువ మాటలివి!' అని అనాలను

కొంటున్నట్లు కన్పించావు, కానీ, నేను మధ్యలో కల్గించు కొని "ఆకుచెట్టు జీవితమంతా పూర్తిగా స్వప్నమే. అది స్వప్నంలోనుంచి వచ్చింది. బీజము నుంచి అంకురంగా, అంకు రంనుంచి వృక్షంగా తయారయింది. గాని ఆకులు స్వప్నంలో మాట్లాడే మాటలవంటివి" అని అన్నాను.

నేను సుకుమార్ వైపు తిరిగి "ఆ రోజు ఉదయమే వర్షం కురుస్తూ ఉంది. నువ్వు ఉత్తరపు వైపు వరండాలో మొదల కుండా నిలబడి ఉన్నావు నువ్వు అక్కడ నిలబడి ఏమి ఆలో చిస్తున్నావు?" అని అడిగాను.

"ఏమి ఆలోచిస్తున్నానో తెలియదు" అని అన్నాడు సుకుమార్.

"మేఘాలతో నిండిన ఆకాశంవలె ఆ తెలియదనే ఆలోచనతోనే నీ మనస్సంతా నిండివుంది. చెట్లు నిశ్చలంగా నిలబడి ఉంటాయి. వాటిలోకూడా ఒక విధమైన తెలియదనే భావమే ఉంటుంది, వాటిలోని ఈ భావమే వర్షములో మేఘాల క్రింద వ్యాపిస్తుంది, శీతాకాలంలో ఉదయపు ఎండలో ప్రకాశిస్తుంది. ఆ తెలియని భావపు భాషలో చెట్ల మీది లేతచిగుళ్ళు మాట్లాడుకొంటాయి వాటి పూతలో మధుర సంగీతం విన్పిస్తుంది" అన్నాను నేను.

ఆ మాటలు విన్నప్పుడు అతని కన్నుల్లో కన్పించిన కాంతి నాకీనాటికీ గుర్తుంది.

"నేను వృక్షమును కాగలిగితే నా శరీర మంతటినుంచి లేత చిగుళ్ళ సంభాషణ జరజర ఆకాశంలోని మేఘాలవైపు సాగిపోతుంది" అని అన్నాడు సుకుమార్.

సుకుమార్ ది పైచేయి కావటం నువ్వు గమనించావు. వెంటనే అతనిని నేపథ్యంలోకి నెట్టివేస్తూ నువ్వు రంగంమీదికి వచ్చావు

"తాతయ్యా, ఒకవేళ ఇప్పుడు సత్యయుగంవస్తే అందులో మీరు ఏమి కావాలని కోరుకొంటారు" అనే ప్రశ్నతో సంభాషణ ప్రారంభించావు.

ఇంతకుముందు మనిద్దరిమధ్య జీవచరిత్రలోని ప్రథమ అధ్యాయంలోని ప్రాణులని గురించి చర్చజరిగినందువల్ల ఆ కాలపు జంతువులలో దేనిపేరైనా చెప్తానేమోనని నువ్వు ఆలోచించావు. ఆనాటి ప్రాణులను గురించి తెలుసుకోవాలనే ఆసక్తి నాలో ఉన్నట్లు నువ్వు నా మాటలవల్ల గ్రహించావు అందువల్ల నేను 'ఆ కాలపు నాలుగుదంతాలుగల భయంకర మైన ఏనుగును కావాలను కొంటున్నాను' అని జవాబు చెపితే నువ్వు చాలా సంతోషించేదానివి, నువ్వు 'కాబూలీ పిల్లి' కాగోరిన దానికంటె ఇది గొప్పదేమీ కాదు, నేను కూడా నీ పక్షాన చేరినట్లు భావించే దానివి. మరొకప్పుడైతే నేను అలాంటి జవాబే చెప్పి ఉండేవాడినేమో! కానీ, సుకు మార్ మాటలు నామనస్సును మరోవైపుకు ఆకర్షించాయి

"అవునవును, నాకు తెలుసు, సుకుమార్ ఆలోచనలు మీ ఆలోచ లూ ఒకటే" అని నువ్వు అన్నావు.

"అవును, అతడు బాలుడు, నేనూ ఒకప్పుడు బాలు డనే. నా చిన్నతనంలోని ఆలోచనలవలెనే అతడూ ఆలో

చిస్తున్నాడు అప్పుడు నువ్వు కుండ, చట్టి మొదలగు పాత్ర సామాగ్రితో భవిష్యత్తులోని సంసారస్వప్నం చూచి సంతోషిస్తున్నావు. నేను దూరంగా నిలబడే ఆ ఆటలు చూచేవాడిని. నువ్వు ఆటలోని నీ ముద్దుల కుమారుని ఎత్తుకొని ఆడిస్తూ మురిసి పోతున్నావు, అందులో నాకేమీ ఆనందం కన్పించలేదు "

"ఆ విషయాన్ని వదలివేయండి. ఆ రోజున మీరేమి కావాలని కోరుకొన్నారో అది చెప్పండి" అని అడిగింది పాపక్క.

"నేను దూరదూరంవరకు వ్యాపించిన ఒక దృశ్యంగా కావాలని కోరుకొన్నాను. ఉదయ కాలపు మొదటి జాము నైతే, మాఘమాసం అంతంలో గాలి హడావిడి హెచ్చుతుంది. ముసలి రావిచెట్టు పిల్లలవలె చలించి పోతుంది నదీ ప్రవాహంలో కలవరం సాగుతూ ఉంటుంది. మిట్టపల్లాల భూమిమీద వరుసగా ఉన్న వృక్షసమూహం మసకమసకగా కన్పిస్తూ ఉంటుంది. వాటన్నిటి వెనుక అనంతాకాశం, ఆ ఆకాశంలో ఒక విధమైన దూరభావం గోచరిస్తుంది చాలా దూరం అవతలనుంచి గంటలధ్వని గాలితో కలిసి రానురాను క్షీణస్వరంలో విన్పిస్తున్నట్లుగా ఉంటుంది. ఆ ధ్వని 'సమయం గడిచిపోతుంది' అనే తన మాటను ఎండలో కలిపి వేస్తున్నట్లుంది."

ఒక చెట్టు కావాలని కోరటంకంటె నది కావాలని కోరటం, ఆకాశంతో పాటు ఒక సమగ్ర భూమి దృశ్యాన్ని కావాలని కోరినట్లు వూహించుకోవటం నీకు చాలానచ్చినట్లు కన్పించింది.

"చెట్లుమొక్కలు, నది ఆకాశం అన్నిటిమీద వ్యాపించి మీరు వాటిలో లీనమైపోయారు అని వూహిస్తేనే చాలా ఆనందం కలుగుతుంది. అది సరేగానీ, ఏనాటికైనా సత్య యుగం వస్తుందంటారా?" అన్నాడు సుకుమార్.

"అది రానంతవరకు చిత్రాలు, కవిత్వము ఉండనే ఉంటాయి. తనను తాను మరేదో కావాలనుకోటానికి ఇదొక్కటే గొప్పమార్గం."

"మీరు ఇప్పుడు చెప్పిన విధంగా మీరు ఏదైనా చిత్రాన్ని వ్రాశారా?" అని అడిగాడు సుకుమార్.

"అవును, చిత్రించాను"

"నేను కూడా చిత్రిస్తాను."

"అతడు నాతో పోటీపడటం చూచి "నువ్వు చిత్రించగలవా?" అని అడిగావు నువ్వు.

"తప్పకుండా చిత్రించగలవు చిత్రించేశావుగదూ! నీ చిత్రాన్ని నేను తీసుకొని నా చిత్రాన్ని నీకిస్తాను" అన్నాను నేను .

ఆ రోజున సంభాషణ అంతటితో ఆగిపోయింది.

*　　　*　　　*

ఆ విషయాన్ని గురించి తరువాత జరిగినది కూడా చెప్తున్నాను. నువ్వు పావురాలకు మేతపెట్టటానికి వెళ్ళిపోయావు సుకుమార్ మాత్రం అక్కడే కూర్చుని ఏదో ఆలోచిస్తున్నాడు. నేను అతనిని చూచి "ఏమిటో ఆలోచిస్తున్నావు, నాతో కూడా చెప్పరాదా!" అని అన్నాను.

"మీరు చెప్పండి చూద్దాం" అన్నాడు అతడు.

"మరింకా ఏదైతే బాగుంటుందా అని ఆలోచిస్తు న్నావు మొదటిరోజు వర్షంతో తడిసిన ఆకాశం కాగోరు తున్నావేమో, పూజాశలవులకు తెరచాప నెత్తుకొనిపోయే నావ కాగోరుతూ ఉంటావు! ఈ విషయంలో నా జీవితంలో జరిగిన ఒక సంగతి చెపుతాను విను. ధీరూను నే నెంత ప్రేమించేవాడినో నీకు తెలుసు. అతనికి చాలా జబ్బుచేసి నట్లు అకస్మాత్తుగా టెలిగ్రాం వచ్చింది నేను అతనిని చూడ టానికి ఆ రోజు సాయంత్రమే మున్షీగంజ్‌కు బయలుదేరాను. ఆ రోజున ఎండ చాలా తీవ్రంగా ఉంది దారిలో దూరాన ఎక్కడో ఒకపక్క ఆర్తనాదం విన్పించింది. అది వినగానే మనస్సు వికలమై పోయింది. మూడోజామున కూడా ఎండ తీవ్రత తగ్గలేదు, చెట్లనీడ వసారాలో పడుతూ ఉంది. పేట లోని గొల్లస్త్రీవచ్చి "అబ్బాయిగారి ఆరోగ్యం ఎలాఉంది?" అని అడిగింది. "జ్వరం కొద్దిగా తగ్గింది, తలనొప్పి ఎక్కు వగా ఉంది" అని జవాబు చెప్పాను నేను అక్కడ అతనికి శుశ్రూష చేస్తున్నవారిలో కొందరికి విశ్రాంతి లభించింది. ఇద్దరు డాక్టర్లు రోగి గదిలో నుంచి బయటకువచ్చి ఏదో గుస గుసలాడుతున్నారు. ఆశాచిహ్నాలేమీ లేవని అర్థం చేసు కొన్నాను. మెదలకుండా కూర్చొని ఆలోచించసాగాను! విని చేయగలిగింది మాత్రం ఏముంది! సాయంత్రమయింది ఎదు

రుగా ఉన్న వేపచెట్టు నెత్తిమీద ఒక నక్షత్రం కన్పించింది, దూరాన రోడ్డుమీద జనపనార తెచ్చే బళ్ళచప్పుడు ఇప్పుడు విన్పించటం లేదు. ఆకాశమంతా దుఃఖావల్ల స్పృహ తప్పుతున్నట్లుగా ఉంది. ఎందుకనో ఏమో నాలో నేను ఇలా అనుకోసాగాను: 'పశ్చిమ ఆకాశం నుంచి రాత్రి స్వరూపిణియగు శాంతిస్నేహభావంతో, నల్లగా, నిశ్శబ్దంగావస్తూవుంది ప్రతి రోజూ ఆమె వస్తూనే వుంటుంది. కానీ ఇవాళ ఒక ప్రత్యేక రూపంలో, ప్రత్యేక స్పర్శతో వచ్చింది.' నేను కళ్ళుమూసుకొన్నాను. నెమ్మదిగా వచ్చే ఆ రాత్రియొక్క ప్రవేశము నా శరీరంలో సమస్త అవయవాలను, మనస్సును కప్పివేసినట్లుంది. మళ్ళీ నాలో నేను ఇలా అనుకొన్నాను: 'ఓ శాంతీ ఓరాత్రీ, నువ్వు నా అక్క-వు నువ్వు అనాది కాలపు అక్క-వు. దినాంతమందున్న ద్వారం చెంత నిలబడి నువ్వు నీ పిరికి సోదరుని నీ హృదయం వద్దకు చేర్చుకో. అతనిలో రగులు జ్వాల పూర్తిగా శాంతించాలి'- రెండుజాములు గడిచాయి; రోగి తలవైపు నుంచి ఒక శోకం విన్పించింది. నిశబ్దాన్ని చీల్చుకొంటూ డాక్టర్లబండి వెళ్ళిపోయింది. ఆ రోజు తనివిదీరా నేను రాత్రియొక్క స్వరూపాన్ని చూశాను. ధ్యాననిమగ్నమగు నిశీథి ఆవరణలో తన స్వతంత్రాన్ని విలీనం చేయు భూమాతవలె నేను కూడా ఆ రాత్రిలో లీనమై పోయాను."

సుకుమార్ మనస్సులో ఏమి ఆలోచించాడో ఏమో గాని అకస్మాత్తుగా అతడు వ్యాకులతతో ఇలా అన్నాడు,

"కానీ, మీ ఆ అక్క నన్ను అంధకారంలో నుంచి అలా వెదలకుండా తీసుకువెళ్ళరు. పూజ శెలవులలో ఉదయం పది గంటలయినప్పుడు ఎవరూ స్కూలుకు వెళ్ళనవసరం లేదు; ఆ రోజున పిల్లలందరూ రథం ఎదుట మైదానంలో చేరి బంతి, చెడుగుడి ఆడుతూ ఉంటారు శెలవురోజున ఆటకు వెళ్ళినట్లే నేను తీవ్రమైన ఎండలో ఒకసారిగా ఆకాశంలో అదృశ్యమై పోతాను."

తరువాత నేనేమీ మాట్లాడలేదు.

"నిన్నటినుంచి మీరు ఎప్పుడుబడితే అప్పుడు సుకుమార్‌ను గురించిన విషయాలే చెప్తున్నారు. చిన్నతనంలో మేమిద్దరం మిమ్మల్ని ఎవరు ఎక్కువగా ప్రేమిస్తున్నాము అనే విషయాన్ని గురించి తగాదా పడుతూ ఉండేవాళ్ళం. ఇప్పటికీ అలాగే ఉన్నామని మీరు అనుకొంటున్నారా?" అని అడిగింది పాపక్క.

"అగికూడా కొంతఉంటే ఉండనూ వచ్చు. మిగిలి వున్నదానిని కాస్త అరగదీసి శుభ్రం చేయటానికే మాటి మాటికి నేను ఆ విషయమే మాట్లాడుతున్నాను. మరొక కారణం కూడా వుంది."

"ఏమిటో ఆ కారణం చెప్పండి."

"కొద్దిరోజుల క్రితం సుకుమార్ తండ్రి డాక్టరు నిశాంయి చంద్రుడు ఇక్కడికి వచ్చివెళ్ళాడు. నా వద్ద శెలవు తీసుకు వెళ్ళటానికే వచ్చాడు."

"శలవు తీసుకు వెళ్ళటానికా, ఎందుకు?"

"నీతో చెప్పాలను కొంటున్నానే కానీ చెప్పలేక పోయాను. ఇవాళ చెపుతాను విను."

సుకుమార్ 'లా' చదవాలని నితాయిచంద్రుని అభి లాష, నందలాల్ బాబువద్ద చిత్రకళ నేర్చుకోవాలని సుకు మార్ ఆశయం.

"చిత్రకళవల్ల చేతినిండా పని ఉంటుందే కాని కడుపు నిండా తిండి దొరకదు" అని అన్నాడు నితాయి చంద్రుడు.

"నా ఆకలి తిండితోకంటే చిత్రకళతోనే తీరుతుంది" అని జవాబు చెప్పాడు సుకుమార్.

అతని జవాబుకు నితాయి చంద్రునికి కోపంవచ్చింది. "తేలికగా ఆకలి తీరుతూ వుంది గనుక నీ కింకా ఆ విషయం అర్థమయ్యే అవసరం రాలేదు" అని అన్నారు.

సుకుమార్‌కు తండ్రి మాటలు కష్టం కలిగించాయి. కానీ, అతడు నవ్వుతూ "అదీ నిజమే, అదికూడా ఆలోచించ వలసిన విషయమే" అన్నాడు.

అది విని అతడు 'లా' చదవటానికి అంగీకరించాడనే అనుకొన్నాడు నితాయి చంద్రుడు. సుకుమార్‌కు తాతయ్య ఉన్నాడు. అతడొక వెర్రివాడు. సుకుమార్ స్వభావంకూడా తాతయ్య స్వభావాన్నే పోలివుంటుంది. తాతయ్య పోలిక లున్నాయని కూడా అంటారు. ప్రాణస్నేహితులకువలె వాళ్ళి

ద్దరూ చాలా అన్యోన్యంగా ఉండేవారు. ఇద్దరూ కలిసి ఆలోచించారు. సుకుమార్‌కు తాతయ్యే డబ్బిచ్చాడు. అతడు విదేశాలకు ఎప్పుడు వెళ్ళినదీ ఎవరికీ తెలియదు. తండ్రికి ఒక ఉత్తరం వ్రాసిపెట్టాడు: "నేను చిత్రకళ నేర్చుకోవటం మీకు ఇష్టంలేదు. నేను నేర్చుకోను. నేను డబ్బు సంపాదించే విద్య నేర్చుకోవాలని మీరు ఆశించారు. అది నేర్చుకోనుటకే నేను విదేశాలకు వెళుతున్నాను. విద్య పూర్తయిన తరువాత మీ ఆశీర్వాదం పొందటానికి వస్తాను."

అతడు ఏ విద్య నేర్చుకోవాలని వెళుతున్నాడో ఎవరితోనూ చెప్పలేదు. అతని డెస్కులో ఒక డైరీ కన్పించింది. దాని మూలంగా అతడు విమానం నడిపే విద్య నేర్చుకోనుటకు విదేశాలకు వెళ్ళినట్లు తెలిసింది. డైరీలోకొంత భాగాన్ని నేను వ్రాసుకొన్నాను. అదేమంటే,-

"నా ఛత్రపతి పక్షిరాజుమీద ఎక్కి పాపక్కను చంద్రలోకం నుంచి తీసుకొని వచ్చుటకు మా డాబామీద ఇటునుంచి అటూ, అటునుంచి ఇటూ ప్రయాణం చేసిన సంగతి నాకింకా బాగా గుర్తుంది. ఇప్పుడు యంత్రమున్న పక్షిరాజును వశపర్చుకొనుటకు వెళుతున్నాను. విదేశాలలో చంద్రలోకానికి వెళ్ళే ప్రయత్నాలుకూడా జరుగుతున్నాయి. అవకాశంగనుక లభిస్తే నేను కూడా యాత్రికులలో నా పేరిస్తాను. ప్రస్తుతం ఆకాశమార్గాన భూప్రదక్షిణం చేయటం

నేర్చుకొంటాను. ఒకనాడు నేను పాప తాతగారిని చూచి ఒక చిత్రం వ్రాస్తే అది చూచి పాప నవ్వింది. ఆనాటి నుంచి ఏకదీక్షగా పది సంవత్సరాలు చిత్రాలు వ్రాశాను కానీ ఎవరికీ చూపించలేదు. ఈ మధ్య వ్రాసిన రెండు చిత్రాలు మాత్రం వదలి వెళుతున్నాను. వాటిని పాప తాతగారికి ఇవ్వండి. వాటిలో ఒకజలస్థలఆకాశాల స్నేహతన్మయం అనే విషయాన్ని గురించి. రెండోది మా తాతగారి చిత్రం. పాప తాతగారు వీటిని ఆమెకు చూపించి ఆమె తన నవ్వును ఉపసంహరించుకొనునట్లు చేయాలి. అలా జరిగితే సరే, లేనట్లయితే ఈ చిత్రాలను చించి పారేయండి. నేనిప్పుడు చేయు ప్రయాణంలో చంద్రలోకానికి చేరకముందే పక్షిరాజు రెక్కలు తెగిపోవటం జరిగినా జరగవచ్చును. అలా గనుక జరిగితే, ఒక లిప్తలో నేను సత్యలోకానికి చేరుకొంటాను. నేను జీవించిగనుక ఉంటే, ఆకాశపు అంచుల్ని దాటే విద్యలో నైపుణ్యాన్ని పొందగలిగితే, ఏదో ఒకరోజున ఆకాశమార్గాన పాపను ప్రయాణం చేయించాలని మనసులో చాలా కోర్కెగా ఉంది. సత్యయుగంలో కోర్కె, జరగటమూ రెండూ ఒకేసారి ఉన్నాయేమో! ధ్యానయోగంతో కోర్కెనే జరిగినదిగా భావించటానికి ప్రయత్నిస్తాను. చిన్నతనం నుంచి కారణం లేకుండానే ఆకాశంలోకి చూచే అలవాటు ఉండేది నాకు. ఈ ఆకాశం అనేక లక్షల యుగాల పృథ్వియొక్క కోటానుకోట్ల కోర్కెలతో నిండి ఉంది. దానిలో లీనమై

ఉన్న కోర్కెలు విశ్వసృష్టికి ఎందుకు ఉపయోగిస్తాయో ఎవరికి తెలుసు! నేనివాళ ఎగరటానికి వెళ్ళే ఆ ఆకాశంలోనే నా కోర్కెల్ని కూడా విహరించ నివ్వండి."

పాపక్క వ్యాకుల పడుతూ లేచినిలబడి "ప్రస్తుతం అతని సంగతులేమిటి?" అని అడిగింది.

"అదే, ఏమీ తెలియటం లేదు. అందుకనే అతని తండ్రి అతనిజాడ తెలుసుకొనేందుకు విదేశాలకు బయలు దేరి వెళ్ళాడు."

పాపక్క ముఖం వెలవెల బోయింది ఆమె మెల్లగా అడుగులువేస్తూ అక్కడినుంచి వెళ్ళిపోయింది. తన గదిలోకి వెళ్ళి తలుపులు మూసివేసింది.

సుకుమార్ వ్రాసిన రెండు చిత్రాలు పాపక్క తన పెట్టెలో దాచుకొన్నదని నాకు తెలుసు.

నేను కళ్ళజోడు తుడుచుకొంటూ సుకుమార్ ఇంటి వేపు వెళ్ళాను. డాబామీదికి వెళ్ళిచూచాను. విరిగిపోయిన గొడుగు ఇప్పుడు అక్కడ లేదు. సగంకాలిన అవ్వాయ చువ్వాయ వెదురుపుల్ల కూడా అక్కడ కన్పించలేదు.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | IPL A101 13 196 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 197 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, 192, BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Soumya |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | sandhya |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | No |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |